# YUVABHARATHI

gratefully acknowledges the financial assistance extended by

**THE ASHOK KUMAR SANGHI CHARITABLE TRUST HYDERABAD**

*for*

the 'SANSKRUTA SAAHITHI LAHARI' programme, 1983

★

Ashok Kumar Sanghi Charitable Trust, started in 1970, runs Gopilal Murlidhar Sanghi College of Commerce, Hyderabad.

★

Ashok Kumar Sanghi Charitable Trust

* gives scholarships/books etc., for post-matric education;
* encourages self employment of physically handicapped persons through interest free loans.
* assists deserving projects/institutions/persons in the field of education, literature and medicine.
* Started on 1st October 1982, the 34th Birthday of its Founder at Mehdipatnam "Ashok Kumar Sanghi Memorial Polyclinic-Cum-Diagnostic Centre" has already served more than a lakh of needy patients.

The trust has at its disposal a lakh of rupees per year for rendering assistance. Suggestions are requested.

Please write to :

G. L. Sanghi,
Managing Trustee of the Trust,
1-8-582, Industrial Area Azamabad, Hyderabad-20.
PHONE : 6 2 6 8 0

# సంస్కృత సాహితీ లహరి

సుప్రసిద్ధ సంస్కృత నాటకాలు

భాసుని "స్వప్నవాసవదత్తం"
శూద్రకుని "మృచ్ఛకటికం"
కాళిదాసు "అభిజ్ఞాన శాకుంతలం"
భవభూతి "ఉత్తర రామచరిత్రం"
శ్రీహర్షుని "నాగానందం"
విశాఖదత్తుని "ముద్రారాక్షసం"

ప్రసిద్ధాంధ్ర సాహిత్య వేత్తలు :

శ్రీ మానాప్రగడ శేషశాయి, డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు,
ఆచార్య దివాకర్ల వేంకటావధాని, డా॥ ధూళిపాళ శ్రీరామమూర్తి,
శ్రీ కొత్తపల్లి ఘనశ్యామల ప్రసాదరావు, శ్రీ అవధానము చంద్రశేఖరశర్మ
గారల

ఉపన్యాస వ్యాసమంజరి

రిజిస్టర్డ్ నెం. 1/64

ప్రచురణ :

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు - 3

SAMSKRUTHA SAHITHI LAHARI

A collection of Lecture-essays on Six Sanskrit Classics

Bhasa's SWAPNA VASAVADATTAM

Sdudraka's MRUTCHHAKATIKAM

Kalidasa's ABHIGNANA SHAKUNTALAM

Bhavabhuthi's UTTARA RAMACHARITHAM

Sriharsha's NAGANANDAM

Visakhadatta's MUDRA RAKSHASAM

By

Sri Manapragada Seshashayi,

Dr. Pullela Sreeramachandrudu,

Professor Diwakarla Venkatavadhani,

Sri Dhulipala Sreerama Moorthy,

Sri Kothapalli Ghanasyamala Prasada Rao,

Sri Avadhanam Chandrasekhara Sarma.



ప్రచురణ సంఖ్య : 100

ప్రథమ ముద్రణ : డిసెంబరు 9, 1983

ప్రతులు : 4,200

ముఖచిత్ర రచన : శీలా వీర్రాజు

ముద్రణ : పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్, హైదర్‌గూడ, హైద్రాబాద్.

ముఖచిత్ర ముద్రణ : బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్, చిక్కడపల్లి, హైద్రాబాద్.

ప్రతులకు :

యువభారతి
5, కింగ్స్‌వే, సికిందరాబాదు - 500003 లేదా
యువభారతి కార్యాలయం
ఆంధ్రసారస్వత పరిషత్ భవనములు
తిలక్ రోడ్డు, హైదరాబాదు - 500001

వెల : రూ. 16-00

---

[ప్రచురణ పూర్వ విరాళం రూ. 8/- ఇచ్చిన సాహితీప్రియులకు అందజేయబడింది.]

# యువభారతి పరిచయము

ఉత్తమ అధ్యయనం వల్ల వ్యక్తిత్వానికి సమగ్రత చేకూరుతుంది. సమాజంలో సామరస్యం పెంపొందుతుంది. ఉత్తమ భావ ప్రసరణానికి పుస్తకాలు చక్కని సాధనాలు. అందరికీ అందుబాటులో ఉండే విధంగా మంచి పుస్తకాలను అందించే ప్రయత్నానికి యువభారతి పూనుకొని కడచిన ఇరువయ్యేళ్లగా పాత కొత్తల మేలుకలయికను ప్రాతిపదికగా పెట్టుకొని నూరు పుస్తకాలను ప్రచురించింది. ఉపన్యాసమంజరీ కార్యక్రమాలను, సదస్సులను నిర్వహించింది.

సహృదయుల సహకారంతో పుస్తకాల అమ్మకం వల్ల వస్తున్న ద్రవ్యంతో పుస్తకాలను ప్రచురిస్తూ తక్కువ వెలకు ఎక్కువ విలువ వున్న సాహిత్యాన్ని అందించడానికి యువభారతి ఉద్యమిస్తున్నది. ఉత్తమ సాహిత్య ప్రచారాన్ని ధ్యేయంగా పెట్టుకొని, ప్రచురణలను వెలువరిస్తున్నదే కాని మా సంస్థ వ్యాపార సంస్థ కాదు.

భారత దేశంలో ఎక్కడున్నాసరే యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలు పంచుకునేందుకు ప్రారంభింపబడిన సాహితీమిత్ర పథకంలో 8500 మంది సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతం చేసినారు. యువభారతీ భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన సభ్యత్వ పథకాలలో భారతీ మిత్రులుగా 975 మంది, భారతీ భూషణులుగా 125 మంది చేరారు.

హైదరాబాదు
డిసెంబర్, 9, 1983

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షులు, యువభారతి

# సంస్కృత సాహితీ లహరి

## ఉపన్యాస మంజరి - పుస్తక ప్రచురణ

## కార్యక్రమ వివరాలు

స్థలం: ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు
తిలక్ రోడ్డు, హైదరాబాద్-500 001.

### మొదటి సమావేశం

*9 డిశంబరు 1983 శుక్రవారము సాయంకాలం గం॥ 5-30 ని॥ లకు*

అధ్యక్షులు- ఆవిష్కర్తలు: శ్రీ అల్లాడి కుప్పుస్వామి గారు
(ఆంధ్రప్రదేశ్ హైకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి)

ముఖ్య అతిథులు: శ్రీ టి. యస్. ఆర్. నరసింహం గారు
(కమీషనర్ ఆఫ్ ఇన్‌కంటాక్స్ (రిటైర్డు), ఆంధ్రప్రదేశ్)

ప్రారంభకులు : శ్రీ దేవులపల్లి రామానుజరావు గారు
(అధ్యక్షులు : ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి)

ఉపన్యాసములు : ''భాసుని వాసవదత్తం'' నాటకాన్ని గూర్చి
శ్రీ మానాప్రగడ శేషశాయి గారు
శూద్రకుని ''మృచ్ఛకటికం'' నాటకాన్ని గూర్చి
డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు గారు

## రెండవ సమావేశం

*10 డిశంబరు 1983 శనివారము సాయంకాలము గం॥ 5-30 ని॥ లకు*

**అధ్యక్షులు :** శ్రీ ప్రమోద్‌గణేశ్ లాలె గారు
రీడర్, సంస్కృత విభాగం, ఉస్మానియా విశ్వవిద్యాలయం.

**ముఖ్యఅతిథులు :** శ్రీ వి. వి. ఆర్. కె. ప్రసాదుగారు
(కమీషనర్ సమాచార సంస్కృతిక వ్యవహారాలశాఖ,
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం.)

**ఉపన్యాసములు :** **కాళిదాస "అభిజ్ఞాన శాకుంతలం"** నాటకాన్ని గూర్చి
ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారు
**భవభూతి "ఉత్తర రామచరిత్రం"** నాటకాన్ని గూర్చి
డా॥ ధూళిపాళ శ్రీరామమూర్తి గారు

## మూడవ సమావేశం

*11 డిశంబరు 1983 ఆదివారం సాయంకాలం గం॥ 5-30 ని॥ లకు.*

**అధ్యక్షులు :** శ్రీ ఎల్. మాలకొండయ్య గారు ఐ.ఎ.ఎస్. (రిటైర్డు)

**ముఖ్య అతిథులు :** **ఆచార్య శ్రీ సి. నారాయణరెడ్డి గారు**
అధ్యక్షులు, అధికారభాషా సంఘం.

**ఉపన్యాసములు :** శ్రీహర్షుని 'నాగానందం' నాటకాన్ని గూర్చి
శ్రీ కొత్తపల్లి ఘనశ్యామల ప్రసాదరావు గారు
**విశాఖదత్తుని** 'ముద్రారాక్షసం' నాటకాన్ని గూర్చి
శ్రీ అవధానము చంద్రశేఖరశర్మ గారు.

# ప్రేరణ

చదువు వినోదం కాదు, కారాదు. ఉబుసుపోకకు చదవడం వ్యక్తిత్వ లోపం. వ్యక్తిత్వాన్ని మలచలేని సాహిత్యం కాలాంతక సాహిత్యం. తన దేశ ఇతిహాసాన్ని, తన దేశ సంస్కృతిని, తన సమకాలిక సమస్యలను అవగతం చేసుకున్నంత మాత్రాన ఎవ్వరూ కూడా సాహిత్య స్రష్టలు కాలేరు. అనుభూతి, ఆర్ద్రత, సమవేదన, వ్యుత్పన్నత, ప్రతిభ, పరిసరాల పరిజ్ఞానం, భూతభవిష్యత్ వర్తమాన కాలాల అవగాహనం ఉత్తమ సాహిత్య దృష్టికి పునాదిరాళ్ళు. వీటి పైన జరిగిన నిర్మాణం ఎంత ఎత్తుగా ఎదిగినా సముజ్వలంగానే ఉంటుంది. పటిష్ఠంగానే ఉంటుంది. దేశం, కాలం గీసిన గీట్ల వలయాల్లో ఇరుక్కోకుండా, భాషాబంధాల్లో చిక్కుకోకుండా మనిషి మనుగడతోపాటు అతని బ్రతుకు బరువులతో ఒదిగిపోతూ పొడిచే సూర్యునిలా, కాచే వెన్నెలలా, పారే సెలయేరులా, అలలెత్తే కడలిలా ఎప్పటికప్పుడు అందాలను వెదజల్లుతూ అమ్లానంగా వుండిపోయే అనుభవాల వాగ్రూపమే సాహిత్యం. సాహిత్యానికి పాత కొత్తలు లేవు అని ఎన్నడో అన్నాడు కాళిదాసు. పాతవైనంతమాత్రంచేత ఏదీ మంచిదీ కాదు; కొత్తదైనంతమాత్రాన ఏదీ చెడ్డదీ కాదు. పరిశీలనాచక్షువుతో చూసి, ఏది మంచిదో, ఏది చెడ్డదో, ఏది హితమో, ఏది అహితమో తెలుసుకోగలగడం సంస్కారమున్న మనిషి లక్షణం. మూఢుడు విచక్షణ లేకుండా ఇతరులు చెప్పింది విని తలవూపుతాడు గంగిరెద్దులా.

అక్షరశః వాల్మీకి రామాయణాన్ని చదవకుండానే అందులో ఏవో పాత భావాలున్నాయని, తాము సరికొత్త భావాలను ప్రసారం చేస్తున్నామని అనుకుంటారు కొందరు. నిజానికి పాతకొత్తల మధ్య వున్న యవనికను తొలగించి చూపగలిగే సంస్కారం అంతమాత్రాన అందరికీ అబ్బదు.

మంచి ఎక్కడున్నా అనుసరణీయమన్న భావంతో దేశాన్నీ, సమాజాన్నీ పరిశీలిస్తే దేశంలో భావ సమైక్యానికి అడ్డంగా నిలచిన సమస్యలెన్నో పరిష్కారానికి నోచుకుంటాయి.

వాల్మీకి, డాంటే, హోమర్, షేక్స్పియర్, వ్యాసుడు, కాళిదాసు, భవభూతి, నన్నయ, తిక్కన, గాలిబ్, టాగోర్ ఇంకా ఎందరెందరో కవులు విశ్వసాహితీ విహాయసంలో ధ్రువతారలుగా ప్రకాశించినారు. సాహిత్యం అర్థం చేసుకోవడానికి, కవుల భావాలను అవగతం చేసుకోవడానికి కేవలం అభిమానం చాలదు. నిన్నటి సాహిత్యం రూపురేఖలలో దిఙ్మాత్రంగా పరిచయం లేనివాడు నేటి సాహిత్యానికి వ్యాఖ్యానం చేసుకోలేడు. కళాప్రపంచంలో నిన్న, నేడు అనే శిఖరాల మధ్య వ్యత్యాసం దూరంగా వుంటూనే దగ్గరగా కనిపిస్తున్నది. దగ్గరగా

వుంటూనే దూరంగా కనిపిస్తుంది. మనః ప్రపంచం ఎంత చిన్నదో అంత పెద్దది. అణువులో బ్రహ్మాండముంది. బ్రహ్మాండమంతా మనస్సులో ఇమిడిపోతుంది. కనుకనే ఇంద్రియాలలో తాను మనస్సునని భగవంతుడు చెప్పుకున్నాడు. మనస్సు సృష్టికి సూక్ష్మరూపం.

పరంపరాగతంగా వస్తున్న భాషా సాహిత్యాల స్వరూపాన్ని అవగాహన చేసుకోవడం, పాత కొత్తల కృత్రిమ భేదాల తెరలనుంచి బయటపడి మనస్సుకు ఆనందాన్నీ, ఆలోచనలకు వాడినీ, బ్రతుకుకువేడినీ కలిగించే సాహిత్యాన్ని అధ్యయనం చేసే అవకాశాలను సమధికం చేయడమే యువభారతి ఉద్దేశ్యం.

ప్రాచీన సాహితిలోని చక్కని కావ్యాలలోని మంచి పద్యాలను ఎన్నుకొని వాటికి సరళ వ్యాఖ్యానాలు యువభారతి వెలయించింది. నన్నయనుంచీ నేటి వరకూ వున్న సాహితీమూర్తుల సాహిత్య వ్యక్తిత్వాలతో పరిచయాన్ని కలిగించే ఉపన్యాసాలు చెప్పించి వాటిని పుస్తకాలుగా మలచి ప్రచురించింది. పాత కొత్తల సమన్వయ ధోరణితో 'యువ భారతి' కార్యక్రమాలు నిర్వహింపబడుతున్నాయి. మేము అనుసరిస్తున్న మార్గం సమంజసమైనదన్న విశ్వాసం మాకు అనుదినం అధికమవుతున్నది.

విశ్వ సాహిత్యంలోనే నిత్యనూతన భావసృష్టికి, తాత్త్విక సృష్టికి, జీవిత పరమార్థానికి, కవితా పారమ్యానికి, భారతీయాలోచనా ఫణితికి, సౌందర్యానుభూతికి ప్రతీకలుగా నిలచిన ఆరు సంస్కృత నాటకాలను ఈసారి మేము ఎన్నిక చేశాము. అవి 'సంస్కృత సాహితీ లహరి'గా అవతరించినవి. సంస్కృత సాహిత్యంతో పరిచయం భారతీయతతోనే పరిచయం. మానవతా దృక్పథంతో పరిచయం.

ఈ నాటకాలలోని ఇతివృత్తాలలో వైవిధ్యం ఉంది. మహాభారతం, రామాయణం, కథాసరిత్సాగరం వంటి ప్రఖ్యాత గ్రంథాలలోని ఇతివృత్తాలతోపాటు బౌద్ధ వాఙ్మయాన్ని, చారిత్రక సంఘటనలనూ, సమకాలిక సాంఘిక పరిస్థితులనూ ఆధారంగా చేసుకున్న ఇతివృత్తాలు ఈ ఆరింటిలో ఉన్నవి. నాటకం కేవలం కథనం కాదు. వ్యక్తిత్వ దర్పణం. జీవితానుభూతికి అనుకృతి. నాటక కర్త ప్రజ్ఞాచక్షువుతో సమకాలిక సంఘంలోని వ్యక్తులను సందర్శిస్తాడు. వారి దైనందిన జీవిత సరళికి సమీపంగా తన నాటకాన్ని మలుస్తాడు. అందుకే గొప్ప గొప్ప నాటకాల్లోని ఇతివృత్తాలు, సంభాషణలు, పద్యాలు, సన్నివేశాలు ఇప్పటికీ రససృష్టికి కారణమవుతున్నాయి.

'స్వప్న వాసవదత్తం' నాటక కళా ప్రయోగంలో సమున్నత శిఖరాలనందుకున్న నాటకం, నాటకం చూసినా చదివినా రసలోక విహారం అనివార్యం.

"దుష్పరిపాలనను ప్రజలు నేడే కాదు ఏనాడూ భరించరు" అన్న సత్యాన్ని చాటి చెబుతున్నది 'మృచ్ఛకటికం.' వేశ్యల్లోను ఉత్తములుంటారనే సత్యాన్ని నిత్యనూతనంగా ప్రకటిస్తున్నది మృచ్ఛకటికం. శరత్‌బాబునూ, గురజాడనూ ప్రభావితం చేసిన నాటకం ఇది.

తాను నిరీహుడైనా, తనకు సంతానం లేకపోయినా, పెంచి పెద్ద చేసిన అమ్మాయి తనకు తెలియకుండా గర్భం దాల్చిన సంగతిని తెలుసుకున్న కణ్వుడు వ్యవహరించిన తీరు ఎంత సముదాత్తంగా ఉన్నదో, నేటి సమాజానికి ఇలాంటి సమస్య ఎదురైనప్పుడు ఎలా వ్యవహరిస్తున్నదో సహృదయులు పరిశీలించడానికి వీలు కల్పించినాడు కాళిదాసు తన 'అభిజ్ఞాన శాకుంతలం'లో భారతకథను ఎంత చమత్కారంగా, రసాత్మకంగా, ఎంత దర్శనీయంగా మార్చినాడో వ్యాఖ్యానించుకోవలసిన అగత్యం, అవకాశం ఈ రెండు వేలేండ్ల నుంచి సాహిత్య విమర్శకులకు కలుగుతూనే ఉన్నది.

'ఉత్తర రామచరిత్రం' భారతీయ సాహిత్య సృష్టిలో సమున్నత ప్రమాణాల నందుకున్న నాటకం. జీవిత సత్యాన్ని అంత తాత్వికంగా వ్యాఖ్యానించిన కావ్యం మరొకటిలేదు. "అద్వైత్వం సుఖదుఃఖయోరనుగతం" అన్న శ్లోకం దాంపత్య జీవిత ప్రాశస్త్యాన్ని వ్యాఖ్యానిస్తున్నది. వివాహ వ్యవస్థకూ, స్త్రీ పురుషుల సంబంధానికీ, ధర్మ దృష్టికీ ఈ శ్లోకం మనకు తెలియకుండానే మన భారతీయుల సామూహిక జ్ఞానానికి, సంస్కృతికి చిహ్నంగా నిల్చిఉంది.

తన ప్రజల కోసం నాయకుడు తాను ముందు ఆహుతి కావాలనే సముదాత్త ఆదర్శానికి ప్రతీకగా నిల్చిన 'నాగానంద' నాటకం నేటికీ ఆదరణీయంగా ఉంది. అనుసరణీయంగా ఉంది.

'ముద్రారాక్షసం' రాజకీయాల నాటకం. ఎంతో అద్భుతమైన నాటకం. ఇప్పటి రాజకీయ జీవితాన్ని వ్యంగ్యాంతరంగా చిత్రిస్తున్న నాటకం.

ఈ ఆరు నాటకాలను ఎన్నిక చేయడంలో మాకు కలిగిన ఆలోచనలు ఇక్కడ పొందుపరచినాము. విద్వాంసుల వ్యాసాలు పఠితృలోకానికి సమగ్రమైన పరిచయం కలిగిస్తాయని విశ్వసిస్తున్నాము. సంప్రదాయసిద్ధంగా మన దేశంలో ప్రచారంతో ఉన్న సాహిత్యపు విలువలను కాపాడుకోవాలనే తపన మమ్మల్ని ప్రేరేపించి 'సంస్కృత సాహితీ లహరి' కార్యక్రమంగా రూపొందింప జేసింది. సహృదయుల సహకారంతో ఇలాంటి సాహితిని ప్రచురించే ప్రయత్నాలు మరింత శ్రద్ధాసక్తులతో నిర్వహించాలని ఆశిస్తున్నాము.

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షులు
యువభారతి.

9-12-1983
హైదరాబాదు.

# ఎందరో మహానుభావులు

* సంస్కృత సాహితీ లహరి కార్యక్రమాన్ని రూపుదిద్దటంలో సహకరించిన పెద్దలు శ్రీ దేవులపల్లి రామానుజరావు, ఆచార్య దివాకర్ల వేంకటావధాని, డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం గారలు.
* మా 20 వ వార్షికోత్సవ సభలకు అధ్యక్షత వహించిన పెద్దలు శ్రీ అల్లాడి కుప్పుస్వామి, శ్రీ ప్రమోద్ గణేశ్ లాలె, శ్రీ ఎల్. మాలకొండయ్య గారలు.
* మా 20 వ వార్షికోత్సవ సభలకు ముఖ్య అతిథులుగా విచ్చేసి, ఆశీర్వదించిన పెద్దలు శ్రీ టి. ఎస్. ఆర్. నరసింహం, శ్రీ పి. వి. ఆర్. కె. ప్రసాదు, ఆచార్య సి. నారాయణరెడ్డి గారలు.
* 'అభినవలోచనం' గ్రంథాన్ని ఆవిష్కరించిన పెద్దలు ఆచార్య సి. నారాయణరెడ్డిగారు, 'ఆంధ్ర సాహిత్య విమర్శ-ఆంగ్ల ప్రభావం' గ్రంథాన్ని ఆవిష్కరించిన పెద్దలు ఆచార్య బి. యస్. రామకృష్ణగారు. 'రవ్వలు' కవితా సంకలనాన్ని ఆవిష్కరించిన పెద్దలు డాక్టర్ (శ్రీమతి) ముక్తేవి భారతిగారు, 'వెలుగు చూపే తెలుగు పద్యాలు' గ్రంథాన్ని ఆవిష్కరించిన పెద్దలు శ్రీ గిరిధారీలాల్ సంఘీ గారు, 'తెలుగు వాగ్గేయకారులు' గ్రంథాన్ని ఆవిష్కరించిన పెద్దలు డా॥ పి.ఎస్.ఆర్. అప్పారావు గారు, 'మాఘకావ్యవైభవం', 'అన్నమయ్య', 'వాగ్భూషణం భూషణం', 'వెలుగు రేఖలు', 'సంస్కృతి', 'స్వామి వివేకానంద కవితా వైభవం', 'సంస్కృత సాహితీ లహరి', గ్రంథాలను ఆవిష్కరించిన పెద్దలు ఆంధ్రప్రదేశ్ హైకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తులు శ్రీ అల్లాడి కుప్పుస్వామి గారు.
* 'సంస్కృత సాహితీ లహరి' ఉపన్యాస మంజరీ కార్యక్రమాలలో ఉపన్యాసాల నివ్వడమే కాకుండా వ్యాసాలను కూడా సమర్పించి, ఈ గ్రంథానికి రూపు కల్పించిన సాహిత్యవేత్తలు శ్రీ మానాప్రగడ శేషశాయి, డా॥ పుల్లెల శ్రీ రామచంద్రుడు, ఆచార్య దివాకర్ల వేంకటావధాని, డా॥ ధూళిపాళ శ్రీరామమూర్తి, శ్రీ కొత్తపల్లి ఘనశ్యామల ప్రసాదరావు, శ్రీ అవధానము చంద్రశేఖర శర్మ గారలు.
* 'అభినవలోచనం', 'ఆంధ్ర సాహిత్య విమర్శ-ఆంగ్ల ప్రభావం' గ్రంథాలను అందించిన డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం, 'రవ్వలు' కవితా సంకల

నంలోని అనేక కవులు, 'వెలుగు చూపే తెలుగు పద్యాలు', 'వాగ్భూషణం-భూషణం' గ్రంథాలను అందించిన డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి, 'తెలుగు వాగ్గేయకారులు' గ్రంథాన్ని అందించిన డా॥ ఎస్. గంగప్ప, 'మాఘ కావ్యవైభవం' గ్రంథాన్ని అందించిన శ్రీ కె. వి. రాఘవాచార్యులు, 'అన్నమయ్య' గ్రంథాన్ని అందించిన డా॥ ముట్నూరి సంగమేశం, 'వెలుగు రేఖలు' గ్రంథాన్ని అందించిన శ్రీ తాళ్ళపల్లి మురళీధర గౌడ్, 'సంస్కృతి' గ్రంథాన్ని అందించిన డా॥ ప్రసాదరాయ కులపతి, 'స్వామి వివేకానంద కవితా వైభవం' గ్రంథాన్ని అందించిన శ్రీ ఓగేటి అచ్యుత రామశాస్త్రి గారలు.

* పిల్లలకై 'వెలుగు చూపే తెలుగు పద్యాలు' గ్రంథాన్ని 'అశోక్ కుమార్ సంఘీ చారిటబుల్ ట్రస్ట్' ఆర్థిక సహాయంతో వెలువరించడానికి పూను కున్న వదాన్యులు శ్రీ జి. యల్. సంఘీగారు.
* మా నెలసరి 'సమాలోచన' సమావేశ కార్యక్రమాల్లో దశ రూపకాలపై ప్రసంగించిన పెద్దలు డా॥ముదిగొండ వీరభద్రశాస్త్రి, శ్రీ ఓగేటి అచ్యుత రామశాస్త్రి, డా॥ గంగిశెట్టి లక్ష్మీనారాయణ, డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం, డా॥ (శ్రీమతి) ముక్తేవి భారతి, శ్రీ రాజా రామదాసు, డా॥ పి యస్.ఆర్. అప్పారావు, డా॥ వి వి. యల్. నరసింహారావు, ఆచార్య దివాకర్ల వేంకటావధాని, డా॥ అమరేశం రాజేశ్వర శర్మగారలు.
* మా 'యువభారతి' ప్రచురణలను ముచ్చటయిన ముఖ చిత్రాలతో తీర్చి దిద్ది అక్షరాలంకరణను సంతరించిన చిత్రకారులు శ్రీ శీలా వీర్రాజుగారు.
* ప్రచురణలకు ముఖ్య సాధనమైన తెల్లకాగితాన్ని అందించిన హిందుస్తాన్ పేపర్ కార్పొరేషన్ వారు మరియు ఇతర విక్రయదారులు.
* మా ప్రచురణలను ముద్రించిన ముద్రాపకులు పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్, సుమన ప్రింటర్స్, అవేర్ ప్రింటింగ్ ప్రెస్, విజయ ఆర్ట్ ప్రింటర్స్, మాస్టర్ ప్రింటర్స్, ముఖచిత్ర ముద్రాపకులు బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్వారు.
* 20 వ వార్షికోత్సవ సందర్భంగా 'సంస్కృత సాహితీ లహరి'ని ఉచితంగా ముద్రించి యిచ్చిన పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్ అధినేత శ్రీ శ్రీనివాస్, 'సంస్కృతి'ని ఉచితంగా ముద్రించి యిచ్చిన సుమన ప్రింటర్స్ అధినేత శ్రీ గండయ్యగారలు.
* బ్లాకుల తయారీ శిల్పులు మోహన్ ప్రోసెస్ వారు.
* 'సంస్కృత సాహితీ లహరి' ఉపన్యాసమంజరీ కార్యక్రమాలను తమ ప్రాంగణంలో నిర్వహించుకోడానికి దయతో అనుమతించిన ఆంధ్ర

సారస్వత పరిషత్తు పెద్దలు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు, కార్యాలయ నిర్వాహకులు శ్రీ హరికిషన్‌రావుగారు.

* మా నెలసరి 'సమాలోచనం' కార్యక్రమాలను తమ ప్రాంగణంలో నిర్వహించుకోడానికి దయతో అనుమతించిన శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం నిర్వాహకులు. విశేషించి గ్రంథాలయ కార్యదర్శి శ్రీ ఎం. ఎల్. నరసింహారావు గారు.
* మా ప్రచురణల కొనుగోలులో ఇతోధికంగా ప్రోత్సహిస్తున్న రాజా రామ్‌మోహన్‌రాయ్ గ్రంథాలయ ఫౌండేషన్, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర గ్రంథాలయ శాఖ డైరక్టర్, జిల్లా గ్రంథాలయాధికారులు మరియు యితర పుస్తక విక్రేతలు.
* ప్రకటనల ద్వారా ఆర్థిక సహాయాన్ని చేసిన ప్రకటన కర్తలు.
* మా యువభారతి కార్యక్రమాలు ఇతోధికంగా లోకానికి తెలియచెప్పి ప్రోత్సహించే పాత్రికేయులు, సాహిత్యశీలురు.
* మా సభలకు అవసరమైన ఫర్నీచరును సమకూర్చిన యూసఫ్ అండ్ కంపెనీ వారు, విద్యుద్దీపాలంకరణ కర్తలు-హనుమాన్ ఎలక్ట్రికల్స్ వారు.
* మా సాహిత్య కార్యక్రమాలకు వచ్చి 'యువభారతి' సాహిత్యోద్యమాన్ని సాదరంగా ప్రోత్సహిస్తున్న సాహిత్య స్నేహమూర్తులు, సహృదయులైన తెలుగువారు.
* 'యువభారతి' చైతన్యం యువభారతీయుల సమైక్య కృషి. సాహిత్యోద్యమంలో కష్ట నిష్ఠూరాల కోర్చి శ్రమించిన యువభారతి సభ్యులు, అండదండల నందించిన 'సాహితీ మిత్రులు', 'భారతీమిత్రులు', 'భారతీ భూషణులు.'
* కార్యక్రమ నిర్వహణలో రేయింబవళ్ళు శ్రమించి, కార్యక్రమాలను దిగ్విజయం చేయడంలో సహకరించిన యువభారతి కార్యాలయ సిబ్బంది.

ఎదురుగా కనబడేది ఇందరైనా, కనుమరుగునవుండి మమ్ములను దీవించేది ఎందరో! అందరూ మహానుభావులే!

**అందరికీ మా వందనములు**

ఎ. రామలింగేశ్వరరావు
కార్యదర్శి,
యువభారతి.

# మధుకలశం

భారతీయుల దార్శనికతను తెలిపేవి వేదాలు; సంస్కృతి వైభవాన్ని వెలార్చేవి కావ్యాలు. జీవన విధానంలోని చైతన్యాన్ని రూపుకట్టించేవి రూపకాలు. సంస్కృత సాహిత్యం భారతీయతకు ప్రతిబింబం. సజీవ ప్రక్రియలతో సమున్నత ఫణుతులను వెలార్చిన సంస్కృత సాహిత్యం భారతీయ భాషా సాహిత్యాలను ప్రభావితం చేయటమే కాకుండా, ప్రపంచ సాహిత్యాలకు కూడ తన ప్రకాశాన్ని పంచిపెట్టింది. ప్రాచీన ప్రపంచ నాగరకతా వైభవాన్ని తెలుసుకోవాలన్నా, ఆధునిక భాషాశాస్త్ర పద్ధతులకు విలువ కట్టాలన్నా సంస్కృతంలో వెలసిన వాఙ్మయంతో విజ్ఞులకు పరిచయం నేటికీ తప్పని సరియైనదిగా భావింపబడుతోంది. అందువలన యువభారతి సంస్కృత సాహితీ లహరిని నిర్వహించాలని తలపెట్టింది. అందులోనూ సంస్కృత నాటకాల పరిచయాన్ని ముందుగా చేపట్టింది.

''నాట్యం భిన్నరుచేర్జనస్య బహుధాప్యేకం సమారాధనమ్'' అన్న కాళిదాసోక్తిని భావించి భిన్నరుచులు కలిగిన జనులను సైతం సమంగా సంతోషపెట్టే నాట్యం, అభినయం ప్రధానంగా ఉండే రూపక సమాలోచనం ముందుగా చేయటం సముచితమని యువభారతి భావించింది. కావ్యాలలో 'పంచ కావ్యాలు' అనే ప్రసిద్ధి ఉంది. నాటకాలలో 'నాటక షట్కం' అనే పరిపాటిని భావించింది యువభారతి. సంస్కృత సాహిత్యంలో ఉత్తమమైన ఆరు నాటకాలు ఏవి ? అని ప్రశ్నించుకుంటే - నిస్సంశయంగా భాసుని స్వప్నవాసవదత్తం, కాళిదాసుని అభిజ్ఞాన శాకుంతలం, భవభూతి ఉత్తరరామ చరితం, శూద్రకుని మృచ్ఛకటికం, శ్రీహర్షుని నాగానందం, విశాఖదత్తుని ముద్రారాక్షసం - అని ఏ రసికుడైనా అంగీకరిస్తాడు. ఇంకా ఉత్తమ నాటకాలు లేవని కాదు. ఉన్నాయి. అయినా మొదటి ఆరుగా ఈ వరుసను గ్రహించటంలో విప్రతిపత్తి ఉండబోదు.

నాటకాలు ప్రదర్శిస్తే చూచి ఆబాలగోపాలం ఆనందానుభూతిని పొందటం సామాన్యం. ఆ ఆనందం ఎన్ని పౌరల్లో సామాజికులకు చైతన్యాన్ని కలిగిస్తుందనేది వివేచింపదగింది. నాటకానికి వస్తువు శరీరం; పాత్రలు శరీరాంగాలు; అభినయం కార్య చైతన్యం, భావాలు అభివ్యక్తి, నాటక తాత్పర్యం జీవనతత్వం. వస్తువు వాస్తవాన్ని వాస్తవంగా చిత్రిస్తే భౌతికమైన చమత్కారం కలుగుతుంది; భావ ప్రధానంగా చిత్రిస్తే మానసిక అహ్లాదం మోసులెత్తుతుంది; తత్త్వ సుందరంగా నిర్వహిస్తే రస ప్రవృత్తి రమిస్తుంది. వస్తువు నానా విధాలుగా మలచాలంటే పాత్రల ప్రకృతులను, ప్రవృత్తులను, రసవృత్తులను నాటకాలలో ప్రధానం చేసి చిత్రించవలసి ఉంటుంది. సంస్కృత నాటక కర్తలు ఈ మూడింటినీ చిత్రస్తూనే రసవృత్తులకు ప్రాధాన్యమిచ్చారు. అందువలన అవి అజరామరాలుగా ఉండిపోయాయి.

నాటకంలో రసవృత్తి నిర్వహణం చిన్న విషయం కాదు. సామాజికుల జన్మాంతరసౌహృదాలను జాగృతం జేసి, ద్రవింపచేసి, వికసింపచేసి, తన్మయీ భావన యోగ్యతతో అనుభవరుచిగా మార్చాలి. ఆ మార్గంలో సంస్కృత నాటక కవులు వివిధ ప్రయోగాలను చేశారు. ఆ ప్రయోగాలలో షడ్రుచుల్లాంటి రుచులను ప్రతిభా సామర్థ్యంతో నిర్వహించిన నాటకషట్కం ఈ లహరిలో సమీక్షింపబడుతున్నవి.

భాసుని స్వప్నవాసవదత్తంలోని రసవృత్తుల నిర్వహణమంతా లౌకికా లౌకికజగత్తుల తులనాత్మక చిత్రీకరణమనే శిల్పంమీద ఆధారపడి ఉంది. మరణించినదని భావింపబడుతున్న వాసవదత్త వత్సరాజు హృదయరంగంలో భావవ్యక్తిగా అలౌకిక జగత్తును సృష్టిస్తుంది. వత్సరాజు వివాహమాడిన పద్మావతి లౌకిక జగత్తును సృష్టిస్తుంది. ఈ రెండు జగత్తులూ అతని మనోరంగంలో బలాబలాలను నిరూపించుకోవటానికి యత్నిస్తాయి. సముద్రగృహ సన్నివేశం లౌకిక జగత్తుకంటె అలౌకిక జగత్తు అమరమనీ, రసానందదాయకమనీ నిరూపిస్తుంది. అలౌకికం లౌకిక స్పృహను కలిగిస్తే రసజగత్తు ఆనందపదవినుండి సుఖదుఃఖాత్మకస్థాయికి దిగజారుతుందనీ, సుఖదుఃఖాత్మకమైన జీవితానుభవానికి అమృతప్రదాయిని అలౌకికజగత్తనీ భాసుని నాటకం ప్రయోగముఖంగా నిరూపించింది. వత్సరాజు సంస్కారసంపుటి. పద్మావతి అతనిలో ప్రణయవాసనల చర్వణస్థితిని కలిగించిన లౌకిక విభావం. అలౌకిక జగత్తుకు పోషకశక్తి ఆమె. స్థాయి వాసవదత్త. స్థాయి సంచారుల సంవాద మాధుర్యం వలన వత్సరాజుకు కలిగేది ప్రణయ సంస్కార చర్వణస్థితియైన శృంగార రసవృత్తి. సామాజికునకు మిగిలేది తచ్చింతనామయమైన రసానుభవస్థితి. రసానుభవపు విలువను నిర్ణయించటానికి స్వాప్నికస్థితి ఒక ప్రమాణం. ఆ ప్రమాణాన్ని చూపి ఆంతరమైన రసానుభవంలోని లోతులను తెలిసికొనటానికి స్వప్నవాసవదత్తం ఒక రమణీయమైన దండం. ఆ రహస్యం తెలిసినప్పుడు సహృదయుని వదనంమీద హాసం నిలుస్తుంది. "భాసోహాసః'' అని మురిసిపోతుంది.

కాళిదాసుని 'అభిజ్ఞాన శాకుంతలం' సుప్తజాగృత వాసనల మథనాత్మక చిత్రీకరణ శిల్పం ప్రధానంగా నిర్మించిన మనోహర రూపకలోకం. శకుంతలా గతమైన రతివాసనలు దుర్వాసముని శాపంవలన దుష్యంతునిలో సుప్తావస్థను భజిస్తాయి. పంచమాంకంలో హంసపదికగీతం వలన అవి వ్యక్తావ్యక్త స్థితిలో జాగృతమౌతాయి. అభిజ్ఞాన దర్శనం వలన స్పష్టంగా అభివ్యక్తమౌతాయి. జన్మాంతర సౌహృద రూపాలైన వాసనలను జాగృతం చేయటం రసశిల్పంలో జీవసూత్రం. వాటికి నాటక పాత్రల రసవృత్తులు సహృదయలోకానికి అభిజ్ఞాన సదృశాలౌతాయి. పాత్రల భావాలలో సంవాదస్థితి చెందుతున్న సహృదయుడు

సుప్త సంస్కారాలను విస్మృతస్థితినుండి జ్ఞాపక స్థితిలోనికి తెచ్చుకొని చర్వణం చేస్తాడు. అతనికి లౌకికస్థితి లేదు. అలౌకిక స్థితిలో యోగిలా భాసిస్తాడు. శకుంతలా దుష్యంతులు మారీచాశ్రమంలో పొందిన పునస్సమాగమం రస జగత్తులో సహృదయ హృదయాంతర్గత వాసనా వికాసస్థితికి ఫలావస్థ. అవ్యక్త మైన అంతర్మథనకు వ్యక్తమైన రసానుభవ నిజస్థితి. లౌకికానుభూతులలో కారణ కార్య జ్ఞానాన్ని తెలుసుకోలేని సామాజికుడు అలౌకిక ప్రవృత్తుల నాశ్రయించి ఆత్మాభిజ్ఞను సాధించే ఆలోచనామృతాన్ని అనుభవిస్తాడు. అపూర్వానుభవానికి ఆధారమైన వాసనాబలాన్ని తెలియగలిగిన సహృదయుడు శాపవిముక్తునిగా భావించి సహానుభవంతో దుష్యంతపాత్రగతమైన స్థాయిని చర్వణం చేసి రస స్థితిని పొంచగలుగుతాడు. రసానుభవం సహృదయ లౌకిక జీవనంలోని సుఖ దుఃఖాత్మక స్థితినుండి తరించి ఆనందరూపమైన రసలోకాన్ని అందుకోపటానికి ఏర్పడిన శాప నివారణోపాయంగా కాళిదాసు తన నాటకంలో చిత్రించాడు. దుర్వాసుని శాపం వాసనల జాగృతిని స్తంభింపచేసే మోహశక్తి. దానిని సత్త్వయోగంతో తరించవచ్చు. సహృదయ చిత్తసాత్త్వికస్థితియే దుష్యంతుని విరహావస్థలోని రహస్యం. అభిజ్ఞానం అస్వాదన స్థితియొక్క అభివ్యక్తి. రసాను భవంలోని ఆస్వాదనశక్తి యొక్క ప్రాముఖ్యాన్ని చెప్పేదే కాళిదాసుని నాటకం.

భవభూతి ఉత్తరామ చరిత్ర అద్వైత ప్రణయ ప్రవృత్తుల అంతర్మథన చిత్రణం మీద ఆధారపడి ఉన్న అమోఘ శిల్పఖండం. ఈ నాటకంలో కరుణ విప్రలంభం కమనీయంగా చిత్రింపబడింది. కథ సీతారాములకు సంబంధించింది. కాని, అనుభవం మాత్రం సామాజికునిది. సీత బ్రతికియున్నదని సామాజికునికి తెలుసు. రామునికి తెలియదు. కాని, ఆమె కరస్పర్శతో రాముడు పునరుజ్జీవితు డౌతుంటాడు. సీతారాము లద్వైత ప్రణయ మూర్తులు. వారు విడివడి విలపిస్తుం టారు. ఈ తత్త్వం రసానుభవానికి సంబంధించిందిగా సహృదయుని పక్షంలో నిలుస్తుంది. సాత్త్వికస్థితిలో ఉన్న సహృదయుడు కోరేది స్థాయితో సంవాదస్థితి. దానిని భంజించే అవరోధాలు అతణ్ణి విషాదానికి గురిచేస్తాయి. రాముని స్థితి అటు వంటిది. సీతాస్పర్శ అతనిని జీవింపచేస్తుంది. మూర్ఛ మోహస్థితి. స్పర్శ అలౌకిక భావతన్మయీభవన యోగ్యత. అది మృత సంజీవని వంటిది. సీత అటువంటిది. సహృదయుని రసానుభవస్థితిలో తన్మయతకు గల ప్రాముఖ్యాన్ని సీత పాత్ర ద్వారా వ్యాఖ్యానించిన శిల్పి భవభూతి. భవుడు జీవుడు. అతని భూతి తన్మయీభవనశక్తి. అది భౌతికం కాదు; మానసికం. తన్మయస్థితిలో స్థాయి యందు అద్వైత స్థితిని పొందే అవస్థ సీతారాముల ప్రణయ రహస్యం. దానికి ఫలద్వయం ఉంది. ఒకటి విస్మయస్థితి; మరొకటి తన్మయస్థితి. ఈ రెండే లవకుశులు. రాముడు రసస్థితినికోరే రాగజీవి. సీత తన్మయస్థితి నందించే

భావశక్తి. వారిరువురి వెంట నడిచే సహృదయుడు తన్మయ చిన్మయస్థితుల కొరకు పరితపించే రసప్రవృత్తి. ఆస్వాదనశక్తిని కాళిదాసు చిత్రిస్తే, తన్మయ స్థితిని భవభూతి వ్యక్తీకరించాడని "ఉత్తరే రామ చరితే భవభూతి ర్విశిష్యతే" అని విజ్ఞులు ప్రశంసిస్తారు.

శూద్రకుని మృచ్ఛకటికం ఆదర్శ వాస్తవ ప్రవృత్తుల సంఘర్షణాత్మక చిత్రణం మీద ఆధారపడి ఉన్న ప్రకరణరాజం. వాస్తవ ప్రవృత్తులు సామాజికునికి సానుభూతిని, చమత్కారాన్ని కలిగిస్తాయే కాని, ఆదర్శప్రవృత్తుల్లాగా సహానుభూతిని కలిగింపలేవు. వసంతసేనా చారుదత్తులు ఆదర్శ ప్రవృత్తులు; శకారాదు లందరూ వాస్తవ ప్రవృత్తులు. ఈ రెండు రకాల ప్రవృత్తులను సంఘర్షణ శిల్పాన్ని అనుసరించి చిత్రించటంచేత సహృదయుడు చమత్కారానికీ, రసానుభూతికీ భేదాన్ని తెలిసికోగలడు. ఇటువంటి వివేచనను కలిగించే రూపకమే మృచ్ఛకటికం.

శ్రీహర్షుని నాగానందం త్యాగభోగ ప్రవృత్తుల సంశోధనాత్మక చిత్రణం ప్రధానంగా వెలసింది. పై నాలుగు నాటకాలూ శృంగార రస సంబంధులు. ఇది వీరరస సంబంధి. వీరం ధర్మోత్సాహ మూలం. ధర్మం ప్రవృత్తి పరంగా సాగితే భోగాన్నిస్తుంది; నివృత్తిపరంగా సాగితే త్యాగయోగాదుల నిస్తుంది. ప్రవృత్తి వీరం కంటె నివృత్తి వీరం గొప్పదని నిరూపించే నాటకం ఇది. ప్రవృత్తి అహంకారాన్ని ప్రకటింపచేస్తుంది; నివృత్తి ఆత్మత్యాగోన్ముఖంగా సాగుతుంది. ఒకవిధంగా విశాఖదత్తుని ముద్రారాక్షసం ప్రవృత్తివీరానికి ప్రతినిధి. అది రాజసతామస ప్రవృత్తుల అద్భుత చిత్రణం చేసింది. చాణక్యుడు రాజస ప్రవృత్తి; రాక్షసుడు సాత్త్విక ప్రవృత్తి; ప్రతినాయకాదులు తామస ప్రవృత్తులు. రాజసం తామసాన్ని గెలిచి, సాత్త్వికాన్ని నిపుణంగా సాధించిన రూపకం ముద్రారాక్షసం. ప్రవృత్తి నివృత్తి వీరరసాలను అద్భుతంగా నిర్వహించినవి ముద్రారాక్షసం, నాగానందం.

శృంగారాన్ని ఆశ్రయించి భాసుడు అలౌకిక రసజగత్తులోని మాధుర్యాన్ని చవిచూపాడు; కాళిదాసు ఔజ్జ్వల్యాన్ని అందించాడు; భవభూతి ఆర్ద్రతను అభివ్యక్తీకరించాడు; శూద్రకుడు వివేచనను కలిగించాడు; శ్రీహర్ష విశాఖదత్తులు వీరరసాన్ని ఆశ్రయించి జీవితంలోని వెలుగును, వేడిని చవిచూపించారు. మన జీవితంలో వేడి పురుషకారం; వెలుగు త్యాగం; వివేకం జీవితమథనం; ఆర్ద్రిత రసప్రవృత్తి; ఔజ్జ్వల్యం రసప్రస్థానం; మాధుర్యం జీవనరాగం. ఇవన్నీ కలిస్తే మనకు జీవిత మధుకోశం. ఈ లహరి తన తరంగ హస్తాలతో ఆ మధుకలశాన్ని మీ కందిస్తున్నది. అందుకోండి-అనుభవించండి.

—జి. వి. సుబ్రహ్మణ్యం.

# అనుక్రమణిక...

# స్వప్నవాసవదత్తం

మానాప్రగడ శేషశాయి

సంస్కృత సాహిత్యం సంపన్నమైనది. సర్వాంగసుందరమైనది. అదొక అందమైన పాలసముద్రంలాంటిది. చూడటానికి వెయ్యికళ్ళు చాలవు. అంబరాన్ని చుంబించే ఆ రస తరంగాల సంబరము - తరంగంతో పుట్టి - తరంగాన్ని తరళితంగా చుట్టి - దాని నావలకు నెట్టి, పైపైకి విలాసంగా పొంగే ఉత్తుంగ తరంగాల ఉల్లాసం-అందులోంచి వినవయ్యే సనసన్నని సంగీతం-ఆ హొయలు, ఆ నిండుదనం ఊహకందని ఒక సౌందర్య చిత్రం! ఏనాటి దా సముద్రం! ఏమందమా రసముద్ర! ఎప్పుడు చూస్తే అప్పుడు పుట్టినట్లు ఒక క్రొత్తకాంతి; ఒక సమ్మోహనమైన సౌందర్యం - ఎంతకూ అందని లోతు - ఎన్ని తడవలు చూచినా చూడాలనే ఒక సొగసు - అన్నిటినీ ఇమిడించుకొనే అంతరంగ స్వారస్యం - కష్టాలు, సుఖాలు, వెలుగులు, నీడలు - కథలు, గాథలు, గతాలు, వర్తమానాలు - కణకణలాడే నిప్పును చప్పరించే చల్లనలు - చల్లనను మెల్లగా ఇగిరించే అగ్గిసెగలు - ఏ కాలం - కాలవాహినిలో కాననయ్యే సంప్రదాయాలు, సంస్కృతులు అన్నిటినీ రంగరించుకొని సృష్టిలోని సారభూతమైన సౌందర్యాన్ని చిరుతరంగహాసంలో చిందిస్తూ, వీటన్నిటికీ ఒక సమన్విత సౌందర్యాన్ని బోధిస్తూ ఎంత అందంగా ఉంటుంది సముద్రం! అంత అందంగా ఉంటుంది అమరవాణి. ఎన్ని అందాలు చూపించారు ఆయా మార్గాలలో ఋషికల్పులైన కవీశ్వరులు!

నాటకమన్నది సురసరస్వతి మనసుపడి చెవిలో చెరివికొన్న పారిజాత ప్రసవ మంజరి. ఆ పారిజాత ప్రసూనాల పరిమళాలు దశదిశలా వ్యాపించాయి. సర్వాంగీణమైన సంస్కృత భాషా సౌందర్యాన్ని నాటకసాహిత్యం మరింత పరిపుష్టం చేసింది. రత్నాలులాంటి నాటకాలు-రసవంతమైన మార్గంలో రూపొందించి జాతికి చూఱలు పెట్టారు సంస్కృత కవీశ్వరులు. నాటినుండి నేటివఱకు సాగుతున్న సమాజం వాటిని చూస్తూనే ఉంది. అందంగా భావిస్తూనే ఉంది. మనుగడలో మనం చూస్తూన్న వెలుగునీడలు - తీరుతీయములు-ఎచ్చుతగ్గులు-

పలుకాపొంకాలు - గడుసు పోకడలు - వలపుల తలంపులు - తలంపుల జాడలు- అన్నీ అచ్చంగా అద్దం పట్టినట్టు చూపిస్తున్నాయి. ఏమి ఈ నాటకాల లోకోత్తర విలాసం! ఆ కవులు లోకస్వభావాన్ని ఎంతగా ఆకళించుకొన్నారు! సృష్టిలోఉన్న జీవస్పందంతో - అణువణువులో ఉన్న అందంతో పరవశించారా వారు! అలౌకిక నేత్రంతో ఈ సమస్త లోకవృత్తం పరామర్శించారా! రసభావాల అద్వైత మధు కుల్యల్లో ఓలలాడారా! వారు కావించిన సృష్టి అతిలోకమైనది. ఆ నాటక జగత్తు నకు వారే సృష్టికర్తలు. తమ ప్రతిభాప్రాభవాలతో దిక్కులను పుక్కిలించారు. ఒకరా ఇరువురా అందరూ అందరే. ఎవరికి ఎవరూ తీసిపోరు. అందరూ ఆనంద వర్ధనులే. సహృదయ సమాజానికి వారి రచనలు రత్నముకురాలు. ఆ ప్రతిభా పరమేశ్వరులను తలచుకొంటే చాలు. మధురమధురంగా చిత్తసంస్కారాలు పూలవాసనల్లా గుబాళిస్తాయి. భాసుడు - కాళిదాసు - భవభూతి - శూద్రకుడు- శ్రీహర్షుడు-విశాఖదత్తుడు-రాజశేఖరుడు - మురారి - దిఙ్నాగుడు - ఇలా ఎంద ఱెందరో-తమ రచనా ప్రసూనాలతో సంస్కృత నాటక సరస్వతిని అందంగా అలంకరించారు. పట్టు సెల్లాలు కట్టి - పువ్వుల పల్లకీలో సరస్వతి నూరేగించిన పుణ్యం వారికి దక్కింది. స్వప్నవాసవదత్తం, అభిజ్ఞాన శాకుంతలం, ఉత్తర రామచరిత్రం, మృచ్ఛకటికం, నాగానందం, ముద్రారాక్షసం, అనర్ఘరాఘవం, కుందమాల - ఇవన్నీ వజ్రాలు, వైడూర్యాలు, మరకతాలు, మాణిక్యాలు, పుష్య రాగాలు, గోమేధికాలు, ముత్యాలు, పద్మరాగాలు - రాసులురాసులుగా పోసి, ఒక్కమారు ఉప్పరానికి దోసిళ్ళతో గుప్పించినట్లు విచిత్రకాంతులు వెదజల్లు తూంటాయి. అన్ని నాటకములూ భిన్నశ్రేణుల్లో ఉన్న సమాజాన్ని - వారనీ, వీరనీ వారలేకుండ గుండెలని తట్టి - మేల్కొల్పి కలకండలు పండించాయి.

సముజ్జ్వల నాటక సాహిత్యానికి శ్రీకారము చుట్టినవాడు భాసుడు. తొలి నాళ్ళలో నాటక సరస్వతికి అందాలు సవరించిం దాయనే. ఆయన చేతుల్లోనే నాటకకళ అపూర్వ శిఖరాల నందుకొంది. భాసుడంటూ ఒక మహా కళాస్రష్ట ఈ దేశంలో ఉన్నాడని తెలియజెప్పింది - కేరళదేశీయులు, మహామహో పాధ్యాయులు శ్రీ గణపతి శాస్త్రి పండితులు- ప్రాతస్స్మరణీయులు. చేయెత్తి నమస్కరించాలి- ఆయన పరిశోధన పాండిత్యానికి. లేకుంటే భాసుని రచనలే మనకు దక్కేవికావు. భాసు డేనాటివాడు? ఏ జనపద ప్రాంతాలు ఆ పుణ్యాత్ముని అడుగుజాడలతో పరిపూతం అయ్యాయి? ఏ తల్లిదండ్రుల గర్భపయఃపారావారం ఈ కీర్తి చంద్రుడిని ప్రసవించింది? ఏ దేశకాలాలు ఈ సారస్వతాద్భుత

రోచిస్సుతో వెలుగొందాయి? తెలిసిం దీ మాత్రమే-భాసుడొకడున్నాడని, ఆయన పదమూడు నాటకాలు నిర్మించాడని. మఱేమీ ఆయన గుఱించిన సమాచారం తెలియదు. తన కులగోత్రాలు, నామరూపాలు, శక్తిసామర్థ్యాలు, చదువుసంధ్యలు వేటినీ ఏ చోటా ప్రస్తావించలేదు. ఎందఱో ఎందఱో సంస్కృత కవీశ్వరులు ఏ మాత్రం తమ వైనం చెప్పుకోకుండ- సుదూర వినీలాంబరంలో- మేఘాల మాటున మినుకుమినుకుమని వెలుగొందే చుక్కల్లా నిలచిపోయారు. వారికి సంబంధించిన వైయక్తిక సమాచారం మనకు లేదు. ఎవరిని గుఱించి తెలుసును కనుక నిశ్చ్రపచంగా ఈయన ఈ దేశంలో ఉన్నాడని- ఈయన శక్తిసామర్థ్యాలు ఇట్టివని! ఎన్ని హేమంతాలు, శిశిరాలు చన్నా, సమాజంమీదా, సర్వకాలంమీదా వారు వేసిన ప్రతిభాముద్రలు వసివాడలేదు. రాలిపోలేదు. చెక్కుచెదరకుండా, చెఱగిపోకుండా రసనిర్భరంగా ఉండిపోయాయి.

భాసుని పేర పదమూడు నాటకాలు ప్రకాశిస్తున్నాయి. అన్నీ రాసిలో చిన్నవి. వాసిలో మిన్నందుకొన్నవి. సన్నజాజి పువ్వుల్లా ముగ్ధమోహనంగా ఉంటాయి. ఇతివృత్తం ఎలా మొగ్గ తొడుగుతుందో- ఎలా క్రమంగా రేకులు విప్పుతుందో - మధుబిందురసవాహినులను ఎలా వెలారుస్తుందో ఆయనకే తెలియాలి. ఆ రూపకా లంత అందంగా రూపు దిద్దుకొంటాయి. నాటక మనగానే కాళిదాసు మన కన్నులముం దుంటాడు. లోకోత్తర రచనాశిల్పం ఆయనగారి సొత్తు. నిర్మాణంలో ఉండే మెలకువలు- రస నిర్వహణంలో ఉండే చతురతలు- ఆయనకు వెన్నతోపెట్టిన విద్యలు. ఉత్తమ నాటక నిర్మాతగా దేశ మాయనకు నివాళులర్పించింది. కాళిదాసంతటి ప్రతిభావంతుడు- భాసుని రచనా సంవిధానానికి పరవశుడయ్యాడు. భాసనాటకాల్లో ప్రసరించే కాంతులు కాళిదాసుకు మిరుమిట్లు గొలిపాయి. భాసుని నాటక సరస్వతీ సమున్మేషానికి నతాంసంతో నమస్కరించాడు. మాళవికాగ్నిమిత్రంలో ఆయన కావించిన ప్రశంస భాస భారతికి కర్ణావతంసంగా ఉంటుంది. పటిక బెల్లపుటచ్చులు లాంటి భాసుని ప్రబంధాలుండగా- ఈనాడు బయలుదేరిన కాళిదాసు రచనల్ని ఎవరు చవిచూస్తారు అంటాడు కాళిదాసు. అంతటి మహా శిల్పి మన్నన లందుకొన్న భాసుడు ఎంతటివాడో!

"ప్రథిత యశసాం భాస సౌమిల్లక కవిపుత్రాదీనాం ప్రబంధానతిక్రమ్య వర్తమాన కవేః కాళిదాసస్యక్రియాయాం కథం బహుమానః."

భాసు డన్న పేరు పుట్టినదేనా! ఎవరయినా పెట్టినదా అన్న విషయంలో కూడ నాకు సంచేహమే. మన ప్రసిద్ధకవుల పేరులన్నీ విచిత్రంగా ఉంటాయి.

వాల్మీకి-వ్యాసుడు-భాసుడు-కాళిదాసు-భవభూతి-క్షేమేంద్రుడు-ఇవన్నీ వారు వారు కావించిన అపూర్వ సృష్టిసౌందర్యానికి చకితులై రసజ్ఞులు పెట్టుకొన్న పేరులేమో అనిపిస్తుంది నాకు- భాసుడు చేసిన సృష్టి అంతటినీ పరిశీలించి, అందులో కొట్ట వచ్చినట్టు అగుపడే కాంతిని చూచి, అబ్బురపడి- ఎవడో అదృష్టవంతుడు అని ఉంటాడు భాసుడని. కాకుంటే భాసుడన్న పేరేమిటి? ఆయనగారి కాంతి రేఖలు ఎన్ని శతాబ్దాలు జరిగినా సాగుతూనే ఉంటాయనా ? !

అభిషేకం, ప్రతిమ, దూతవాక్యం, ఊరుభంగం, కర్ణభారం, పాంచ రాత్రం, మధ్యమ వ్యాయోగం, ప్రతిజ్ఞా యౌగంధరాయణం, దరిద్రచారుదత్తం, స్వప్న వాసవదత్తం మున్నగునవి. ఇవీ భాసుని రూపకాలు - ఇతివృత్తం మౌలి కంగా ఇంతో అంతో మన ప్రసిద్ధ ఇతిహాసాలు భారత భాగవత రామాయణాల నుండి తీసుకొని, నిసర్గ మధురమైన తన ప్రతిభతో పరిపుష్టమైన ఒక కాంతిని చేకూర్చి సుకుమార రూపకాలుగా రూపొందించాడు భాసుడు. మన ఇతిహాసాలు త్రివేణీ తీర్థం లాంటివి. గనుల గర్భాలు త్రవ్వి ఎక్కడో పడిఉన్న రాలనూ, అప్పలనూ ఏరి, ప్రజ్ఞాశాణంతో ఇటూ అటూ తొలిచి- కోణాలు ఏర్పరచి- దొంతులు దొంతులుగా కాంతులు ప్రసవించే రతనాలను అందించాడు రూపక రూపంలో భాస మహాకవి.

భాస నాటకాల్లో అగుపించే పాత్రలు సామాజిక హృదయంలో భద్రంగా రసముద్రలు వేస్తాయి. సజీవంగా సర్వకాలం నిలుస్తాయి. రసభావాలతో పస లొలికిస్తూ ఉంటాయి. ఆయన వాడిన పదాలు ఎన్నడూ వాడవు. సరసమైన సంభాషణములు, అవీ సంగ్రహ సుందరంగా ఉంటాయి. అలతి అలతి పలుకులతో అపూర్వములైన అర్థాలను పుట్టిస్తూ ఉంటాయి. సంస్కృత మింత తీయంగా, సరసంగా, జాతీయంగా ఒదిగి ఉంటుందా సంభాషణంలో అనిపిస్తుంది- భాస వాణిని పరిశీలిస్తూంటే. సన్న పోగారు నగిషీ పనితనం- నాజూకుగా కనబడు తుంది ఆయన నాటకాల్లో. ఇక రసభావాల పరిష్కారం- సన్నివేశాల సంక లనంలో చూపించే మెలకువలు, మనస్తత్వ చిత్రణంలో ఆయన పోయే పోకడలు కథానిర్వహణంలో కనపరచే ప్రజ్ఞా పాటవాలు- అచుంబితాలు, అనితర సాధ్యాలూనూ.

ఎన్నుకొన్న ఇతివృత్తానికి, ఇతివృత్తం కలిగించే రసభావాలకూ, జరిగే కాలానికీ ఒక ఏకీభావం కుదరాలి. ఇతివృత్తం ప్రసిద్ధమనీ, కల్పితమనీ, మిశ్రమ మనీ ముత్తెరగులలో ఉంటుంది. ప్రసిద్ధమైన కథ పదిమందికీ తెలిసింది తీసికొని

రసభావ సుందరంగా తీర్చిదిద్దటం. ఇది ప్రసిద్ధమైన మార్గం. ఇదికాక కేవలం స్వకపోల కల్పనంగా ఒకదానిని నిర్మించటం కల్పిత మవుతుంది. అటు పురాణ కథ కొంత, సొంతకల్పన కొంత కలిపి ఇతివృత్తాన్ని తీర్చటం - ఇది మిశ్రమ మవుతుంది. భాసుడెప్పుడూ రాచబాటలోనే నడుస్తాడు. ప్రసిద్ధమైన కథలనే ఇతివృత్తంగా స్వీకరించి బంగారు పంటలు పండిస్తాడు. ఆయన కథలన్నీ జనసామాన్యానికి బాగా తెలిసినవే. చక్కగా తెలిసినకథ అయితే అవగాహన చేసికోటానికి పెద్ద ప్రయత్నం అక్కఱలేదు. కథలో ఉండే కామనీయకం మనస్సుకంటుతుంది. అందులో ఉండే మలుపులు అలవోకగా తెలుస్తాయి. తెలిసిన కథలోంచి తెలియని అందాలు తెలియజెప్పటమే కృతహస్తుడైన కవి చేసే విలాసం. భాసుని వచోవిలాసం మనోహరంగా ఉంటుంది. వ్యాస వాల్మీకుల రచనల్లో ఉండే సంయమ సౌందర్యం, భాసునికి సహజంగా అబ్బింది. కొండంత భావాన్ని కోమలమైన పదంతో చెప్పటం ఆయనకు పరిపాటి. చిన్న చిన్న మాటలతో విపులార్థ ప్రపంచాన్ని శ్రీమంతంగా సూచించటం మహాకవులకే చెల్లింది. ఆర్షప్రతిభులకే అనన్య కమనీయమైన ఆ మార్గం అలవడుతుంది.

భాసవాణి కల్యాణ లక్షణాలకు రసజ్ఞలోకం పరవశించింది. జయదేవుడు భాసునికి జేజేలు చేశాడు. కవితా సరస్వతికి భాసుడు హాసమట!

"భాసో హాసః, కవికులగురుః కాళిదాసో విలాసః"-జయదేవుడు.

శారదా ప్రసాదాన్ని సూచించే చిరునవ్వుగా భాసుడిని భావించారు తరువాతివారు. చిరునవ్వుతో పోల్చి చెప్పటంలోనే భాసుని రచనల్లో ఉండే సౌకుమార్యం, చల్లదనం, సాజమైన సౌందర్యం అవగతమౌతున్నాయి. భాస నాటక చక్రంలో స్వప్నవాసవదత్తము పరమ రమ్యమైనది. అంత అందమైన నాటకం మఱొకటి లేదు. ఆ తీయదనం ఎలా సమకూరిందో చెప్పలేము. కథా గర్భంలోనే తీపి పొరలున్నాయో, కథాపింఛాన్ని విప్పటంలోనే ఆ సొగసులున్నాయో, ఏర్పరచి చెప్పలేము. కథ సాగుతున్న కొలది కమ్మెచ్చున లాగిన బంగారు తీగలా వింతకాంతులు వెదజల్లుతూ విలాసాలు చిందుతుంది. ఇతివృత్తం జగత్ప్రసిద్ధమైనది. ఉదయనుడు నాయకుడు. వత్సదేశానికి ప్రభువు. పాండవ వంశంలో మొలచిన మేలిముత్యం. మహాసత్త్వ సంపత్తి కలవాడు. సమస్త శుభలక్షణ శోభితుడు. వీణావాదన విద్యాకుశలుడు. ఆశ్రితమందారుడు. లాలిత్య సౌందర్య లాలసుడు. తన గొప్ప ఎప్పుడూ చెప్పుకోడు. తన పరిజనమన్న చెప్పలేని నెనరు. సచివాయత్తసిద్ధి. స్మృతి మాధుర్యవేత్త. ధీరలలితుడు.

కృతమెఱింగినవాడు. వీణావాదన కౌశలముతో వేవంద రాజములను లోగొన గలిగిన ప్రజ్ఞాశాలి. రసోదయుడు, వాసవదత్త రేకు నలగని మెత్తని జాజి పువ్వు. అవంతి రాజపుత్రిక, పరమ సౌందర్యవతి, గుణరత్న మంజూషిక, వీణావాదన మన్న ప్రాణము. వత్సరాజును గుఱించి కర్ణాకర్ణిగా విన్నది. ప్రాణప్రాణముగా ప్రేమించినది. ఈ ఉదయన వాసవదత్తల నాలంబించుకొనియే భాసుని మధురోహ స్వప్నము సాగినది, స్వప్న వాసవదత్తముగా సాక్షాత్కరించినది. తరువాత వారి నెందరినో మురిపాలతో అలరించినది. అందరికీ ఉదయనకథ విందమనే ఉబలాటము ! స్వప్న వాసవదత్తములో భాసుడు చూపించిన మెలకువలను పట్టుకొందమనే ఆశ! అది నిజమైతే కదా! ఆయన కన్నది తీయని కల ఆయె. అవియే నాటకకలగా పరిణమించినది. అందరినీ ఆశ్చర్య చకితులను చేసినది. భాసుని దరహాసముతో నాటకరంగము కల ఉద్భాసితమైనది. శాకుంతలము వంటి లోకోత్తరమగు నాటకమును నిర్మించిన కాళిదాసునకు గూడ భాసుని కలమీద వలపులే! ఉదయన వాసవదత్తల ప్రణయ ప్రసంగములు ఏ పువ్వుల పొదరింటి చాయలనో నిలబడి వినవలయునని ఉత్కంఠ! ఆ కథా సుధ లానుటకు ఎంతటి గాఢోత్కలికను కలిగించినాడు భాసుడు! ఉజ్జయినిలో ఉన్నవృద్ధులకు సంజవేళలలో మరొక వేళంబము లేదట! వలపులూరించు ఉదయనుని తలపులతో ప్రొద్దులు! ఏ పంచ చూచినను ఉదయన కథా కోవిదులతో కలకల్లాడుతూ ఉంటుందట! ''కొంచెము చుట్టు త్రోవ అయినా రసోచంచిత కథాకర్ణన కుతూహలం కలిగినవాడవు కనక, ఉజ్జయినిని సేవించి మఱీ సాగించు నీ ప్రయాణం! పరమ రసతత్త్వ విజ్ఞాతవు కదా! ఆ ఊరి పెద్దలు ఉదయన వాసవదత్తల కథలతో మురిసిపోతూ ఉంటారు. వారిని పలకరించి మఱీ వెళ్లు'' మంటాడు- కాళిదాసు జలధరంతో ప్రియసందేశ మంపిస్తూ.

''ప్యాప్యావంతీ నుదయనకథాకోవిదగ్రామవృద్ధాన్''

-మేఘసందేశం.

అనుకోవలసిందేమంటే కాళిదాసువంటి మహాకవులకు గూడ ఈ ఉదయన కథ అంతటి ప్రలోభ హేతువైనది. శ్రీహర్షుడు కూడ వత్సరాజచరితం విని, పరవశుడయ్యాడు. రత్నావళి నాటకంలో- ''లోకే హారి చ వత్సరాజ చరితం'' అని ప్రశంస చేశాడు. లోకంలో వత్సరాజచారిత్రం మనోహరమైనది. జన ప్రియమైనది. రస లుబ్ధుల కదొక తీయని విందు.

"స్వప్నవాసవదత్తము" సౌందర్యమును గురించి - మరొక లోకోక్తి ఉన్నది. సరస్వతీ పుత్రుడు రాజశేఖరుడు చెప్పిన శ్లోకమది.

"భాసనాటక చక్రేషు చ్ఛేకైః క్షిప్తే పరీక్షితుమ్
స్వప్న వాసవదత్తస్య దాహ కోఽభూ న్న పావకః"

భాస నాటకాల్లో ఏమాత్రం గుణముంది? అవి అగ్నిలాంటి కాలపరీక్షను తట్టుకొని నిలబడగలవా! ఎండుటాకుల్లా ఎగిరిపోతాయా! అని కొందరు ప్రేక్షకులు ఆ రూపకాలని అగ్గిలో పడేశారట. తక్కిన వెలా ఉన్నా స్వప్న వాసవదత్తాన్ని ముట్టుకోటానికి మాత్రం వెనకాడాడట అగ్నిదేవుడు. ఆ నాటకం అచ్చం బంగారంలా మెరిసిందట- అగ్నిద్యుతులను రెట్టిస్తూ.

దేశాన్ని కాలాన్ని తన దివ్య సందేశంతో ప్రభావితంచేస్తూ స్వప్న వాసవదత్తం జనరంజకంగా నిలుపగలిగింది. భాసుని నాటక నిర్మాణ కలా కౌశలానికి "స్వప్నము" ఒక మణి దర్పణం.

పలువురు విద్వాంసులు ఈ రూపకానికి విలువైన వ్యాఖ్యలు వెలయించారు. తొలుత చెప్పవలసింది మహామహోపాధ్యాయులు, - కీర్తికాయులు - శ్రీ గణపతి శాస్త్రిగారి వ్యాఖ్యానం. భాసుడుతోనే బ్రతుకయింది కనుక వారు తెలియజెప్పిన "స్వప్న" మాధుర్యాలు ఎలా ఉంటాయో చెప్పక్కర్లేదు. రెండవది శ్రీ విజయా నందులు వెలయించిన "సంజీవనీ" వ్యాఖ్య. మూడవది శ్రీ విజయానంద ఖండూడీ శాస్త్రి కావించిన విజయ వైజయంతి. నాల్గవది ప్రబోధినీ వ్యాఖ్య- శ్రీమదనంతరామ శాస్త్రి విరచితము. స్వప్న వాసవదత్తానికి ఎన్ని వ్యాఖ్యా నాలు వచ్చినా-అందులో భావించవలసిన విశేషములు మిగిలి ఉండనే ఉన్నాయి.

అసలు ఈ స్వప్న వాసవదత్తానికి కర్త ఎవరు? అని ఒక మీమాంస రేగినది. భాసుడే అని ఒక పక్షము, భాసుడు కాదు- ఆయన చేయలేదు అని మరొక పక్షము. ఎవరో అన్యులు చేశారని మరొక వాదము. ఇవన్నీ అకాండ తాండవంగా జరిగించే చర్చలు. పానకం త్రాగుతూ పుడకలున్నాయేమో అని తడవులాటలు! నీరసమైన వాదాలు-చూచింది నమ్మలేని వెఱ్ఱితనములు! కాళిదాసు కంటె తెలివైనవారా వీరు! ఆయనగారే భాస మహా ప్రతిభకు జోహారులు చేశారే! భాస నాటక కాంతుల్లో తన రచనలు ఎక్కడ అగుపడవో అని ఆందోళితు డయ్యాడు. భాసనాటక చక్రాన్ని సూక్ష్మంగా పరిశీలిస్తే - ఆ అల్లిక-ఆ నిర్మాణ వైఖరి - ఆ పాత్ర చిత్రణం - ఆ సంగ్రహ సౌందర్యం- ఆ రస నిర్వహణ సౌకుమార్యం - భాసుడికి తక్క - ఈ సృష్టిలో మరొక్కరికి సాధ్యం

కాదనిపిస్తుంది. మాన్యులు శ్రీ గణపతిశాస్త్రి పండితులు - క్షోదక్షమంగా - విచారించి, భాసుడే ఈ నాటకచక్రనిర్మాతయని సిద్ధాంతం చేశారు. కళా పరిపూర్ణుడు భాసుడే ఈ నాటక సృష్టి కావించాడని మన భావన.

భాసు డేకాలం వాడన్న ప్రశ్న మొకటున్నది. ఇది తేల్చి చెప్పటానికి సులువైనది కాదు. అదృష్టమో, దురదృష్టమో అందరి కవులను గుఱించి ఇదే స్థితి. కాలమానము స్పష్టంగా చెప్పటానికి లేదు. ఆ కవుల కేమయినా కావలెనంటే కదా! తమఱిని గురించి తెలియజేయాలన్నదే తమకు తెలియదు. బ్రతుకంతా ధారపోసి పలికించటమే వారి వంతు. రచనలతో సరి, మఱి వారు మిగిలింది లేదు. తరువాత వారు తలుస్తారా, కాలంలో తాము నిలుస్తారా అన్న ఆలోచనము వారికుండదు. అది నేటి వారికి పట్టిన తీట. అరిగించుకొన్నది తక్కువ. ఆఱ ఎక్కువ. శక్తి అల్పము - సందడి ఎచ్చు. నేలంటు వీడకపోయినా కీర్తి చదలంటాలి. భాసుడు సుకృతి శ్రేష్ఠుడు. తన గుఱించి ఒక్కమాట పలకలేదు ఎందులోనూ. ఎలా నిర్ణయం చేయాలి ఆయన జీవించిన కాలాన్ని?

కాళిదాసు ఎప్పటివాడో ఇప్పటికీ అంతుబట్టలేదు. అదనీ ఇదనీ స్థూలారుంధతీ న్యాయంగా అనుకోటమే! ఆయన విక్రమ శతాబ్దం తొలినాళ్ళలో ఉండుండాలని చాలామంది అన్నారు. కీత్ మహోదయుడు మాత్రం - చంద్రగుప్తుని కాలంలో కాళిదాసు ఉండి ఉండవచ్చునని అభిప్రాయపడ్డారు. కాళిదాసు భాసుడిని గురించి పెద్దగా ప్రశంస చేశారు. అప్పటికే భాసుడు బాగా ప్రసిద్ధి చెందినవాడు కావాలి. కాళిదాసు విక్రమ శతాబ్దం ప్రథమార్ధంలో ఉంటే అప్పటికి నూరేండ్లు ముందైనా భాసుడు ఉండుండాలి. కాదు; చంద్రగుప్తుడు పంచమ విక్రమ శతకంలో ఉన్నాడని ప్రతీతి. కాళిదాసు అప్పటివాడని కదా కీత్ పండితుని అభిప్రాయము. కావున భాసుడు మూడు నాలుగు విక్రమ శతాబ్దాలలో ఉండుండాలి. ఈ రూపకంలో అపాణినీయాలు కొన్నిచోట్ల అగుపడుతున్నాయి. కనుక భాసుడు పాణిని, కాత్యాయనులకు ముందున్న వాడు కావలయును అని ఒక ఊహ. ఇది భాసుని కాలము అని స్పష్టంగా చెప్పటానికి ఆధారాలు లేవు. ఏదో ఊహించడం అంతే! కాళిదాసు ప్రశంసించాడు కనుక ఆయనకు చాలా ముందువాడని అనుకోవటం.

ఐతిహాసిక పరిశోధకులకు అనంతమైన అవకాశమిచ్చాడు భాసుడు - భావిస్తూ ఉండమని.

స్వప్న వాసవదత్తం అందమైన నాటకం అని వారూ వీరూ అందరూ అన్నారు. ఏమిటా అందం? కథలో అందమా! కదలికలో అందమా! రస భావాల పోషణింపులో అందమా! సన్నివేశాల కూర్పులో అందమా! మాటల్లో అందమా! పాత్రముల తీర్పులో అందమా!

భాసుడు తీసికొన్న ఇతివృత్తం పరిశీలిద్దాము, ఈ రూపకం పేరు స్వప్న వాసవదత్తం. స్వప్న వాసవదత్తమని పేరేమి? స్వప్నములో వాసవదత్త అగు పించినదేమో! ఆమె తలపులతో కల పండినదో ఏమో! వాసవదత్త జాడ లగు పడిన స్వప్నము కనుక స్వప్న వాసవదత్తమైనది. పేరుంచుటలో ఒక గడుసు దనమున్నది. వాసవదత్త కన్నుల కగుపడుటకు లేదు. ఆమె ఏనాడో లావాణ కములో అగ్నిదగ్ధయైనది. ఉదయునకు వీణ అన్న ప్రాణము. ఎంతసేపు వీణా వినోదనమే! గజములు సైతము అతని వీణావాదన ప్రావీణ్యమునకు పరవశ మయ్యేడివట! వీణను చూచియే వాసవదత్త ప్రాణము పెట్టినది. ప్రద్యోతుడు (మహాసేనుడు) ఉజ్జయిని ప్రభువు. ఆయన కుమార్తె వాసవదత్త. ఉదయనుడు వీణావాదన కుశలుడు. తనకు సహజంగా శత్రువు. అయినా ప్రతిత త్త్వజ్ఞుడు కనుక ఉదయనునకు తన కన్య నిస్తే బాగుంటుందనుకొన్నాడు. తానై కోరటా నికి లేదు. ఉదయనుడో మహామానవంతుడు. ఆయనై స్వయంగా వచ్చికోరడు. ఎలా కుదురుతుంది? మంత్రి యౌగంధరాయణుడికి రాజ్యము అప్పగించి వీణా వినోదంతో - మృగయా వ్యసనంతో ప్రొద్దులు గడుపుతున్నాడు ఉదయనుడు ఇది మంచి సమయం శత్రువులను లోబరచుకోటానికి అని ఎంచాడు మహాసేనుడు. ఒక కృత్రిమ గజాన్ని నిర్మించి, అందులో సైన్యాన్ని ఉంచి, ఆ ఏనుగును సమీపారణ్యంలో తిరగాడటానికి వదిలాడు మహాసేనుడు. మృగయా వ్యాజంతో వెళ్ళి- ఉదయనుడు ఆ గజాన్ని లోబరచుకొంద మని ప్రయత్నించి బంధితు డయ్యాడు. అనుకొన్న ప్రకారం ఉదయనుడిని ఉజ్జయినికి కొనిపోగలిగాడు మహాసేనుడు. రాజోచితమైన మర్యాదలు జరిపించి - కుమార్తె వాసవదత్తను వీణా శిక్షణకై శిష్యురాలిగా సమర్పించాడు. యౌగంధ రాయణుని నీతి బలం వల్ల - కొన్నాళ్ళచ్చట గడిపి - భద్రంగా వాసవదత్తతో స్వస్థానానికి చేరగలి గాడు ఉదయనుడు. ఇదంతా ముందు జరిగిన కథ. వాసవదత్తతో వీణా వినో దంతో ఉదయనుడు రసాలసంగా ఉంటూ ఉంటే తన రాజ్యం శత్రువులు కబ ళించారు. తిరిగి స్వామికి రాజ్య సంపాదనం చేయాలి. వాసవదత్త అంగీకారంతో యౌగంధరాయణుడు - ఒక తంత్రం ఆలోచించాడు. వాసవదత్త-ఉదయనుడు

వేటకు ఏగిన సమయంలో లావాణకంలో అగ్ని దగ్ధ అయ్యిందని ఒక ప్రవాదం లేపదీశాడు. జ్యోతిష్కులు చెప్పారు- ఉదయనుడు పద్మావతిని పరిణయమాడితే సార్వభౌముడు కాగలడని. పద్మావతిని ఎలా ఇస్తారు కన్నవారు! వాసవదత్త జీవించి యుండగా! కనక ఆమె అగ్ని దగ్ధ అయిందని నమ్మించాలి. ఆవంతిక భూమికను ధరించటానికి వాసవదత్తను అంగీకరింప జేశాడు యౌగంధరాయణుడు. పద్మావతికడ న్యాసంగా ఆవంతికను ఉంచి - పద్మావతీ ఉదయనుల పరిణయానికి మార్గం సుకరం చేశాడు. ప్రాణప్రాణంగా ఎంచుకొన్న వీణ - వాసవదత్త-ఉండగా ఉదయనుడు మరో పెండ్లికి సుతరాము ఇష్టపడడు.

పద్మావతిని పెండ్లాడినా, వాసవదత్తా విరహం ఉదయనుడిని క్రుంగదీస్తోంది. నవోఢతో నవ్వుతూ కాలం గడపలేడు. అలా అని మారుమొగంతో ఉండటానికీ లేదు. క్రొత్త పెండ్లికూతురు - ఈ నవ ప్రియుని వింతవర్తనం చూచి చిన్నపుచ్చుకోవచ్చు. ఈమెకు కష్టం కల్గించకూడదు. మనసులో మఱుగుతున్న వేదన మఱపటానికి లేదు. విరహ విప్రలంభంతో వేగిపోతూ ఉంటాడు - ఉదయనుడు. వాసవదత్త ఉదయనునకుచ్ఛ్వాసము. ఆమె అగుపడదు. లోపించినది. గట్టిగా నిట్టూర్చుటకు వీలులేదు. ఇదీ ఉదయనుని హృదయ స్థితి.

ఎంత చూచిననూ వాసవదత్త అగుపడదు. ఆమె ప్రణయ స్మృతులు పునాదులు కదలించు చున్నవి. ఇటుకామ వలె లోలోన సెగలతో కుములుచున్నాడు. కనుల ముందున్నది పద్మావతి. మనోనేత్ర పరిధిలో ఉన్నది వాసవదత్త. అనుభవమునకు అందనిది, చూపులకు చెందనిది, లోపలనే మెదలునది అగు వాసవదత్తను కలనైనా కలవాలనుకొన్నాడు- ఉదయనుడు.

చూచి చూచి చూపులు అలసములై ఱెప్పలను కప్పుకొన్నవి. ఉదయనునకు స్వప్నము వచ్చినది. వాసవదత్త రానే వచ్చినది. కలలో అమృత కలలా. కలలో వాసవదత్తను గుఱించిన కలకలమే- స్వప్నవాసవదత్తముగా మనము చూస్తున్నాము.

భాసుని ప్రజ్ఞా విశేష మిట్లుండును. ఎంత అందమైన పేరు ఉంచాడీ ఇతివృత్తానికి. ఎక్కడినుండి కొనివచ్చాడు ఈ ప్రణయ ప్రసంగాన్ని. ఇంచుమించు-ఈ ఛాయలే కలిగిన కథా ప్రసంగం - బృహత్కథా మంజరిలోనూ - సోమదేవుని కథా సరిత్సాగరంలోనూ అగుపడుతుంది. మట్టి ఎక్కడిదైతేనేమి? దాన్ని చఱిచి, మలిచి అమృతకలశంగా రూపొందించటంలో ఉంది ఆ అందమంతా. అదే కుంభకారునకు శిల్పదేవత అనుగ్రహించిన వరం!

ఇంతకును ఈ తీపి కథకు నాయకుడెవరు ? నాయిక ఎవ్వరె ? వారి విభావనయే కదా రసజన్మభూమి ! వారి అనుభావములు - అనువర్తనములు - ఆలాపములు-ఆదర్శములు- కేలీ విలాసములు-లీలా విభ్రమములు-ప్రేమాభిషేక ములు-ఇవికదా భావింపబడి సామాజికులను రసానంద డోలికలలో నూచునది ! రసము వలన కలుగు ఆనందము గొప్పది. అది పరమాత్మ సన్నిధి వంటిది. అమలినమైన ఆ ఆనందము కొఱకే ఈ ఆరాటమంతయును. పువ్వుల వలె సౌకు మార్యము కలిగిన వారు నాయికా నాయకులు కావలయును. పుప్పొడి కన్న మెత్తనయగు ఉత్తమ గుణములు వారికి సాజమై ఉండును. వారే రస వాహిను లను పొంగింతురు. అన్ని రసములు ఆనందమునే కూర్చును. అయినను శృంగా రము అన్నిటిలోనూ మిన్న. అది జీవ లోకమునకు సంజీవని వంటిది. రతి అన్నచో రాలకు కూడ జల జలలే !

ఉదయనుడు రసపర్వములు కల సముద్రము వంటివాడు. కలలన్న ప్రాణము. రాసిక్యమునకు రాజు-వీణావాదనములో విశ్రుతుడు. ఆయన ఈ కథకు నాయకుడు. ఘోషవతి ఆయనకు రెండవ ప్రాణము. అవంతిరాజ పుత్రిక వాసవదత్త పరమ సౌందర్యవతి. వీణాప్రియ. అది చూచియే వత్స రాజును వలచినది. పెండ్లాడినది. వత్సరాజునకు ఆమె బహిఃప్రాణము. ఆమెతో-వీణతో మైమఱపులు-మధుర ప్రసంగములు-ఆమె లేదు. ప్రాణమే లేదు. ఎటు చూచినను వాసవదత్తకు సంబంధించిన స్మృతులే ! ఉదయనుని ప్రియా విరహము-రసోదయమునకు దారితీసినది. అందులో నుండి శోకము పుట్టినది. కరుణముగా పరిణమించి పొంగినది. ప్రియురాలిని పొందవలెనను ఉత్కంఠ. అదియే రతి. అది శృంగారముగా పొంగులు వారినది. విభావానుభావముల సంయోగముతో పొంగిన కరుణ రసము శృంగారముతో చెట్టాపట్టాలు పట్టి - రసజ్ఞులను ఊరించినది. కరుణముతో సరిసమానముగా చెలువొందు శృంగార రసము స్వప్నవాసదత్తమునకు ప్రాణమైనది. ప్రధాన రసము శృంగారము. కరుణము అంగరసము. వాస్తవమునకు కరుణ శృంగారములు ఒక దానిలో ఒకటి కలియునవి కావు, విరుద్ధములైన రసములు. పరమ సుకుమారములైన రసములు-సమర్థుడైన కవికి గూడ వీటిని నిర్వహించుట ప్రాణము మీదికి వచ్చి నంత పని-అని ఆనందవర్ధనులు అన్నారు. కరుణమునకు శోకము స్థాయి. రతి నాశము దీనికి పునాది. శృంగారమునకు స్థాయి రతి. అభిలాషము దీనికి మూలము. ఈ రెంటిని పొసగించుట ఎట్లు ?! అదియే భాసుడు చేసిన కలావిలా

సము. భాసుని కల అంత కలకలలాడును. అడుగులు తడబడకుండ పరువెత్తు జోడు గుఱ్ఱములవలె కరుణ శృంగారములతో స్వారి చేయించును. ఇది అల్ప ప్రతిభులు చేయదగినది కాదు. ప్రతిభా పరమేశ్వరులైన కవులు మాత్రమే చేయ దగినది. అందులకే భాసుని మహా ప్రతిభకు ముగ్ధుడై జేజేలు చేశాడు కాళిదాసు!

ఈ రూపకమునకు ఉదయనుడు నాయకుడు. వాసవదత్త నాయిక. ఆమె లేకపోయినను- (లోపించినదను ప్రవాదమున్నను) అయిదంకములలో - సరస్త రంగములలో తూగాడు చందమామవలె-ఆవంతిక రూపములో దర్శనమై-వెలుగు నీడలను ప్రసరించినది. ఉదయనుని ప్రణయస్మృతులతో-నిట్టూర్పులతో పాలు పంచుకొన్నది. చిత్రపట దర్శనముతో-అందరికిని కనువిప్పై - చివరకు ఉదయ నుని చెంత చేరినది.

''అహో! ఆర్యా ఖల్వియం! ఆర్యే! సఖీజన సముదాచారేణ అజా నత్యా అతిక్రాంతః సముదాచారః! తచ్ఛిర్షేణ ప్రసాదయామి.''

అని పద్మావతితో పాదప్రణతులు కొన్నది. ''ఏమి! వాసవదత్తయా ఈమె! మాన్యురాలా! చెలి వనుకొని ఎంచి ఎగ్గులు చేసితిని. మన్నింపుమని'' వాసవదత్త కాళ్ళపై వినయవతి పద్మావతి పడినది. ''మాంగల్యవతీ! చెల్లీ! లెమ్మ! ఆవంతికనై నేనే ఎగ్గొనరించితిని. నీ దోసమేమున్నది!'' అని వాసవ దత్త పద్మావతిని లేవనెత్తును.

''ఉత్తిష్ఠ! ఉత్తిష్ఠ! అవిధవే! ఉత్తిష్ఠ. అర్థిస్వం నామ శరీర మపరాధ్యతి!''

అని వాసవదత్త పద్మావతితో అనును! ''ఒకరి పంచన పడి ఉండటమే దోసము. అదే స్వాతంత్ర్యాన్ని తొలగిస్తుంది. అపరాధం చేయిస్తుంది. ఇందుల్లో నీదేముంది'' అంటుంది వాసవదత్త.

పద్మావతి మధురభాషిణి-శాలీనత కల పడుచు. అందగత్తె. అణకువ కలది. మనసైన చెలిని గుఱించి - మగడు గతించినస్మృతులతో- కళవళపడు తూంటే-సహనముతో సద్భావముతో అవగాహనము చేసికొన్న పుణ్యాంగన- అతని విరహమును భరింపలేని పతిదేవత-అతని జాలికి-అతని అభిజ్ఞతకు పొంగి పోయినది. వలపు గాయముతో విలవిలలాడుచున్న వత్సరాజుతో చేరి- ఆమె వెలార్చిన రసభావముల తళుకులు-అతిలోకములు-ఈ రూపకమునకు ఈమె ఉపనాయిక.

పువ్వులకైనా వాడుటలుండును గాని, ఉదయన వాసవదత్తలు ఎన్నడునూ వాడరు. ఉభయులూ సౌందర్య రసాధిదేవతలు. ప్రాణప్రాణముగ ప్రేమించు

కొన్న జంట. ఈ జంట పలపుల పంటను పండించుటలో భాసుడు చూపించిన మెఱుపులు-లోకస్తుత్యములు.

భాసుని నాటకము ఒక విలక్షణ సౌందర్యమును చిందుచుండును. నాంది జరిగినట్లుండదు. నాద్యంతములో సూత్రధారుడు వచ్చి-నాంది వంటి ఆశీరూప మైన స్తవము చేసి-''ఏదో చెప్పదమనుకొంటూ ఉంటే ఏమి ఈ కలకలము-ఓహో! పద్మావతీ పరిచారకుల సంరంభమా ఇది! తెలిసినది!'' అని కథా బీజమును స్థాపన రూపములో చేయును. ఏమి ఈ సంగ్రహ సౌందర్యము! చిన్నమాటతో కథాగర్భవీచికలను తడవును. భాసుని ప్రస్తావన లంత సుమాళ ముగ నుండును.

పరివ్రాజకరూపంలో యౌగంధరాయణుడు-ఆవంతిక వేషంలో వాసవ దత్త ప్రవేశింతురు. ఇటుమీదట రస పర్వములు ఒకదానిని తరుముకొని ఒకటి మీదికి పొంగి, సామాజికుని ఆనందములో అవగాహనము చేయించును. సముద్ర మంత కథను సూదిమొనతో సూచించును. ఏమి అమోఘమైన సృష్టి!

పాత్రచిత్రణలో మెలకువలు-వారితో పలికించు మాటలు- ఆమాటలలో అవగతమగు కథాగతి విశేషములు-సన్నివేశములను కూర్చుటలో సొగసులు-రసభావములను తీర్చుటలో చతురతలు - ఇవన్నియును ఆకుల్లో ఈనెలవలె అంతర్లీనములై స్వప్నవాసవదత్తమునకు-ఒక వింత చెలువమును చేకూర్చినవి. కాళిదాసు - భవభూతి - శూద్రకుడు - శ్రీహర్షుడు మొ॥ కవులెందఱో-భాసుని మాటలనో-చేసిన కల్పనలనో తీర్చిన రసభావములనో-కావించిన చిత్రణమునో-భావించి పారవశ్యముతో ఆ చాయలను తమ కృతులలో మెఱిపించినారు.

ఇది ఆరంకముల నాటకము. ప్రధాన రసము శృంగారము. కరుణము కడవరకు అంటి సాగినది. రెండింటిని సాగించుట అబ్బురమైన పని. ఉదయనుడు రాసిక్య గుణసంపన్నుడు. కలతో జీవించి, రాజ్యమును కోలుపోయినాడు. ఆయనకున్న అదృష్టము అఘటన-ఘటనాపటువైన యౌగంధరాయణుడు-స్వామిసేవయే ఆయనకు జీవన పారమ్యము. ప్రభువును తిరిగి సార్వభౌమునిగా చూడవలెను. పద్మావతి పెండ్లాడినచో ఆ అదృష్టము వరించునని దైవజ్ఞులు పుష్పకభద్ర ప్రభృతులు చెప్పిరి. పద్మావతీ పరిణయము-రాజ్యలాభము జరుగ వలయును. దీనిని సాధించుటకు తనకు పరివ్రాజక వేషము-వాసవదత్తకు ఆవంతిక వేషము.

కథను రసవంతముగా మలచుటకు భాసుడు కొన్ని చిత్రములైన సన్ని వేశములను చేర్చును. అవి రసవాహినులు. బ్రహ్మచారి వృత్తాంతము-కౌతుక మంగళమాలా గ్రథనము-మాధవీలతామంటప ఆలాపములు - సముద్ర గృహ వృత్తాంతము-చిత్రపట సన్నివేశము-ఈ సన్నివేశములను సుందరముగా పొందు పరచుటలో-ఉదయన వాసవదత్తల ప్రణయ వృత్తాంతము- సరస్సులో విరిసిన శతపత్రము వలె రేకులు విప్పినది.

ఆవంతిక ఆశ్రమములోని అచలింపులను చూచి నాకును తొలగింపులా అని పరివ్రాజక రూపంలో ఉన్న యౌగంధరాయణుని- అడుగును. "అమ్మా- తెలియబడనిచో దేవతలు సయితము ఇట్లే తిరస్కార భాజనులగుదురు. అయినను ఇవి నీకు క్రొత్తలా! ఇట్టివి నీ ఏలుబడిలోనూ జరిగినవే! నీ ప్రియుడు జయము నందిన పిదప అన్నియును చక్కబడును. కాలక్రమం వలన భాగ్యచక్రం క్రింది మీదులవుతూ ఉంటుంది" అని ఆమెను యౌగంధరాయణుడు ఓదార్చును. ఈ మాటల్లో ఎంత మహార్థాన్ని నింపాడు. వాసవదత్త పుణ్యదేవత కదా! ఆమెకు పట్టిన అవస్థను ఎంత సుకుమారముగా ధ్వనింప చేశాడు.

"కాలక్రమేణ జగతః పరివర్తమానా
చక్రారపంక్తిరివ గచ్ఛతి భాగ్యపంక్తిః"

ఈ మాటలు సూక్తులై నిలబడినవి. కాళిదాసును కూడ సమ్మోహ పరచినవి. ఇదే భావమును ఆయన మేఘములో చెప్పక తప్పినది కాదు.

పద్మావతి తపోవనమునకు- రాజమాత దర్శనమునకై వచ్చినది. ఎట్లో ఆవంతికను ఆమెకు న్యాసముగా అప్పగించినాడు యౌగంధరాయణుడు. ఇంతలో బ్రహ్మచారి ఆ చాయలకు ఏతెంచెను. ఎక్కడనుండి రాక అని యౌగంధ రాయణుడు అడుగును. "శ్రుతి విశేషణమునకై లావణకమున కరిగితిని. అక్కడ అగ్నిదాహము జరిగినది. అందులో వాసవదత్త, యౌగంధరాయణులు గతించిరి. వత్సరాజు వాసవదత్తను తలచి తలచి, మిగిలిన ఆమె సొమ్ములను చూచిచూచి-శోకముతో మలమల మరుగుచున్నాడు- అతనిని సచివులు - ఎట్లో తప్పించి-మరొక చోటికి కొనిపోయిరి. ఉదయనుడు లేని ఆ ఊరిలో ఉండ నొల్లక-ఇటు వచ్చితిని" అని చెప్పును. అది వినుటతో కన్యక పద్మావతికి ఉదయనునిపై జాలి-తలపులు! వలపులు! వాసవదత్తకు - మగడింత తన్ను వలచెనే-తన ప్రణయమును గురించి బహుళంగుల తలచెనే అని ఓదార్పులు! తాను చేపట్టిన ఆవంతిక వేషమును కడంట నిర్వహించుటకు-ఇంచుక ఓరిమి- పద్మావతికి మధుర స్పృహ-ఇన్నిటిని సమకూర్చినదీ సన్నివేశము.

పద్మావతికి ఉదయనునిపై తలపులు తొలకరించినవి. పద్మావతీ వాసవదత్తల మాటలలో-ఉదయన ప్రసంగము-అంచులుదాటి ఉదయన గుణకీర్తనము-అంతలో ఆవంతిక వేషము-స్ఫురణకు వచ్చి-తనలో తాను సంబాళించుకొనుట-సర్ది చెప్పుకొనుటలు-ఇట్లు ఆ ఆలాపములు ముగ్ధమోహనములు!

ఆవంతిక దుఃఖము అదొక పాయకు చెందినది. వాసవదత్త మూలమై ఉదయనునకు శోకము! ఉదయనోద్వాహమునకై పద్మావతి సంరంభము-ఈ విచిత్ర సన్నివేశములో "పద్మావతి ఉదయనుల పెండ్లి"కి-మాంగల్యదామమును ఆవంతికను గ్రుచ్చుమని ఆదేశము. అవుననుటకు మనస్సు లేదు. కాదనుటకు వీలులేదు. ఎట్లో కౌతుకమాలిక నల్లినది. సౌభాగ్యవర్ధనమును కూర్చినది. సపత్నీమర్దనము అను ఓషధిని మాత్రము-దూరము చేసినది. ఇది ఏల గుంఫితము కారాదు అని చేటి యడుగును. "అతని ప్రియురాలు గతించినది కదా! దీని అవసరమేమి ?" అని వాసవదత్త అనును. ఈ సన్నివేశము-సుకుమారభావములను, పూలతావులవలె గుప్పుచున్నది!

మాధవీలతా మంటపము- మధురాలాపముల మందిరము. పద్మావతి వాసవదత్తలు-చేటితో అరుగుదురు. అంతలో వసంతక ఉదయనులు - ఆ చాయలకు వత్తురు. వారి రాకను వారించుటకై-అక్కడ పువ్వుల తీవను కదిలించినారు. తుమ్మెదలు-వెఱ్ఱెత్తి నలుదెసల రేగినవి- అంతటితో వారు-ఆవలనే ఉండిపోయిరి. ఈవల వీరిరువురు. ఆవల వసంతక ఉదయనులు. వసంతకుడు తుమ్మెదలను అదలింప పోవును. "ఏలనయ్యా-వాటిని చెదర గొట్టెదవు. అవి కూడ ప్రియా వియుక్తములై అడలవలెనా!" అంటాడు ఉదయనుడు. అతని మనస్సులో సనసన్నగా సాగుచున్న వాసవదత్తా విరహ శోకము-ఎంత చక్కగా ధ్వనించినది!

"సరే కాని ! ఉదయనా, ఎవ్వరూ లేరు కదా ! ఇష్టమైన స్నేహితులము ! ఒక్క మాటడగనా ! దాపరికము లేక చెప్పవలె ! పద్మావతీ వాసవదత్తలలో ఎవరు నీకు ఇష్టులు ?" అంటాడు వసంతకుడు. "నీవు వాగుడు కాయవు ! ఏలనయ్యా ఆ ఊసులు !" అంటాడు వత్సరాజు. కాదని నిర్బంధిస్తాడు. "పద్మావతి మంచిది-తియ్యగా మాటాడుతుంది. వినయవతి. అందమైనది-అయినను వాసవదత్తాగతమైన నా మనస్సును ఆకర్షించలేకపోయినది." ఇది వినగానే-వాసవదత్తకు-ఆవంతికా వేషమునకు తగిన మూల్యము అబ్బినట్లయినది. పద్మావతికి పతి ఎంత మంచివాడో ! గతించిన ఆమెను ఇంత మధురంగా

స్మరిస్తున్నాడే అన్నట్లయింది. వసంతకుడు కూడ అదే అభిప్రాయమును ప్రకటించును. "సరే, ఈ విషయం వాసవదత్తతో చెప్పుదును" అని అంటాడు ఉదయనుడు. "ఇంకెక్కడి వాసవదత్త, ఆమె చనిపోయిందంటాడు" వసంతకుడు. అంతలో ఉదయనునకు కళ్ళలో నీళ్ళు తిరుగుతాయి. శోకంతో కుమిలిపోతాడు. ఉదయనుడిని తేర్చమని పద్మావతిని పంపించి - వాసవదత్త వెడలుతుంది. తెల్లుపూపొడి కళ్ళల్లో పడినదని సర్ది చెప్పి - పద్మావతి తన స్థితి చూచి ఎక్కడ చిన్నపుచ్చుకొంటుందో అని ఉదయనుడు-బుజ్జగించుతాడు. ఈ మధుర సన్నివేశము-ఎన్ని మనస్తత్త్వములను-అద్దము పట్టి చూపించుచున్నదో సహృదయులు-ఎఱుంగ గలరు.

వీటినన్నిటినీ భావించుకొని, భావించుకొని, పద్మావతికి శిరోవేదన వచ్చినది. తల నొప్పి కాదా-మఱి వలచిన మగడు - గతించిన చెలువను తలంచుచు కన్నుల నీరు నింపుకొని-మారు మొగముతో - రేబవళ్ళు శోకిస్తూ ఉంటే - తాను పట్టపుదేవికదా ! వాసవదత్తను మఱపించి, తానేల వచ్చును కదా ఉదయనుని-హృదయ రాజ్యమును. ఉదయనునకు - హృదయము హృదయములో నున్నను కదా! ఇదంతయును. ఏమియును తోచక-తల దిమ్ము పట్టినట్లయినది. ఈమెగారి అస్వస్థత గుఱించి చెలికత్తెలు వాసవదత్తకు, ఉదయనునకు కబురంపిరి. సముద్ర గృహములో శయనము ఏర్పాటు చేసిరి. ఇది అన్నిటికన్నా ప్రముఖమైన సన్నివేశము. భాసుని ప్రజ్ఞ వెయ్యిరేకుల అరవిందమువలె ఇందులో విచ్చుకొన్నది.

పద్మావతికి ప్రియసఖి కదా వాసవదత్త-కథలో కబురులో చెప్పి పద్మావతిని తేర్చుమని ఈమెకు కబురంపిరి. పద్మావతిని చూతమని ఉదయన వసంతకులు అక్కడికి ఏగిరి. అప్పటికి పద్మావతి రాలేదు. శయ్య ముడుతలు లేకుండ పరచినది పరచినట్లున్నది. సరే, ఇంతలో అంతలో రావచ్చును కొంతసేపు ఉందమని ఆ ప్రక్కపై ఒత్తిగిల్లాడు ఉదయనుడు - అతనికి కాలక్షేపమునకై ఉజ్జయిని అనీ, సరస్సులనీ, అది కాదని, అస్తవ్యస్తముగా ఏదో కథ చెప్పుతాడు వసంతకుడు.

ఉజ్జయిని అనేసరికి-నివురు కప్పిననిప్పు గుప్పున పైకెగసినట్లు వాసవదత్తా స్మృతులు-రేగినవి. ఉదయనునకు మఱి స్మృతి లేదు. వాసవదత్తను గుఱించిన ఆలోచనమే. చూచి చూచి - ఆలోచనమునకు అందక ఆ లోచనములకు అలసట వచ్చినది. ఱెప్పలు వాలినవి. "ఊఁ, ఆఁ, అనుటలేదు; ఇతనికి

నిదుర వచ్చినది కాబోలు. నేనును పోయి ఒక దుప్పటి తెచ్చుకొందును. చలిగా ఉన్నది" అని విదూషకుడు వెళ్ళిపోవును. ఇంతలో వాసవదత్త వచ్చినది. ఆమెతో వచ్చిన చెలికత్తె శిరోవేదనకు మందు తెత్తునని వెడలినది. వాసవదత్తకు ముసుగులో పరున్నది పద్మావతి అన్న తలంపు. శయ్యపై కూర్చున్నది. ఎడముగా ఉంటే పద్మావతి ఏమనుకొనునో అని పజ్జలనే పరున్నది. ఇంతలో ఉదయనునకు స్వప్నము! ''అవంతి రాజపుత్రీ! వాసవదత్తా! ప్రియసఖీ! పలకవేమి? అలంకరించుకోవేమి? విరచిక స్మరణకు వచ్చినదా!'' అని ఏమేమో అనును; ప్రియవల్లభుని సన్నిధి; వియోగవిహ్వలితుడు; అంటి ఉండటానికి లేదు; అని విడువడానికి లేదు. జాగయితే పద్మావతి కాని, మఱియొకరు కాని రావచ్చు. ''ఇచటనూ విరచిక తలంపులేనా!'' అని చీదరించుకొని, తన్ను లాలించటానికి చాచిన ఉదయనుని చేతిని యథా స్థానంలో ఉంచి, వాసవదత్త ఆ ప్రదేశము విడచి వెళ్ళుతుంది.

ఆమెను తలుస్తూ కలత నిద్దురగా, ఉదయనుడు లేచి- చేరువలో ఉన్న ద్వార బంధాన్ని తాటిస్తాడు.

వాసవదత్త జీవించి ఉన్నదని- తన కలసంగతి చెబుతాడు ఉదయనుడు వసంతకునితో. ''భ్రమపడి ఉంటావు, ఇంకెక్కడి వాసవదత్త! ఆమె ఏనాడో చన్నది. అవంతి సుందరి అని ఒక యక్షి ఈ నగరంలో ఉన్నది. దాన్ని చూచి ఉంటావు-'' అంటాడు వసంతుడు. ''అది కాదయ్యా, వాసవదత్తేనయ్యా! కాటుక రేకలు లేని కన్నులు-వ్రేలాడుచున్న చెదరిన కుంతలములు-విప్రలంభంతో వాడిన మొగము చూడు- ఆమె తాకుటచే ఈ నా చేతికి కలిగిన రోమాంచము-" అని అతన్ని సమాధానపరచును.

ఇది ఉదయనునికి వచ్చిన తీయని స్వప్నము. వియుక్తులైన నాయికా నాయకులను ఏకశయ్యకు చేర్చిన సముద్రగృహ సన్నివేశము. వాసవదత్తకు- ఉదయనుడున్నాడు. పద్మావతీ పరిణయమైనది. నేడో రేపో రాజ్య లాభము సమకూరగలదు అన్న తలంపు. ఉదయనునకు ఘోషవతి లేదు; వాసవదత్త లేదు. ఆమె ప్రణయస్మృతులున్నవి. వీణలేదు. కాని, శ్రుతులు వినబడుచున్నవి. ఇవి కానబడవో ఏమో! చూపులో ఏమున్నది! భావించుటలో కదా ఉన్న స్వారస్యము- కలనైన సన్నిధిని పొందవలెనని ఉత్కంఠ! ఉదయనునకు కల వచ్చినది. వాసవ

దత్త రానూ వచ్చినది. ఆ కల రాజునకా వచ్చినది!? కాదు, సామాజికునకు-ఇందులో ఉన్నదన్న రసభావము - లోపలి పొరలలో ఉన్నది. లేదన్న భావము పైకగుపించుచున్నది. విప్రలంభములో మాగిన అమలిన శృంగారము అంచులు తాకి ఆ ఉభయులనూ పరివేష్టించినది. లీలగా చలించిన వెలుగు నీడలు ఉద్వేల రసస్ఫూర్తికి తావలమైనవి. ఏమి స్వప్నము! చలి అని ప్రావారకము తెచ్చు కొనుటకై వసంతకుడు వెళ్ళినాడు. శీర్షానులేపనమునకై వాసవదత్తతో వచ్చిన చేటి జారుకొన్నది. చేటి వసంతకులు-ఉదయన వాసవదత్తల కేకాంతము కల్పించి తప్పుకొన్నట్లయినది. సన్నివేశ మెంత సహజముగా చెలువందినది! ఎక్కడి కక్కడే చక్కని సమన్వయము! పాటి మట్టిలో పుట్టిన పూలచెట్టువలె తియ్యని వాసనలను చిందించుట లేదా! పద్మావతి యోగ్యురాలు - కులరూప శీలములలో వాసవదత్తకు సరితూగునది. అయిననూ ఉదయనునకు - ఆవేదనమే. వాసవ దత్త హృదయము నాక్రమించినది. మఱపునకు రాదు. తెఱపిగా ఉండనీదు.

''లావాణకే హుతవహేన హృతాంగయష్టిం,
తాం పద్మినీం హిమహతామివ చింతయామి.''

లావాణకాగ్నిదాహంలో - దగ్ధమైనది. మంచు జడితో కల తరిగిన సరోజంలా ఆమెను తలపోస్తున్నాడు ఉదయనుడు. వాల్మీకులు కూడ ఇట్లే సీతను గుఱించి స్మరించిరి. ''హిమహతనలినీవ నష్టశోభా'' అన్నారు. ఆ ఊహల చాయలు అనంతకాలము అట్లే ఉండును.

ఉదయనునకు మెలకువ కలిగినచో, శోకసముద్రమునకు పోటు వచ్చినట్లే. కలగనినచో ఒకపాటున స్థిమితత్వము - ఆ కల - చెదరకుండ అట్లే నిలచినచో బాగుండెడిది. ఇటు కల-అటు మెలకువ-అంతలో స్మృతి - వింతయిన విస్మృతి. ఈ చెలువైన భావముల ఊగిసలాటలు - సంకల్ప వికల్పములు - ఒక పర్వము అనుకూలముగను - మఱొక పర్వము ప్రతికూలముగను. ఒకటి లోగొనునది-మరొకటి వెలికి చేర్చునది-కల్లోలిత మధురభావ మహాసముద్రమై - మనస్తత్వ మును బహుధా విశ్లేషించుచున్నది!

భాసుని స్వప్నము ఎంత తీయగా నున్నది! ఇదియే నాటకమునకు చెలువమును చేకూర్చినది.

ఉదయనుని మనస్సు వికావికలైనది. అందిన దందకున్నది. అందని దానికై ఆరాటము! మఱొక చాయకు మనస్సును మరల్చవలయును.

ఇంతలో మహారాజు, దర్శకుని కబురు. "రుమణ్వంతుడు బలములతో సర్వసిద్ధముగా నున్నాడు. చతురంగ బలమును మేమును సమాయత్తపరచితిమి. ఆరుణి నిర్మూలనమునకై సిద్ధము కావలయు''నని. ఉదయనునకు ఉత్తేజము కలిగినది. శోకము చాయల కొదిగి, వీరమునకు చోటిచ్చినది. అలవోకగా ఆరుణిని జయించి - పోయిన రాజ్యమును కైవసము చేసికొన్నాడు. పద్మావతి వచ్చినవేళ బాగున్నది. భర్త సార్వభౌముడయ్యాడు.

అయిన నేమి? ఉదయనునకు సుఖము లేదు. రాజభవనములో తిరుగుచు వేగుచున్నాడు. ఇంతలో మహాసేనుడు అంపించెనని కాంచుకీయుడు వసుంధర-ద్వారదేశమునకు వచ్చిరి. ప్రతీహారి విజయ వారిని వారించినది. అది ప్రభువును చూచుటకు సమయము కాదని; ఏలయని వారడిగిరి. "ప్రాసాదములో ఉండగా ప్రభువునకు సన్నని నాదము వినబడినది. ఘోషవతి శ్రుతులు తలంపునకు తగిలినవి. దూతను విచారించి రమ్మని అంపెను. "నర్మదాతీరములో దర్భ పొదలలో మా కిది దొరికినది. ప్రభువులకు ప్రియమైనచో ఈ వీణను కొని పొండు'' అని వారు ఘోషవతి నిచ్చిరి. దానిని ఉదయనుడు తొడపై చేర్చెను. బాష్పలులిత నేత్రములతో సమ్మోహితుడై "ఘోషవతీ, ఎన్నాళ్ళకు అగుపడితివే! వాసవదత్త కానరాదే! ఆమె ఉత్సంగంలో, స్తనసన్నిధిలో హాయిగా శయనించితివే! లలితాంగులీ వాదనసాంగత్య మనుభవించితివే! ఆ అదృష్టమును కోలుపోయి-ధూళితో-పులుగుల మాలిన్యములతో-చెడిన దండముతో ఘోషవతీ ఎట్లుంటివమ్మా, అడవులలో! వాసవదత్త ఒడిలో కల్గిన ఒత్తిడులు మర్చితివా! స్తనాంతర సుఖములు-ఆలింగనములు - నన్ను గుఱించిన విరహ విలాపములు-వాద్యాంతర ప్రశంసా వాక్యములు-అన్నియును మఱచితివే! వాసవదత్తకు ఎంత వలపైనదానివే! ప్రోడయిన కోరికను చిగిరించితివే! ప్రియురాలు మాత్రము కానరాదే!'' అని ప్రభువులు విలవిలలాడుచున్నట్లు విజయ చెప్పినది. "మేమును వాసవదత్తను గుఱించియే వచ్చితిమి. ప్రభువునకు మా రాక ఎఱింగించుటలో ప్రమాదము లేదు'' అని వారు అనిరి. సరే అని ప్రతీహారి ప్రభువులతో చెప్పి, వారిని ప్రవేశపెట్టినది.

ఈ సన్నివేశముతో కథ యద్భుతమగు మలుపు అందుకొన్నది.

"కన్నవారికి తెలియకుండ వాసవదత్తను కొనివచ్చితినే! కడంట కాపాడలేకపోతినే- ఇటువంటి స్థితిలో నన్ను చూచి అత్తమామలు ఏమనుకొందురో''అని

వత్సరాజు ఆందోళనము. నూత్నదార పద్మావతికి బెరుకుతనము. తమ సొత్తు చోటులో మఱొకామెను చూచి వారేమనుకొందురో అని- ఇట్లుండగా మహాసేనుని కబురు అందరిని విస్మయములో ముంచినది. "ఉదయనా! మీ పెండ్లి మేము జరిపించలేకపోతిమి. మీ చిత్రములను వ్రాయించి, పెండ్లి సంబరము జరుపు కొంటిమి. విరహముతో వాసవదత్తకోసము వేగుచున్నావు కనుక- ఇది చూచి యైన తేరుకొందువని-మీ చిత్రమును అంపుతున్నాము. ఎన్నాళ్ళు గతించినదానికై శోకము, మహారాజ, శ్రీమంతుడవుకమ్ము'' అని చెప్పి ఆ చిత్రమును అందించిరి. అందులో ఉన్న వాసవదత్త ఇక్కడి ఆవంతిక- ముమ్మూర్తులా ఒక్కరే! యౌగంధరాయణుడు వచ్చి- ఈ చిక్కు విడదీసి- వాసవదత్తను నిరూపించి- వత్సరాజునకు అప్పగించును. పుట్టింటివారును వాసవదత్త జీవించి యున్నందులకు సంబరపడిరి. ఇట్లు ఉదయన కథా విశేషము ఉజ్జ్వలముగా ముగిసినది.

ఈ చిత్రపట సన్నివేశమును ఎంత అందముగా తీర్చినాడు! ప్రతిజ్ఞా యౌగంధరాయణమునకు పూరకముగా స్వప్నవాసవదత్తము సాగినట్లుండును. దివ్యవాణి చిందించిన తియ్యని చిరునవ్వు స్వప్న వాసవదత్తము. ఆ మృదుహాస తరంగములో ఎన్ని భావముల తళుకులు ఒదిగి ఉన్నవో! ఏ రసరమ్య ప్రణయ తత్త్వములు విశదీకరింపబడినవో!

భాసుని సరస్వతి ఇట్లుండునని చెప్పుట సాధ్యమా! భాసుని సృష్టి- ఒక మహా సముద్రము- మథించిన కొలది మహా రత్నములు- చింతామణులు- కుప్పలు తెప్పలై దర్శనమిచ్చును. లోతులకు పోలేనివారు లోకాద్భుతమైన ఆ సౌందర్యమునకు అబ్బురపడి తటస్థులై తలలు పంకింతురు.

*"జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః"*

# మృచ్ఛకటికము

**డా॥ పుల్లెల శ్రీరామచంద్రుడు**

లక్షణ గ్రంథాలలో పది రూపకాలూ పద్దెనిమిది ఉప రూపకాలూ చెప్పబడి ఉన్నాయి. నాటకము, ప్రకరణము, భాణము, ప్రహసనము, డిమము, వ్యాయోగము, సమవాకారము, వీథి, అంకము, ఈహామృగము అనేవి రూపక భేదాలు. నాటిక, త్రోటకము, గోష్ఠి, సట్టకము, నాట్యరాసకము, ప్రస్థానము, ఉల్లాప్యము, కావ్యము, ప్రేంఖణము, రాసకము, సంలాపకము, శ్రీగదితము, శిల్పకము, విలాసిక, దుర్మల్లిక, ప్రకరణి, హల్లీశము, భాణిక అనేవి ఉపరూపకాలు. కథా వస్తువు, రసము, పరిమాణము వీటినిబట్టి ఈ విభాగం చేయబడినది.

మృచ్ఛకటికం ప్రకరణమనే భేదానికి చెందినది. ప్రకరణానికి ఈక్రింది లక్షణాలు చెప్పబడి ఉన్నాయి:

(i) ప్రకరణంలోని ఇతివృత్తం పురాణేతిహాసాది ప్రసిద్ధమైనది కాక కవి కల్పితమై, లౌకికజనజీవన సంబంధమై ఉండాలి.

(ii) నాయకుడు లౌకిక జీవనంతో సంబంధంగల బ్రాహ్మణుడు కాని, మంత్రి కాని, వర్తకుడు కాని అయి ఉండాలి, ఉదాత్త చరితుడై ఉండాలి.

(iii) ఉత్తమ వంశానికి చెందిన వనిత కాని, వారవనిత కాని నాయికగా ఉండవచ్చును. కొన్నింటిలో ఇద్దరూ ఉండవచ్చును. నాయిక కులవధువు అయిన పక్షాన ఆ ప్రకరణం శుద్ధ ప్రకరణము, వేశ్య అయినచో మిశ్ర ప్రకరణము.

(iv) శృంగార రసం ప్రధానంగా ఉండి ఇతర రసాలన్నీ దానికి అంగాలుగా ఉండాలి.

(v) అంకాల సంఖ్య ఐదుకి తగ్గకుండాను, పదికి మించకుండాను ఉండాలి.

ప్రకరణానికి ఉండవలసిన ఈ ప్రధాన లక్షణాలన్నీ మృచ్ఛకటికానికి చక్కగా సరిపోతాయి. కథ కల్పితమైనది. వణిగ్వృత్తిని చేపట్టిన బ్రాహ్మణుడు నాయకుడు. ధీరప్రశాంతుడు. నాయిక వేశ్య. దీనిలో పది అంకాలు ఉన్నాయి. ప్రధాన రసం శృంగారం. ఇతర రసాలు ఉన్నా అవన్నీ శృంగారానికి అంగ

ములు. ఈ విధంగా మృచ్ఛకటికం ప్రధానమైన శాస్త్రీయ నియమాలకి కట్టుబడి ఉన్న ప్రకరణమే అయినా శాస్త్ర నియమాలను ఉల్లంఘించిన స్థలాలు కూడా చాలా ఉన్నాయి. వాటిని తరవాత పరిశీలించెదము.

**కవి-కాలము :-** మృచ్ఛకటికం రచించిన కవి శూద్రకుడు. ఇతడు మహారాజు. శూద్రకునిగూర్చి ప్రస్తావనలోనే విస్తృతంగా చెప్పబడి ఉన్నది.

''శూద్రక మహారాజు సుందరాకారుడు. గజగమనుడు. చకోరనేత్రుడు. చంద్రుని వంటి ముఖము కలవాడు. ద్విజ శ్రేష్ఠులలోను, కవులలోను అగ్రగణ్యుడు. ఋగ్వేదము, సామవేదము, గణితము, (వేశ్యలకు సంబంధించిన) లలిత కళలు, గజశాస్త్రము-వీటిలో నిష్ణాతుడు. ఏనుగులతో డీకొని యుద్ధము చేయగలిగిన మహా వీరుడు. ఈతడు శివుని ఆరాధించి నేత్ర రోగమును పోగొట్టుకొనెను. కుమారుని రాజ్యమునందు పట్టాభిషిక్తుని చేసి, అశ్వమేధయాగము కూడా పూర్తిచేసికొని, నూరు సంవత్సరాల పది రోజుల దీర్ఘాయుర్దాయము ననుభవించి అగ్నిప్రవేశము చేసి తనువును చాలించెను.''

''ద్విరదేన్ద్రగతిః చకోరనేత్రః పరిపూర్ణేన్దుముఖః సువిగ్రహశ్చ
ద్విజముఖ్యతమః కవి ర్బభూవ ప్రథితః శూద్రక ఇత్యగాధ సత్త్వః,
ఋగ్వేదం సామవేదం గణిత మథ కలాం వైశికీం హస్తిశిక్షాం
జ్ఞాత్వాశర్వ ప్రసాదా ద్వ్యపగతతిమిరే చక్షుషీ చోపలభ్య.
రాజానం వీక్ష్యపుత్రం పరమ సముదయేనాశ్వమేధేన చేష్ట్వా
లబ్ధ్వాచాయుః శతాబ్దం దశదిన సహితం శూద్రకోఽగ్నిం ప్రవిష్టః
సమరవ్యసనీ ప్రమాదశూన్యః
కకుదం వేదవిదాం తపోధన శ్చ,
పరవారణ బాహుయుద్ధలుబ్ధః
క్షితిపాలః కిల శూద్రకో బభూవ. (మృ. I. 3-5)

పై విషయాలన్నీ ప్రథమ పురుషలో చెప్పబడి ఉన్నాయి. శూద్రకుడు అగ్ని ప్రవేశం చేసినట్లు కూడా చెప్పబడింది. దీనిని బట్టి ఈ మూడు శ్లోకాలూ శూద్రకునివి కావని స్పష్టం అవుతున్నది.

ఈ శూద్రక మహాకవి చారిత్రకవ్యక్తియా లేక ఇది ఒక కల్పిత నామ ధేయమా అని పండితులలో అభిప్రాయ భేదాలు ఉన్నాయి. ఇది కల్పిత నామ ధేయమే అని కీథ్ పండితుని అభిప్రాయం. పిషేల్ మొదలైన కొందరు పండితులు ఈ మృచ్ఛకటికం భాసరచితమని అభిప్రాయ పడ్డారు. ఇపు డుపలభ్యమాన

మైన భాస నాటకాలలో **చారుదత్తము** లేదా **దరిద్రచారుదత్తము** అనే నాలు గంకాల రూపకం ఒకటి ఉన్నది. దీనిలోని కథ, శ్లోకాలు, కొన్ని వాక్యాలు ఇవన్నీ కూడా మృచ్ఛకటికంలో ఉన్నవే. ఐతే మృచ్ఛకటికంలో వసన్తసేనా చారుదత్తుల ప్రణయగాథతోపాటు ఒక రాజును సింహాసన భ్రష్టుణ్ణి చేసి మరి యొకడు రాజ్యం ఆక్రమించడం అనే రెండవ కథ కూడా ముడివడి ఉన్నది. చారుదత్తంలో ఈ రెండవ కథ లేదు. అందుచేత మొదటిది ఈ పది అంకాల ప్రకరణమనీ, దీనిని రంగోపయుక్తంగా కుదించి **చారుదత్తం** వ్రాయబడినదనీ ఈ పండితుల ఊహ.

కొంతకాలం తరువాత పిషేలీ పండితుడు తన పై అభిప్రాయాన్ని మార్చుకొని మృచ్ఛకటికం రచించినవాడు దండి అనే ఒక వాదాన్ని లేవదీసి నాడు. దీనికి ప్రధానంగా రెండు కారణాలు ఉన్నాయి. (1) రాజశేఖరుడు చెప్పి నట్లుగా ఒక శ్లోకం ప్రసిద్ధిలో ఉన్నది :

"త్రయోఽగ్నయ స్త్రయో వేదా స్త్రయో దేవా స్త్రయో గుణాః
త్రయోదండి ప్రబంధాశ్చ త్రిషు లోకేషు విశ్రుతాః ॥"

''మూడు అగ్నులు, మూడు వేదాలు, ముగ్గురు దేవతలు, మూడు గుణాలు, దండి రచించిన మూడుగ్రంథాలు- ఇవి మూడు లోకాలలోను ప్రసిద్ధ మైనవి" అని దీని అర్థం. దండిరచనలుగా ప్రసిద్ధమైన ''దశకుమార చరితము'' ''కావ్యాదర్శము'' అనే గ్రంథాలు ప్రసిద్ధంగా లోకంలో కనబడుతున్నాయి. ఇంక మూడవ గ్రంథం ఏదో తెలుసుకోవలసి ఉన్నది. (2) దండి కావ్యాదర్శంలో

''లింపతీవతమోఽగాని వర్షతీవాఞ్జనం నభః ।
అసత్పురుష సేవేవ దృష్టి ర్విఫలతాం గతా''

(చీకటి శరీరాలకి పూయుచున్నట్లుగాను, ఆకాశం కాటుకను వర్షిస్తున్నట్లుగాను ఉన్నది. చెడ్డవానికి చేసిన సేవ వలె చూపు విఫలమైనది.)

ఇదే శ్లోకం మృచ్ఛకటికంలోనూ, చారుదత్తంలోనూ కూడా ఉన్నది. అందుచేత దీనిని రచించినవాడు దండియే అని వీరి అభిప్రాయం.

అయితే ఈ వాదాన్ని ఇప్పుడు ఎవ్వరూ అంగీకరించడం లేదు. చాలా మంది విమర్శకుల అభిప్రాయం ప్రకారం – భాసరచితమైన చారుదత్తం అనే రూపకాన్ని ఆధారంగా చేసుకొని కాలాంతరంలో మృచ్ఛకటికం రచింపబడినది కాని చారుదత్తం మృచ్ఛకటికానికి సంక్షిప్తరూపం కాదు. దండి కావ్యాదర్శంలో "లింపతీవ'' అనే ప్రాచీనశ్లోకాన్ని తీసుకొని దానిలో ఉన్న అలంకారాలను

గూర్చి విమర్శించినాడు కాని అది ఆతని శ్లోకం కాదనే విషయం ఆ ఘట్టాన్ని పరిశీలిస్తే స్పష్టం అవుతుంది. అందుచేత ఈ శ్లోకాన్ని పట్టి ఈ రూపకాన్ని దండికి ముడిపెట్టడం గాని, చారుదత్తం మృచ్ఛకటిక సంక్షిప్తరూపం అని చెప్పడం యుక్తం కాదు.

శూద్రక రాజకవి అనే నామధేయం కేవలం కాల్పనికం కాదనీ, ఇతడు చారిత్రక వ్యక్తియే అనీ చెప్పడానికి అనేకమైన ఆధారాలు కనబడుతున్నాయి. స్కందపురాణము, కథాసరిత్సాగరము, వేతాల పంచవింశతి, కాదంబరి, దశ కుమారచరిత్ర, కావ్యమీమాంస, వామనుని కావ్యాలంకార సూత్రవృత్తి, కల్హణుని రాజతరంగిణి మొదలైన ప్రాచీనగ్రంథాలలో శూద్రకుని నామధేయం పేర్కొన బడింది. శూద్రకుని కథను వస్తువుగా గ్రహించి రచించిన 'శూద్రకవధ' అనే కథ "విక్రాంత శూద్రకం" అనే రూపకమూ ఉన్నాయి. 'వీరచరితం' అనే గ్రంథంలో శూద్రకుడు శాలివాహనుని మంత్రి అనీ, అతనినుండి అర్ధరాజ్యం పొందినాడనీ చెప్పబడింది. ఈ కథలలో ఏవి ఎంతవరకు సత్యములో చెప్ప డానికి వీలులేకపోయినా శూద్రకుడు ఒక చారిత్రకవ్యక్తి అని చెప్పడానికి ఇవి ఉపకరిస్తాయి. పైన ఉదాహరించిన ప్రస్తావనలోని మూడుశ్లోకాలూ శూద్రకుని గూర్చి ప్రథమపురుషలోనే చెప్పుచున్నా ఆ విషయాల సత్యత్వాన్ని శంకించ వలసిన పని లేదు. మృచ్ఛకటికాన్ని జాగర్తగా పఠించినవారికి తద్రచయితలో ఉన్నట్లుగా వర్ణించిన ఈ గుణాలు సత్యదూరాలు కావని స్పష్టం అవుతుంది.

శూద్రక నామధేయం కాల్పనికం కాదని చెప్పడానికి శాసనాది ప్రమా ణాలు కూడా ఉన్నాయి. క్రీ.శ. 968 ప్రాంతంలో రాష్ట్రకూట చక్రవర్తియైన అకాలవర్షుని సామంతరాజు అయిన శూద్రకయ్య అనునతడు కదంబలిగె ప్రాంతాన్ని పరిపాలించినట్లు శాసనాలు చెపుతున్నాయి. ఇతనికి "ఉజ్జయినీ భుజంగ" అనే బిరుదు ఉండేది. అట్లే శూద్రకుడనే మరొకరాజు క్రీ.శ. 1000 ప్రాంతంలో గయలో ఒక రాజవంశాన్ని నెలకొల్పినాడు. ఈ విధంగా శూద్రక నామధేయం గల రాజులు దక్షిణదేశంలోనూ, ఉత్తరదేశంలోనూ కూడా ఉండే వారు. ఐతే ఈ శూద్రకుడనే పేరు అసలుపేరు కాకుండా పెట్టుకున్న రెండవ పేరుగా కనబడుతుంది.

మృచ్ఛకటికం రచించిన శూద్రకుడు ఎవరై ఉండాలి అనేది ప్రశ్న. శూద్రకుని పలువురు పలువిధాలుగా గుర్తించినారు. స్కందపురాణంలోని విషయాన్ని అంగీకరించి విల్సన్ పండితుడు మొదటి ఆంధ్రభృత్యరాజైన

సిముకుడే శూద్రకుడని అభిప్రాయపడినాడు. ఈ అభిప్రాయాన్ని అంగీకరించిన పక్షంలో శూద్రకుణ్ణి క్రీ. పూ. 200 ప్రాంతంవాడుగా చెప్పవలసి వస్తుంది. క్రీ.శ. 190 ప్రాంతంలో శూద్రకుడనే రాజు ఉన్నట్లుగా కూడా స్కంద పురాణం వల్ల తెలుస్తూన్నది. అందుచేత సిముకునికి కూడా శూద్రకుడనే పేరు ఉన్నదా, లేదా ఈ శూద్రకుడు వేరా అనే విషయంలో సందేహం కలుగుతుంది. ఏమైనా ఆంతరంగిక ప్రమాణాలు, భాష మొదలైనవాటిని పట్టి మచ్ఛకటికానికి ఇంత ప్రాచీనత్వం అంగీకరించడానికి వీలు లేదని చాలామంది పండితుల అభిప్రాయము.

స్టెన్ కోనో అనే విమర్శకుని అభిప్రాయం ప్రకారం ఆభీరవంశీయులైన శివదత్తుడే శూద్రకుడు. ఈతడో లేదా ఇతని కుమారుడైన ఈశ్వరసేనుడో ఆంధ్రవంశీయుడైన చివరి రాజును పదభ్రష్టుని చేసి క్రీ. 248-9 సంవత్సరంలో చేదిశకం స్థాపించి ఉన్నాడనీ, మృచ్ఛకటికంలో ఉన్న పాలక రాజ్యభ్రంశనం దీనినే సూచిస్తూన్నదనీ వీరి అభిప్రాయం.

మృచ్ఛకటికంలో రాజ్యభ్రష్టుడు చేయబడిన పాలకుడుగాని, రాజ్యం ఆక్రమించిన ఆర్యకుడు కాని చారిత్రక వ్యక్తులు కారనీ, ఇదంతా కాల్పనిక కథయే అనీ కీథ్ అభిప్రాయపడి ఉన్నాడు. ఇది అంత సమంజసం కాదు. ఉజ్జయినీ చక్రవర్తియైన మహాసేనునికి గోపాలుడు, పాలకుడు అనే ఇద్దరు కుమారులున్నట్లుగా భాసుడు చెప్పి ఉన్నాడు. పెద్దవాడైన గోపాలునికి రావలసిన రాజ్యాన్ని పాలకుడు ఆక్రమించగా గోపాలకుని కుమారుడైన ఆర్యకుడు సమయంకోసం వేచి ఉండి పాలకునినుంచి రాజ్యం లాగికొని ఉంటాడనీ, అందుచేత ఇది చరిత్రకు సంబంధించిన విషయమే అనీ చాలామంది పండితుల అభిప్రాయము.

మృచ్ఛకటికంలో మతము, సాంఘికాచార వ్యవహారాలు, నదీ పర్వతాదులు, వీటి నిర్దేశాలు అనేకం ఉన్నాయి. వీటిని పట్టి ఏతద్రచయితయైన శూద్రకుడు దాక్షిణాత్యుడై ఉంటాడనీ, క్రీ.శ. 670 నుండి 725 వరకూ రాజ్యం పాలించిన గాంగవంశీయుడైన భూవిక్రముని తమ్ముడైన మొదటి శివమారుడే శూద్రకుడనీ కొందరు పండితులు సప్రమాణంగా నిరూపించియున్నారు. క్రీ.శ. 700 ప్రాంతం నాటి హెబ్బూరు తామ్రశాసనంలో శివమారుణ్ణి గూర్చిన కొన్ని విశేషాలు వర్ణింపబడి ఉన్నాయి. అవి మృచ్ఛకటిక ప్రస్తావనలో ఉన్న శూద్రక

వర్ణనకు సరిగా సరిపోతున్నవి. ఈ విధంగా శూద్రకుని గూర్చి అనేక అభిప్రాయ భేదాలు ఉన్నాయి.

**కాలము :-** కవినిగూర్చి ఇన్ని అభిప్రాయభేదాలు ఉండడంచేత ఆతని కాలాన్ని పట్టి మృచ్ఛకటికం కాలాన్ని నిర్ణయించడం అనేది సాధ్యం కాని పని. ఇంక కొన్ని ఇతర ప్రమాణాలమీదనే ఆధారపడవలసి ఉన్నది. కొంతమంది ప్రాచీన రచయితల గ్రంథాలలో మృచ్ఛకటికాన్ని పేర్కొనడం, దీనిలోని శ్లోకాలను కొన్నింటిని ఉద్ధరించడం జరిగింది. దీనిని పట్టి ఈ రూపకం ఎనిమిదవ శతాబ్దానికి పూర్వం రచింపబడినట్లు చెప్పవచ్చును. ఇది బాహ్య ప్రమాణము. మనుస్మృతిలో చెప్పిన ఒకటి రెండు విషయాలు దానిలో ఉన్నాయి. మనుస్మృతి క్రీ.పూ. 200 క్రీ.శకం. 200 మధ్య ప్రాంతానికి చెందినదని పండితుల అభిప్రాయం. అందుచేత ఈ రూపకం క్రీ.శ. రెండవ శతాబ్దం తరవాతనే రచింపబడి ఉండాలి. ఇందులో గణికాకాముకులకు సకర్పూరమైన తాంబూలం ఇవ్వబడుతున్నట్లు వర్ణింపబడినది. తాంబూలం విదేశాలనుంచి భారతదేశంలోనికి గుప్తుల కాలంలో వచ్చినదని విమర్శకుల అభిప్రాయము. రామాయణ మహాభారతాలలో తాంబూలచర్చ లేకపోవడం గమనార్హము. దీనిని పట్టి ఈ రూపకం నాల్గవ శతాబ్దానికి పూర్వం రచించినది కాదని చెప్పవలసి ఉన్నది. ఈ బాహ్య ఆంతరంగిక ప్రమాణాలను పట్టి మృచ్ఛకటికం నాలుగు ఎనిమిది శతాద్దాల మధ్య రచింపబడి ఉండాలని విమర్శకుల ఊహ.

**సంక్షిప్తకథ :-** మృచ్ఛకటికం పది అంకాల బృహత్ప్రమాణం గల ప్రకరణము. ఇరవై ఎనమండుగురు పురుష పాత్రలు ఎనమండుగురు స్త్రీ పాత్రలు ఉన్నారు. రెండు ప్రణయ గాథలు, ఒక రాజ్యోపప్లవ వృత్తాంతము వీటిని మూడింటిని మేళవించి కథావస్తువు చక్కగా కూర్చబడినది.

**ప్రథమాంకము:-** చారుదత్తుడనే ఒక బ్రాహ్మణుడు వాణిజ్యవృత్తిని అవలంబించి చాలా ధనం సంపాదించినా దానధర్మాదులలో ఆ ధనాన్నంతా వెచ్చించి దరిద్రుడవుతాడు. ఐనా ఉజ్జయినిలో ఉండే ప్రతి ఒక్కరూ కూడా ఆతని విషయంలో అపరిమితమైన ఆదరం కలిగి ఉంటారు. దారిద్ర్యంతో బాధపడుతూన్న ఆతని సద్గుణాలచేత ఆకర్షింపబడిన వసన్తసేన అనే అతి లోకసుందరియైన ఒక వేశ్య ఆతనిని కామిస్తుంది. ఆమె ఎంత సౌందర్యవతియో అంత ఐశ్వర్యవంతురాలు. ఆ రాజ్యానికి రాజైన పాలకుని బావమరదియైన

శకారుడనే దుష్టబుద్ధి ఆమెను కోరి ఆమెను లొంగదీసుకోవాలని ప్రయత్నిస్తూ ఉంటాడు. ఒకనాటి రాత్రి ఆమె రాజమార్గంలో సపరివారంగా వెడుతూండగా శకారుడూ, అతని మిత్రుడైన విటుడూ, చేటుడూ ఆమెను వెంబడిస్తారు. వాళ్ల నుండి తప్పించుకోవాలనే ప్రయత్నంలో వసంతసేన తన అనుచరుల నుంచి దూరం అవుతుంది. దైవవశంచేత చారుదత్తుని ఇంటిపక్క వాకిలి అప్పుడే తెరుస్తారు. ఆమె ఆత్మరక్షణం కోసం ఆ ఇంటిలో ప్రవేశిస్తుంది. ఒకనాడు ఐశ్వర్యంతో కళకళలాడుతూ ఉండి ఈనాడు పాడుపడిపోయినట్లుగా ఉన్న చారుదత్తుని విశాల భవనంలో చారుదత్తుడూ, సర్వకాలాలలోనూ అతని విడవకుండా ఉన్న విదూషకుడూ (పేరు మైత్రేయుడు), రదనిక అనే పరిచారికా, నాలుగైదు సంవత్సరాల వయస్సు గల రోహసేనుడనే చారుదత్తుని కుమారుడు, ధూత అనే పేరుగల చారుదత్తుని భార్య - వీరు మాత్రమే ఉన్నారు. అంతకు పూర్వమే కామదేవాయతనోద్యానంలో జరిగిన ఒక ఉత్సవంలో వసంతసేనా చారుదత్తులు ఒకరినొకరు చూచుకోవడము జరిగింది. పరస్పరానురాగం కూడా కలిగింది. ఆర్థికంగా తనకూ ఆమెకూ ఉన్న అంతరాన్ని ఎరుగున్న వాడవడం చేత చారుదత్తుడు ఆ అనురాగాన్ని మనస్సులోనే దాచుకున్నాడు. ఇపుడు దైవవశంచేత కలిగిన ఈ సమావేశంచేత ఆ ప్రణయబీజాలు అంకురించినాయి. రాత్రివేళ అన్ని అమూల్యాలంకారాలతో బయటకు వెళ్లడం మంచిది కాదనే అభిప్రాయంతో వసన్తసేన తన అలంకారాలన్నీ తీసి దాచవలసిందిగా చారుదత్తునికి ఇచ్చింది. చారుదత్తుడు కూడా వెళ్లి ఆమెను ఇల్లు చేరుస్తాడు. ఆనాటి నుంచీ శకారుడు చారుదత్తుని మీద పగపట్టి ఉంటాడు.

**ద్వితీయాంకము :-** చారుదత్తుడు ఐశ్వర్యాన్ని కోల్పోవడంతో ఆతనిని ఆశ్రయించుకొని ఉన్నవాళ్లందరూ చెట్టుకొకరూ పుట్టకొకరూగా అయిపోతారు. అలాంటి వాళ్లలో సంవాహకుడు (ఒళ్లు పట్టేవాడు) ఒకడు. అతడు జూదం ఆడడం మరిగి పది సువర్ణాలు ఓడిపోయి ద్యూతగృహంలోనుంచి పారిపోతూంటే సభికుడూ (ద్యూత గృహాధికారి), ద్యూతకారుడూ వెంబడిస్తారు. పాడుపడిపోయిన దేవాలయంలో దాక్కొని మూర్తిలాగ స్థిరంగా కూర్చుంటాడు. వాళ్లు అక్కడికి కూడా వచ్చి కొడుతూంటే పారిపోయి వసంతసేన ఇంట్లో ప్రవేశించి ఆమెను శరణు వేడుతాడు. ఆతడికీ చారుదత్తుడికీ ఉన్న పూర్వ సంబంధం తెలియగానే ఆమె అతనికి చాలా మర్యాదచేసి సభికునికి ఆత డివ్వవలసిన పదిసువర్ణాలు

ఇచ్చి పంపివేస్తుంది. చివరికి ఈ సంవాహకుడు వైరాగ్యం చెంది బౌద్ధ భిక్షువు అయిపోతాడు.

**తృతీయాంకము :-** వసంతసేన పరిచారిక మదనిక, ఆమె క్రీతదాసి. శర్విలకుడనే బ్రాహ్మణయువకుడు ఆమెను ప్రేమిస్తాడు. ఐతే వసంతసేనకు కొంతధనం ఇస్తేనేకాని ఆమెకు విడుదల లభించదు. అందుచేత ఆతడు చారుదత్తుని ఇంటికి కన్నంవేసి వసంతసేన న్యాసంగా ఉంచిన అలంకారాలన్నీ అపహరిస్తాడు. అలంకారాలు దొంగలు అపహరించారని చెప్పినట్లయితే ఎవ్వరూ నమ్మరు; ఏమిచేయవలెనా అని చారుదత్తుడు విచారిస్తూండగా ఈ విషయం ఆతని భార్యకు తెలిసి స్త్రీ ధనాన్ని చారుదత్తుడు తీసుకోవడానికి నిరాకరిస్తాడనే ఉద్దేశంతో ఆమె తనవద్ద మిగిలిన అమూల్యమైన రత్నహారాన్ని మైత్రేయుడికి దానం చేస్తుంది. మైత్రేయుడు ఆ విషయం చారుదత్తునికి చెపుతాడు. "నీ అలంకారాలన్నింటినీ జూదంలో ఓడి చారుదత్తుడు ఓడిపోయినాడు; వాటికి బదులుగా ఈ రత్నహారం పంపుతున్నాడు"అని చెప్పి ఆహారం వసంతసేనకు ఇవ్వవలసిందిగా మైత్రేయుణ్ణి ఆదేశిస్తాడు. అంత తక్కువ విలువగల అలంకారాలకోసం ఇంత విలువగల హారాన్ని ఇవ్వడమా అని విదూషకుడు మొదట అంగీకరించకపోయినా చివరకు ఒప్పుకొంటాడు.

**చతుర్థాంకము :-** తాను చారుదత్తుని ఇంటినుంచి అపహరించిన అలంకారాలను వసంతసేనకు ఇచ్చి మదనికను విడిపించుకోవాలనే అభిప్రాయంతో శర్విలకుడు వసంతసేన ఇంటికి వెడతాడు. ఆ అలంకారాలను మదనిక గుర్తుపట్టుతుంది. ఈ విషయం తెలియగానే ఏమి చేయాలో తెలియక శర్విలకుడు చారుదత్తుడే పంపినాడని చెప్పి వాటిని వసంతసేనకు ఇస్తాడు. మదనికా శర్విలకుల మధ్య జరిగిన సంభాషణను పట్టి అసలు విషయం తెలిసిన వసంతసేన ఆ అలంకారాలు తెచ్చి ఇచ్చినందుకు ప్రతిఫలంగా మదనికను దాసీత్వం నుంచి విముక్తురాలిని చేసి శర్విలకునికి భార్యగా చేసి పంపివేస్తుంది. శర్విలకుడు మదనికను తీసుకొని వెడుతూండగా "ఆర్యకుడనే గోపాలదారకుడు రాజు అవుతాడు అని ఒక సిద్ధుడు చెప్పడం చేత, ఆర్యకుణ్ణి బంధించి పాలక మహారాజు కారాగారంలో ఉంచినాడు" అని ఘోషణ వినబడింది. శర్విలకుని వంటి నవయువకులందరూ ఆ ఆర్యకుని మిత్రులు. తన మిత్రునికి కలిగిన ఆపదను గూర్చి వినగానే శర్విలకుడు భార్యను తన ఇంటికి పంపివేసి ఆర్యకుని విమోచనానికై మిత్రబలాన్నంతనీ సమీకరించడానికి వెళ్లిపోతాడు.

చారుదత్తుని ఆదేశం ప్రకారం మైత్రేయుడు వసంతసేనఇంటికి వెళ్లి ఆమెకు ఆ రత్నహారాన్ని ఇస్తాడు. వసంతసేన తనలో తాను నవ్వుకొని ఆ రాత్రికే చారుదత్తుని ఇంటికి వెళ్లాలని నిశ్చయించుకొంటుంది. ఆ విషయాన్ని మైత్రేయునిద్వారా చారుదత్తునికి కబురు పంపుతుంది.

**పంచమాంకము :-** వసంతసేనా చారుదత్తులు కలుసుకుంటారు.

**షష్ఠాంకము :-** వసంతసేన మేల్కొన్న తరవాత ఆమెను ప్రవహణం (పెట్టెబండి) మీద పుష్పకరండక జీర్ణోద్యానానికి తీసుకొని రావలసిందిగా వర్ధమానకుడనే సేవకుని ఆదేశించి చారుదత్తుడు ముందుగా అచటికి వెడతాడు. వసంతసేన ఉదయమే నిద్రనుంచి మేల్కొని ఆ రత్నహారాన్ని తీసుకోవలసినదిగా చేటిద్వారా చారుదత్తునిభార్యను ప్రార్థిస్తుంది. ఆమె నిరాకరిస్తుంది. ఇంతలో రోహసేనుణ్ణి ఒక చిన్న మట్టి బండిలో ఆడించడం కోసం ప్రయత్నిస్తూ రదనిక అచటికి వస్తుంది అంతక్రితం ఆ పిల్లవాడు ఇరుగు పొరుగు వారి పిల్లలతో వాళ్ల బంగారు బండితో ఆడుకొని ఉన్నాడు. తనకు ఆ బంగారు బండియే కావాలనీ, మట్టి బండి వద్దనీ ఆ పిల్లవాడు మారాం చేస్తూంటాడు. ఇదంతా చూస్తూన్న వసంతసేన కంట నీళ్లు పెట్టుకొని బంగారు బండి చేయించుకో నాయనా అని చెప్పి ఆ పిల్లవానిని బుజ్జగిస్తూ తన శరీరంమీద ఉన్న అలంకారాలన్నీ తీసి ఆ మట్టి బండిలో పెడుతుంది.

ఇంతలో వర్ధమానకుడు ప్రవహణం తీసుకొని వచ్చి ద్వారానికి ఎదురుగా నిలుపుతాడు. ''వసంతసేన అలంకరించుకుంటున్నది. కొంచెము సేపు ఆగు'' అని రదనిక చెపుతుంది. వర్ధమానకుడు ఈలోగా తాను మరచివచ్చిన బండిలోని పరుపులు తీసుకొని రావడానికై బండితో సహా వెనుకకు వెడతాడు. ఇంతలో శకారుని బండితోలే స్థావరకుడు ఆ పుష్పకరండ జీర్ణోద్యానంలోనే ఉన్న శకారుణ్ణి తీసుకొని రావడానికై ప్రవహణం తోలుకు వెడుతూఉంటాడు. సరిగా చారుదత్తుని ఇంటి దగ్గరికి వచ్చే సరికి ఎదర బండ్లు అడ్డం రావడంతో తన ప్రవహణాన్ని ఆ ద్వారం ముందు నిలిపి, ఎదుట ఉన్న బండి వానికి సహాయం చేయడం కోసం అటు వెడతాడు. ఇంతలో వసంతసేన వచ్చి ఆ బండిలో ఎక్కి కూర్చుంటుంది. స్థావరకుడు ఎదుట ఉన్న బండి తప్పించి, తన బండిని ఉద్యానానికి తోలుకొని పోతాడు. చారుదత్తుని చేటుడైన వర్ధమానకుడు మరచిపోయిన పరుపులు తీసుకొని మరల బండిని ద్వారంముందు నిలుపుతాడు. ఇంతలో

శర్విలకాది మిత్రుల సహాయంతో కారాగారంనుంచి తప్పించుకొని పారిపో తూన్న ఆర్యకుడు ఆ బండిలోనికి చూచి, ఎవరూ లేరని గ్రహించి దానిలో ఎక్కి కూర్చుంటాడు. అతని కాలిని ఇంకా ఒక సంకెల వ్రేలాడుతూ ఉంటుంది. ఆ చప్పుడు విని వసంత సేనయే బండి ఎక్కి ఉంటుందనే అభిప్రాయంతో వర్ధమానకుడు దానిని ఉద్యానానికి తోలుకొని పోతాడు. దారిలో జరిగిన కొన్ని సంఘటనలను పట్టి తానెక్కిన ప్రవహణం చారుదత్తుని దని ఆర్యకునికి తెలు స్తుంది.

**సప్తమాంకము :-** అక్కడ ఉద్యానవనంలో చారుదత్తుడూ విదూష కుడూ వసంతసేనకోసం ఎదురు చూస్తూ ఉంటారు. ఇంతలో ప్రవహణం వస్తుంది. ఆర్యకుడు చారుదత్తుని శరణు వేడుతాడు. చారుదత్తుడు ఆర్యకుని అభినందించి ప్రవహణం దిగకుండా దానిమీదనే వెళ్ళినట్లైతే రాజభటుల బారి నుండి తప్పించుకోవచ్చునని చెపుతూ ఆతనిని ఆ విధంగా పంపివేస్తాడు.

**అష్టమాంకము :-** తన ప్రవహణం ఎక్కి వచ్చిన వసంతసేనను చూడ గానే ఆమె పూర్వం తనను నిరాకరించినందుకు పశ్చాత్తాపపడి ఇపుడు స్వయం గానే వచ్చినదని భావించి శకారుడు చాలా సంతోషిస్తాడు. అక్కడికి చేరిన తర వాతనే వసంతసేన తాను చేసిన పొరపాటు తెలుసుకొంటుంది. శకారుణ్ణి నిరాక రించడంతో ఆత డామెను కంఠం నొక్కి వేస్తాడు. అలంకారాలకోసం చారుదత్తుడే ఈ పని చేసినాడని చెప్పి ఈ నేరాన్ని ఆతని మీద మోపవచ్చునని నిశ్చయించుకుంటాడు. ఐతే స్థావరకుడు ఈ రహస్యం ఎవరికీ చెప్పకుండా ఉండాలని ఆతనిని తన ఇంటి మేడమీద బంధిస్తాడు. ఐతే వసంతసేన స్పృహ తప్పి పడిపోయిందేకాని మరణించలేదు. కొంతసేపటికి ఆమెకు స్పృహ వస్తుంది. బౌద్ధభిక్షువైన సంవాహకుడు ఆ ప్రాంతానికి వచ్చి ఆమెను చూచి, చల్లటి నీళ్లు మొదలైన వాటితో సేద తీరుస్తాడు.

**నవమాంకము :-** అలంకారాల కోసం చారుదత్తుడు వసంతసేనను చంపి వేసినాడని శకారుడు న్యాయాలయంలో అభియోగం తీసుకొని వస్తాడు. న్యాయా ధికారులు వసంతసేన తల్లినీ, చారుదత్తునీ అధికరణానికి పిలిపిస్తారు. విచారణ జరుగుతూ ఉంటుంది. వసంత సేన రోహసేనుని మృచ్ఛకటికలో (మట్టిబండిలో) ఉంచి అతని కిచ్చిన అలంకారాలను తిరిగి ఆమె కిచ్చి వేయవలసిందిగా చారు దత్తుడు అంతకు ముందు చెప్పి ఉండడం చేత వాటితో వసంతసేన ఇంటికి వెడుతూన్న మైత్రేయునికి చారుదత్తుని మీద వచ్చిన ఈ అభియోగం విషయం

తెలిసి అతడు వసంతసేన ఇంటికి వెళ్ళకుండగా న్యాయాధికరణానికి వెడతాడు. శకారుడి మీద కలిగిన కోపం ఆపుకోలేక మైత్రేయుడు వానిని కొట్టడం కోసం చేసే సంభ్రమంలో ఆ అలంకారాల మూట ఆతని చంకలోనుంచి క్రింద పడుతుంది. అప్పుడు శకారుడు చేసిన అభియోగం నిర్ధారిత మవడంతో చారుదత్తునికి మరణదండన విధింపబడుతుంది.

**దశమాంకము :-** చారుదత్తుని వధ్యస్థానానికి తీసుకొని వెడతారు. ఈ విషయం తెలిసి బౌద్ధభిక్షుని వెంబడి వసంతసేన అక్కడికి చేరడంతో చారుదత్తునికి విమోచనం లభిస్తుంది. ఇంతలో పాలకుని సంహరించి ఆర్యకుడు రాజైనాడని చెపుతూ శర్విలకుడు చారుదత్తుణ్ణి విడిపించడానికై అచటికి వస్తాడు. చారుదత్తుని మాటమీద శకారుణ్ణి చంపకుండగా విడిచిపెడతాడు. ఈ విధంగా అంతా సుఖాంతం అవుతుంది.

**మృచ్ఛకటికంయొక్క వైశిష్ట్యము :-** కథా సంవిధానంలో కాని, విభిన్నపాత్ర చిత్రణంలో కాని, పాత్రోచిత భాషోపయోగంలో కాని, సామాజిక విషయవర్ణనంలో కాని, చివరకు పేరు ఎన్నుకోవడంలో గాని మృచ్ఛకటికానికి సాటియైన మరొక రూపకం సంస్కృతభాషలో లేదని చెప్పడంలో సందేహం లేదు. సంస్కృతభాషలోనే కాదు - ప్రపంచంలోని ఏ భాషలోనైనా ఇలాంటి రూపకాలు చాలా అరుదుగానే ఉంటాయి.

శూద్రకుడు కొంతవరకు శాస్త్ర నియమాలను అనుసరించినా చాలాచోట్ల వాటిని ఉల్లంఘించడం కూడా జరిగింది. దీనితో కథాసంవిధానంలో ఒక నూతనత్వం లభించినది. ఉదాహరణకి - ప్రతిఅంకంలోనూ నాయకుడు ఉండాలి. ఆ నియమాన్ని ఇతడు పాటించలేదు. రంగంమీద చూపరానివిగా నిషేధింపబడిన నాయికా నాయకులు ఆశ్లేషణాదికమూ, కొట్లాటలూ, నిద్రా, చోరాదుల రాత్రి విహారాలు, భయంకరమైన మారణదృశ్యమూ, నిరపరాధిని వ్యధస్థానానికి తీసుకొని వెళ్ళడమూ వంటి ఎన్నో విషయాలను రంగంమీద చూపించినాడు. సూత్రధారుడు సంస్కృతంలోనే మాటలాడాలి. వానిచేతకూడా ప్రాకృతంలో మాటలాడించినాడు. ప్రకరణాదులకు పెట్టిన పేరుకు నాయికా నాయకుల పేరుతో సంబంధం ఉండాలని నియమం. ఆ నియమాన్ని కూడా ఉల్లంఘించి ఎక్కడనో రూపక మధ్యంలో ఉన్న చిన్న సంఘటనను పట్టి రూపకానికి పేరు పెట్టినాడు. ఐతే ఈ చిన్న మట్టిబండీ, దానిమీద ఉంచిన ఆభరణాలూ ఎంత వ్యవహారం నడిపించినాయో మనకు తెలుసు. ఈ విధంగా తన రూపకానికి పేరు

ఎన్నుకోవడంలో కూడా స్వాతంత్ర్యాన్ని చూపించినాడు. ఇలా చాలా విషయాలలో స్వాతంత్ర్యం అవలంబించడం చేతనే శూద్రకుడు ఇంత ఉత్కృష్టమైన ప్రకరణం మనకు అందజేయ కలిగినాడేమో. ఐతే వెనుక చెప్పిన ఈ విషయాలు ప్రకరణమనే రూపకభేదంలో నిషేధింపబడినాయి కాని, భాణ-ప్రహసన-సమవాకారాది రూపకభేదాలలో వాటి ప్రయోగం శాస్త్ర సంమతమే. అనగా వీటిని ప్రకరణంలో ప్రయోగించినంతవరకే శూద్రకుడు చూపిన స్వాతంత్ర్యం.

**పాత్రోచిత భాషా ప్రయోగము :-** సంస్కృత రూపకాలలో ఉత్తమ పాత్రలు సంస్కృత భాషలోనూ, నీచపాత్రలు ప్రాకృత భాషలోనూ మాటలాడతారు. ఉత్తమ పాత్రలలో కూడా స్త్రీలు ప్రాకృతమే మాటలాడతారు. దీనికి కారణం అందరూ స్ంస్కృతభాష మాటలాడకూడదు అనే నిషేధం ఉండడమే అని కొందరు ఆధునికుల ఆక్షేపను. ఇది అజ్ఞాన విలసితము. భరతుడు నాట్యశాస్త్రంలో చెప్పినట్లుగా నాట్యంలో (రూపకాలలో) లోకచరిత్ర స్పష్టంగా ప్రతిఫలించాలి. అనగా రూపకాలు సమాజానికి దగ్గరగా ఉండాలి. పాణిని కాలంలో సర్వజన భాషగా ఉన్న సంస్కృతం మన కిపుడు లభించే రూపకాలు వచ్చే కాలానికి, భరతుని నాట్యశాస్త్ర కాలానికి, కేవలము విద్యావంతులభాషగా ఉండిపోయినది. జనసామాన్య భాషగా అనేక ప్రాకృత భాషలు వచ్చినది. ఈనాడు విద్యావంతుల భాషయైన ఆంగ్ల భాషలో నిరక్షరాస్యులు నిరర్గళంగా మాటలాడుతున్నట్లు చూపడం ఎంత అసహజమో జనసామాన్యులు సంస్కృతంలో మాటలాడుతున్నట్లు చూపడం కూడా అంత అసహజమే. అందుచేత విద్యావంతులు కారనుకొన్నవారిచేత ప్రాకృతం మాటలాడించడం రూపకాలలో సంప్రదాయమైనది.

శూద్రకుడు ఉపయోగించినన్ని ప్రాకృతభాషలు ఏ కవీ తన రూపకంలో ఉపయోగించలేదు. సూత్రధారుడు, నటి, రదనిక, మదనిక, వసంతసేన, ఆమె తల్లి, ఆమె చేటి, కర్ణపూరకుడు, చారుదత్తుని భార్య, శోధనకుడు, శ్రేష్ఠి, ఈ పదకొండుగురు పాత్రలు శౌరసేనీ ప్రాకృతంలో మాటలాడతారు. వీరక చంద్రకులనే రాజభటులు అవంతిభాషలోను, విదూషకుడు ప్రాచ్యభాషలోను, సంవాహకుడు, శకారవసంతసేనా చారుదత్తుల చేటులు (పరిచారకులు), భిక్షువూ, చారుదత్తుని కుమారుడు - ఈ ఆరుగురూ మాగధీ భాషలోనూ, శకారి అనే అపభ్రంశ భాషలోనూ, చండాలులు చాండాలీ భాషలోనూ, సభికద్యూతకరులు ఢక్క భాషలోనూ మాటలాడతారు. ఈ విధంగా ఏడు ప్రాకృత భాషలు

ప్రయోగింపబడినవి. ఒకవిధంగా చూస్తే దీనిని సంస్కృత రూపకం అనడం కంటె ప్రాకృత రూపకం అనడమే న్యాయం అనిపిస్తుంది.

**పాత్ర చిత్రణము :-** పాత్ర చిత్రణం విషయంలో శూద్రకునికి శూద్రకుడే సాటి, ఏ రెండు పాత్రలూ ఒక్క విధంగా ఉండరు. ఎవరి ప్రాతిస్వికత (individuality) వారిది. అత్యుత్తమ చరిత్ర గల చారుదత్తుడు, వేశ్య అయినా కులాంగనా జీవితాన్ని కోరే సుగుణవతి వసంతసేన, కష్టసమయాలలో కూడా మిత్రుని విడనాడని విదూషకుడు, అకారణ వైరదారుణుడు, ఎలాంటి పాపానికైనా వెనుదీయనివాడు అయిన శకారుడూ, జూదం ఆడి వీధిలో కొట్లాడుకునే జూదరులూ, చౌర్యవృత్తి అవలంబించిన బ్రాహ్మణుడు శర్విలకుడూ, రాజ్యోపప్లవాన్ని తీసుకురాగలిగిన శర్విలకారులూ- ఒకరేమిటి అనేక విధాలైన పాత్రలు సజీవంగా మనకు ప్రత్యక్షం అవుతారు.

**చారుదత్తుడు :-** ఇతడు మహా ధైర్యశాలి. తనకున్న అనంతైశ్వర్యాన్ని దానధర్మాలకై వ్యయించిన త్యాగమూర్తి. సద్గుణ సంపన్నుడు. అందుచేతనే ఉజ్జయినిలో ఉన్న ప్రతి వ్యక్తినుండీ, చివరికి శకారుని దగ్గరి అనుచరులనుండి కూడా మన్ననలను పొందినవాడు. తనకు కలిగిన ఈ దరిద్రావస్థను గూర్చి ఆతడు అనేక విధాల వాపోతూ ఉంటాడు.

> ''సత్యం న మే విభవనాశకృతాస్తి చిన్తా
> భాగ్యక్రమేణ హి ధనాని భవన్తి యాన్తి
> ఏతత్తు మాం దహతి నష్టధనాశ్రయస్య
> యత్సౌహృదా దపి జనాః శిథిలీభవన్తి.'' (I-13)

''ఐశ్వర్యం పోయినందుకు నాకు విచారం లేదు. అది వస్తూ ఉంటుంది, పోతూ ఉంటుంది. ఐతే ఐశ్వర్యం పోవడంతోటే నా మిత్రులు కూడా నాకు దూరం అవుతున్నారు; ఇది దుర్భరంగా ఉన్నది.''

> ''దారిద్ర్యా త్పురుషస్య బాంధవజనో వాక్యే న సంతిష్ఠతే
> సుస్నిగ్ధా విముఖీభవన్తి సుహృదః స్ఫారీభవన్త్యాపదః
> సత్త్వం హ్రాసముపైతి శీలశశినః కాన్తిః పరిమ్లాయతే
> పాపం కర్మ చ యత్పరైరపి కృతం తత్తస్య సంభావ్యతే.''

"దారిద్ర్యం రావడంతోటే బంధువులెవరూ చెప్పినమాట వినరు. స్నేహితులు వైముఖ్యం వహిస్తారు. ఆపదలు ఎక్కువ అవుతాయి. బలం క్షీణిస్తుంది. శీలమనే చంద్రుని కాంతి వాడిపోతుంది. ఇతరులు చేసిన పాపకార్యాన్ని ఇతని మీద ఆరోపిస్తారు."

ఇంత మనస్తాపంతో బాధపడుతున్నా తనను చూచి తానే నవ్వుకునే శక్తికూడా ఇతనిలో ఉన్నది. దారిద్ర్యాన్ని సంబోధిస్తూ- "ఓ దరిద్రమా! ఇంత కాలంనుంచి నన్ను మిత్రుడిలా ఆశ్రయించుకొని ఉన్నావు. నేను మరణిస్తే నీవు నిరాశ్రయవు అయిపోతావే అని నాకు చాలా విచారంగా ఉన్నది" అని అంటాడు.

"దారిద్ర్య శోచామి భవన్తమేవ మస్మచ్ఛరీరే సుహృదిత్యుషిత్వా
విపన్నదేహే మయి మన్దభాగ్యే మమేతి చిన్తా క్వ గమిష్యసి త్వమ్."
(I-38)

తన ఇంటికి ఎవరో దొంగ కన్నం వేసినాడని విదూషకుడు చెప్పగానే- "అయ్యో! పాపం! ఇల్లు చూసి మోసపోయి ఉంటాడు. ఇంట్లో ఏమీ దొరకక పోడంతోటే ఆ చోరుడు హతాశుడై తన మిత్రులతో నన్ను గూర్చి ఏమి చెప్పు కుంటాడో కదా" అని అంటాడు.

"పోయిన అలంకారాలకి బదులుగా ఇంత అమూల్యమైన రత్నహారాన్ని వసంతసేనకు ఇవ్వడమా" అని విదూషకుడు అన్నప్పుడు- "మనం విలవ కట్ట వలసినది అలంకారాలకి కాదు; మన మీద ఎంత నమ్మకంమీద ఆమె ఆ అలంకా రాలు మన వద్ద ఉంచినదో ఆ నమ్మకానికి విలువ కట్టాలి" అని అంటాడు-

"యం సమాలంబ్య విశ్వాసం న్యాసోఽస్మాసు తయా కృతః
తస్యై తన్మహతోమూల్యం ప్రత్యయస్యైవ దీయతే." (III-29)

తనను వధ్యస్థానానికి తీసుకొని వెడుతున్నపుడు- "నాకు మరణదండన విధించినందులకు ఏ మాత్రమూ విచారం లేదు. ఇలాంటి ఘోర నిందను మోపి నందులకే విచారం. నేను నిరపరాధి నని చెప్పి తరువాత నన్ను చంపినా అది నాకు పుత్రోత్సవంవంటిదే- అని"అంటాడు.

"న భీతో మరణాదస్మి కేవలం దూషితం యశః
విశుద్ధస్య హి వే మృత్యుః పుత్రజన్మసమో భవేత్" (X-27)

న్యాయస్థానంలో విచారణ జరుగుతున్నపుడు విదూషకుడు వచ్చి "మిత్రమా! నిజం చెప్పవచ్చును కదా!" అని ప్రశ్నించినపుడు చారుదత్తుడు అంటాడు—

''దుర్బలం నృపతేశ్చక్షు ర్నైతత్తత్త్వం నిరీక్షతే
కేవలం వదతో దైన్య మశ్లాఘ్యం మరణం భవేత్.'' (IX-32)

"రాజుల కళ్లు దుర్బలమైనవి. యథార్థాన్ని చూడజాలవు. అటువంటప్పుడు ఏమి చెప్పినా దైన్యం ప్రకటించినట్లే అవుతుంది. తరవాత మరణ దండన విధిస్తే దానిని అనుభవించడం కూడా అశ్లాఘ్యమే అవుతుంది. అనగా అలాంటి దైన్యాన్ని చూపకుండా మరణించడంలోనే హుందాతనం ఉన్నది.''

చివరికి తన కింత మహాపకారం చేసిన శకారుణ్ణి శిక్షించవలసినదిగా అటు ప్రజలూ, ఇటు రాజప్రతినిధిగా శర్విలకుడు కూడా కోరినా నిరాకరించి ఆతనికి ప్రాణభిక్ష ఇచ్చిన మహోదాత్త స్వభావుడు చారుదత్తుడు.

**శకారుడు :-** ఈ పాత్రని అత్యద్భుతంగా చిత్రించినాడు శూద్రకుడు. శకారాలతో నిండిన ప్రాకృతభాష మాటలాడడంచేత ఈతని కాపేరు వచ్చింది. ఇతడు రాజుగారి బావమరిది. బహుశా ఉంపుడుకత్తెకు సోదరుడు. అలాంటి వానికి ఉండవలసిన దుష్ట లక్షణాలన్నీ ఉన్నాయి. నడివీథులలో స్త్రీలను బలాత్కరించడం, అధికారులమీద అధికారం చలాయించడం, అడ్డువచ్చినవాళ్ల నందరినీ ఏలాంటి పాపభీతీ సంకోచమూ లేకుండా పరిమార్చడమూ ఇవన్నీ ఇతని సహజ గుణాలు. ఇతని మాటలాడే పద్ధతీ, ఇతనికిగల పురాణేతిహాసాదుల జ్ఞానమూ హాస్యజనకంగా ఉంటాయి. అయితే ఇదంతా ఇతడు కావాలని చేస్తున్నట్లుగా కనబడుతుంది. ఎందుచేతనంటే చివరి చివరికి వసంతసేనను పీక నులిమి చంపిన ఘట్టంలోనూ, న్యాయస్థానంలోనూ ఇతని ప్రవర్తనలో ఇలాంటి అసంబద్ధ వాక్యాలేవీ కనబడవు. ఒక దుర్మార్గుడు ఒక పద్ధతి ప్రకారంగా ఏలా ప్రవర్తిస్తాడో అదే కనబడుతుంది.

ప్రథమాంకంలోనే శకారుడు వసంతసేనను వెంబడిస్తూ మనకు ప్రత్యక్షం అవుతాడు. తనను చూచి పారిపోతున్న వసంతసేనను ఉద్దేశించి-

''మమమదన మనఙ్గం మన్మథం వర్ధయన్తీ
నిశి చ శయనకే మమ నిద్రామాక్షిపన్తీ
ప్రసరసి భయభీతా ప్రస్ఖలన్తీ స్ఖలన్తీ
మమ వశమనుయాతా రావణస్యేవ కున్తీ.''

''నాలో మన్మథుణ్ణి రేకెత్తిస్తూ, రాత్రి పడకమీద నాకు నిద్ర లేకుండా చేస్తూ భయపడి రావణాసురుని చూచి కుంతి పారిపోయినట్లు ఎందుకు పారిపోతావు ?'' అని అంటాడు. ''మదనం, అనంగం, మన్మథం'' ''ప్రస్ఖలన్తీ-

స్థలన్తీ'' ఈ విధంగా ఒకే అర్థంగల అనేక పదాలు వాడడమూ, ''రావణస్యేవ కున్తీ'' మొదలైన అసంబద్ధమైన ఉపమానాలు వాడడమూ ఇవి ఇతని మాటలలో అంతటా కనిపిస్తుంది. ఇలాంటి స్థలాలు దాదాపు పది-పదిహేను ఉంటాయి.

శకారుడు ఎంతటి ప్రగల్భాలరాయడో అంత పిరికి పంద. వీళ్ల వెంబడిస్తూన్నప్పుడు వసంతసేన ''పల్లవక, పల్లవక'', ''పరభృతికే, పరభృతికే'' అంటూ తన పరిచారకులను పిలుస్తుంది. అది వినగానే శకారుడు భయపడుతూ పక్కనున్న విటునితో ''భావ భావ! మనుష్యాః, మనుష్యాః'' (ఎవరో మగవాళ్లు మగవాళ్లు) అని అంటాడు. పుష్పకరండకోద్యానంలో తనను నిరాకరించిన వసంతసేనను చంపబోయినపుడు విటుడు అడ్డుకుంటాడు. విటుడు కత్తి దూయవలసి వస్తుంది. దానితో భయపడి శకారుడు ఇదంతా నేను పరిహాసంకోసం చేస్తున్నాను అని విటునికి నచ్చచెప్పి ఆతనిని ఏదో మరొక పనిమీద పంపివేసి వసంతసేనను పీక నులిపి క్రింద పడవేస్తాడు.

దుర్బలులనూ, నిస్సహాయులనూ నిర్దయగా పీడించే స్వభావం కలవాడు. పుష్పకరండోద్యానంలోనికి ప్రవేశించిన బౌద్ధభిక్షువు ఇతని మాట వినగానే హడలిపోతాడు. ''అయ్యో! ఇతని కంట బడ్డానే! ఎవడైనా ఒక భిక్షువు అపరాధం చేసినా కనిపించిన భిక్షువు నల్లా ముక్కుకు తాడు వేసి ఎద్దులను లాగినట్లు లాగి పారవేస్తాడు'' - ''ఏకేన భిక్షుణా అపరాధే కృతే అన్యమపి యత్ర యత్ర భిక్షుం పశ్యతి తత్ర గామివ నాసాం విద్ధ్వాపవాహయతి" అని అనుకుంటాడు, అతడు భయపడినట్లుగానే శకారుడు ఆతనిని పట్టుకొని-''ఏమిరా! ఇది మా బావగారు నా కిచ్చిన ఉద్యానం. ఈ సరస్సులో కుక్కలూ, నక్కలూ నీళ్లు త్రాగాలే కాని వర మనుష్యుడను నేనుకూడా స్నానం చేయను, ఉలవ గుగ్గిళ్ల కంపుకొట్టే నీ శాటి గుడ్డలను తడుపుతున్నావా!" అని అంటూ చావ మోదుతాడు. ఈతనితో స్నేహం చేస్తున్నా విటుడు చాలా మంచివాడు. ఆ భిక్షువుని విడిచి పెట్టమంటాడు. ఒక షరతుమీద విడిచి పెడతానంటాడు శకారుడు. అదేమిటనగా - ఆ భిక్షువు కొంత బురద తీసి నీటిలో వేయాలట, ఐతే నీరు బురద కాకూడదట. లేదా నీళ్లు ఉండచుట్టి బురదలో విసరాలట. చివరికి విటుడు కూడా విసుగు చెంది

''అహో మూర్ఖతా!
విపర్యస్త మనశ్చేష్టైః శిలాశకల వర్ష్మభిః
మాంసవృక్షైరియం మూర్ఖైః భారాక్రాంతా వసుంధరా''

''మూర్ఖులు మాంసమయ వృక్షాలు. మనస్సూ చేష్టలూ కూడా విపరీతంగా ఉంటాయి. శరీరాలు శిలాశకలాలవంటివి. వీళ్లందరూ భూభార భూతులు'' అని అంటాడు.

దుర్మార్గులైన రాజబంధువుల ప్రవృత్తి ఏ విధంగా ఉంటుందో మనం ఈతని వ్యవహారాన్ని పట్టి తెలుసుకొనవచ్చును. న్యాయాలయం తెరిచి ఈ రోజున వ్యహారం కోసం వచ్చిన వాళ్లెవరైనా ఉంటే రావచ్చునని అంటూ శోధనకుడు పిలుస్తాడు. ఇదిగో నేను ఉన్నాను అని అంటూ శకారుడు ముందుకు వస్తాడు. ఈ రోజున ఈతనితో బోణీయా అని భయపడి, నీ వ్యవహారం ఈ రోజున చూడము అని అధికరణికుడు (న్యాయాధిపతి) కబురు పంపుతాడు. దానితో శకారుడు ఉగ్రుడైపోయి-''ఆః కిం నదృశ్యతే మమ వ్యవహారః. యది న దృశ్యతే తదావుత్తం రాజానం పాలకం భగినీపతిం విజ్ఞాప్య భగినీం మాతరం చ విజ్ఞాప్య ఏత మధికరణికం దూరీకృత్య అన్యమధికరణికం స్థాపయిష్యామి''- ఏమేమీ నావ్యవహారం చూడరా చూడకపోతే మాబావగారు, మా అక్క మొగుడు, పాలక రాజుతోటీ, మా అక్కతోటీ, మా అమ్మతోటీ చెప్పి ఈ న్యాయాధికారిని తీయించివేసి మరొకణ్ణి వేయిస్తాను'' అని అంటాడు. దానితో భయపడి అధికరణికుడు అతనిని లోనికి పిలిచి వ్యవహారం పరిశీలించడానికి అంగీకరిస్తాడు. లోనికి రాగానే తన వ్యవహారం ఏమో ముందుగా చెప్పకుండా తానెవరో చెప్పుకొంటాడు. అది కూడా ఆ అధికరణికుని చెవిలో —

> ''రాజశ్వశురో మమ పితా రాజా తాతస్య భవతి జామాతా
> రాజశ్యాలోఽహం మమాపి భగినీపతీ రాజా''

''నేను ఎవరిననుకున్నావు! మా నాన్నగారు రాజుగారికి మామగారు; రాజుగారు మా నాన్నగారికి అల్లుడు; నేను రాజుగారి బావమరదిని; రాజుగారు మా అక్కగారి మగడు.''

ఇదంతా విని అధికరణికుడు ఎంత భయపడినా-''అయ్యా! మా కన్ని విషయాలూ తెలుసును; కులాన్ని చెప్పుకొని ప్రయోజనం ఏమిటి? శీలం కావాలి కాని! సుక్షేత్రంలో ముళ్లచెట్లు బాగా బలంగా పెరుగుతాయి అసలు విషయం ఏమిటో చెప్పు'' అని అనకుండా ఉండలేక పోయినాడు.

> ''సర్వంజ్ఞాయతే-కిం కులేనోపదిష్టేన శీలమేవాత్ర కారణమ్
> భవన్తి నితరాం స్ఫీతాః సుక్షేత్రే కంటకిద్రుమాః'' (IX-7)
> తదుచ్యతాం కార్యమ్.''

ఇది చూస్తే ఆనాటి నిరంకుశ ప్రభువు కింద పని చేసే అధికారికూడా చాలా ఆత్మశుద్ధి, ధైర్యమూ కలవాడని చెప్పాలి. సమయానుకూలంగా పన్నాగం పన్నే శక్తి కూడా శకారునిలో ఉన్నది. వసంతసేనను చంపుతూన్నపుడు స్థావరకుడనే చేటుడు అక్కడ ఉన్నాడు. ఆతను రహస్యం ఎక్కడ బైట పెడతాడో అని ఆతనిని శకారుడు మేడ గదిలో బంధించి పడవేస్తాడు. చారుదత్తుణ్ణి వధ్యస్థానానికి తీసుకొని పోతూన్నప్పుడు ఆ చేటుడు ఉండబట్టలేక ఏలాగో బంధనాలు తెంపుకొని జనంలోనికి వచ్చి-వసంతసేనను చంపినది శకారుడే కాని చారుదత్తుడు కాదని చెపుతాడు. ఇంతలో శకారుడు చూచి ఆతనిని బ్రతిమాలినా ఆతడు వెనుకకు వెళ్ళడు. జనం అంతా ఆతని మాట నమ్మే పరిస్థితిలో ఉంటారు. ''వీడు బంగారం అపహరించినాడు. అందుచేత వీనిని కొట్టి బంధనంలో పడవేశాను. ఆ కోపంతో ఇలా చెపుతున్నాడు'' అని అంటూ చేటుడి దగ్గరికి వెళ్ళి రహస్యంగా బంగారు కడియం వాని చేతిలో పెట్టి-''ఇది తీసుకొని మరోవిధంగా చెప్పు'' అని అంటాడు. వెంటనే ఆ చేటుడు –"అయ్యా! చూచినారా! ఇది నాకు లంచం ఇచ్చి మరో విధంగా చెప్పమంటున్నాడు" అని ఆ కడియం చూపిస్తాడు. ''ఆఁ! ఈ కడియాన్నే గూర్చే వీనిని నేను బంధించాను'' అని శకారుడనడంతో అక్కడి వాళ్లంతా అతని మాటలే నమ్ముతారు.

ఈ విధంగా శకారుడు శూద్రకునిచేత అతినైపుణ్యంతో సృష్టించబడిన పాత్ర. ఈతడు మూడు అంకాలలో మాత్రమే కనబడినా ఈతని ప్రభావం మాత్రం నాటకం అంతటి మీదా ప్రసరించి ఉన్నది.

**శర్విలకుడు:-** ఇతడొక బ్రాహ్మణ యువకుడు, వసంతసేన దగ్గర క్రీతవాసిగా ఉన్న మదనికను ప్రేమించి ఉన్నాడు. వసంతసేనకు ఇవ్వవలసిన సొమ్ము చెల్లించి మదనికను దాస్యవిముక్తురాలిని చేసి అమెను వివాహమాడవలెనని ప్రయత్నము. అందుకొరకై చారుదత్తుని ఇంటికి కన్నంవేసి అక్కడ వసంతసేన న్యాసంగా ఉంచిన అలంకారాలను అపహరిస్తాడు. అయితే ఇది ప్రథమచౌర్య ప్రయత్నం కాదు. ఇతడు ఈకళతో అరితేరినవాడడమే కాకుండా అశ్వత్థామాదులు అవలంబించిన పద్ధతి అవడం చేత ఏమీ తప్పులేని వృత్తి అంటాడు.

కామం నీచ మిదం వదన్తు పురుషాః స్వప్నే చ యద్వర్ధతే
విశ్వస్తేషు చ వంచనాపరిభవ శ్చౌర్యం న శౌర్యం హి తత్
స్వాధీనా వచనీయ తాపి హి వరం బద్ధో న సేవాంజలిః
మార్గోహ్యేష నరేంద్ర సౌప్తికవధే పూర్వం కృతో ద్రౌణినా. (III–11)

''ఈ చౌర్యం అనేది అందరూ వళ్లు మరచి నిద్రపోతూన్న సమయంలో చేసే వంచన అవడంచేత ఇదేమీ శౌర్యంకాదు అని అందరూ అంటే అనవచ్చును. అందరూ నిందిస్తారు కూడా. ఏది ఏమైనా ఒకని దగ్గర నిలబడి 'దాసోఽహమ్' అని దోసిలి ఒగ్గవలసిన పని ఉండదు. ఉపపాండవవాదులను సంహరించినప్పుడు అశ్వత్థామ అవలంబించిన మార్గం ఇదే కదా?''

చౌర్య శాస్త్రం అంతా క్షుణ్ణంగా అభ్యసించి దానిని ప్రయోగాత్మకంగా అనేక పర్యాయాలు ఉపయోగించిన వ్యక్తి శర్విలకుడు. పండు ఇటుకల గోడ అయితే ఎలా కన్నం తవ్వాలి, పచ్చి ఇటుకలైతే ఎలా తవ్వాలి, మట్టి ముద్దల గోడఐతే ఎలా తవ్వాలి, కఱ్ఱగోడ అయితే ఏమి చెయ్యాలి—వీటి కన్నింటికీ శాస్త్రీయ ఫక్కికలు తెలిసినవాడు. తవ్వే కన్నంలో కూడా కళాత్మకమైన-అందం ఉండాలట. తాను చేసే కన్నం వికసిస్తూ పద్మంవలె ఉండాలా, సూర్య బింబంవలె ఉండాలా, బాలచంద్రాకారంలో ఉండాలా, దిగుడు బావివలె విస్తీర్ణంగా ఉండాలా, స్వస్తికాకారంలో ఉండాలా,పూర్ణకుంభాకారంలో ఉండాలా అని కొంతసేపు ఆలోచించుకుంటాడు. ఎందుచేతననగా మరునాడు తన శిల్పాన్ని చూచి పౌరులు ఆశ్చర్య చకితులు కావాలట.

"పద్మవ్యాకోశం భాస్కరం బాలచంద్రం
వాపీవిస్తీర్ణం స్వస్తికం పూర్ణకుంభమ్
తత్కస్మిన్ దేశే దర్శయాత్మశిల్పం
దృష్ట్వా శ్వో యం యద్విస్మయం యాన్తి పౌరాః'' (III–13)

చివరికి పండుటిటుకల గోడ మీద పూర్ణకుంభమే అందంగా ఉంటుందని నిర్ణయించుకొని చౌర్యాధి దేవతలూ చోర విద్యాచార్యులూ అయిన కుమారకార్తికేయ - కనకశక్తి - దేవవ్రత - భాస్కరనంద్యాదులకు నమస్కరించి, తన ప్రత్యక్షాచార్యుడైన యోగాచార్యుని కూడా స్మరించి కన్నం తవ్వడం ప్రారంభిస్తాడు. అయ్యో ప్రమాణ సూత్రం (కొలుచుకునేత్రాడు) మరచితినే అని అనుకొని, పరవాలేదు; ఈ యజ్ఞోపవీతంతో పని జరుపుకోవచ్చును అని నిర్ణయించుకొని ఇలా అంటాడు :

"యజ్ఞోపవీతం హి నామ బ్రాహ్మణస్య మహదుపకరణ ద్రవ్యమ్; విశేషతోఽస్మద్విధస్య. కాతః-''

"ఏతేన మాపయతి భిత్తిషు కర్మమార్గ
మేతేన మోచయతి భూషణసంప్రయోగాన్.
ఉద్ఘాటకో భవతి యనదృఢే కపాటే
దష్టస్య కీటభుజగైః పరివేష్టనం చ" (III-16)

"ఆహా! యజ్ఞోపవీతం అనేది బ్రాహ్మణునికి ఎంత ఉపకరిస్తూ ఉంటుంది! నా వంటి వానికి ఇంకాను, ఎందుచేతననగా—

"గోడకు కన్నం త్రవ్వేటప్పుడు దీనిచేత కన్నాన్ని కొలవ వచ్చును. అలంకారాల సంధులు వదులు చేయవచ్చును. తలుపు గడియ గట్టిగా ఉంటే దానిని ఊడదీయవచ్చును. తేలుకుట్టినా పాము కరచినా గట్టిగా బిగించి కట్టి ప్రథమ చికిత్స చేసుకోవచ్చును."

ఇలా అనుకుంటూ కన్నం తవ్వుతూ ఉండగా పాము కరుస్తుంది. యజ్ఞోపవీతం పాము కరచిన వ్రేలుకు బిగించి చికిత్స చేసుకొని లోన ప్రవేశిస్తాడు. విలువైనది ఏదీ కనబడదు. ఒక మూల వీణ, ఒక మూల మృదంగం ఇవన్నీ చూసి "అయ్యో! ఇదేదో నాట్యాచార్యుని ఇల్లువలె ఉన్నది; ఇంటిని చూచి మోసపోతినే" అనుకుంటాడు. చివరికి విదూషకుడి చేతిలో ఆ అలంకారాలు దొరకడంతో వాటిని తీసుకొని వెళ్ళి మదనికను విడిపించుకొని, వసంతసేన ఇచ్చిన బండిమీద ఆమెను తీసుకొని వెడతాడు.

ఐతే తన మిత్రుడైన ఆర్యకుణ్ణి పాలకుడు చెరసాలలో పెట్టినాడని వినగానే అంత శ్రమపడి, అంత సాహసంచేసి విడిపించుకున్న మదనికనుకూడా విడిచిపెట్టి, ఒంటరిగా ఒక మిత్రుని ఇంటికి పంపివేసి, ఆర్యకుని విడిపించడానికై ప్రయత్నం చేయాలనే ఉద్దేశంతో తన సహచరులను కలుసుకోవడానికి వెళ్ళిపోతాడు.

"ద్వయ మిద మతీవలోకే ప్రియం నరాణామ్ సుహృచ్చ వనితా చ
సంప్రతి తు సున్దరీణాం శతాదపి సుహృద్విశిష్టతమః"

(ఈ లోకంలో మానవులకి ఇష్టమైనవి రెండే - వనితా, మిత్రుడూను. ఇప్పుడు నాకు నూరుగురు సుందరుల కంటె కూడా మిత్రుడే చాలా విశిష్టుడు) అని అంటాడు. చివరకు ఆర్యకుని విడిపించి రాజ్యాభిషిక్తుని చేయడంలో ప్రధాన పాత్ర వహిస్తాడు. ఈ విధంగా శర్విలకుడు ప్రధానమైన వసంతసేనా చారుదత్తుల కథలోనూ, పాలకుని రాజ్యభ్రష్టుని చేయడం అనే ఉపకథలోనూ కూడా సమంగా ఉపయోగిస్తాడు.

**విదూషకుడు** : ఇతని పేరు మైత్రేయుడు. చారుదత్తుని మిత్రుడు. అతడు దారిద్ర్యంలో బాధపడుతున్న సమయంలో కూడా ఆతనిని విడవనివాడు. ఆతడు ఐశ్వర్యంతో తులతుగుతున్నప్పుడు తాను ఏ విధంగా సమస్త సుఖాలూ అనుభవిస్తూ ఉండేవాడో స్మరించుకుంటూ కాలక్షేపం చేస్తూ ఉంటాడు. ఆ కాలంలో చారుదత్తుని భవనంలో అనేక భక్ష్యాలు తీసుకొనివచ్చి తన ముందు ఉంచేవారట, చిత్ర పటం నిర్మించేవాడు అనేకమైన రంగుల గిన్నెలలో వ్రేళ్లు ముంచినట్లుగా వ్రేళ్లతో మాత్రమే అలా-అలా భక్ష్యాలని స్పృశించి, తొలగించి వేసి, నగర చత్వరంలో (చౌరాస్తాలో) కూర్చొన్న వృషభంవలె నెమరువేస్తూ ఉండేవాడట. ఆలాంటి తనకు ఈనాడు పెంపుడు పావురం ఆహారం కోసం అటూ ఇటూ తిరిగి నివాసం కోసం ఇంటికి చేరినట్లుగా పగలంతా ఇటూ అటూ తిరిగి, సాయంకాలానికి చారుదత్తుని ఇంటికి చేరవలసిన చెడ్డ రోజులు వచ్చినాయట. ఈ విధంగా విచారిస్తున్నా ఆతనికి చారుదత్తుని మీద ఉండే ప్రేమ వీసమంతైనా తగ్గలేదు.

ఐతే తెలివితక్కువతనం వల్ల, కొంతవరకూ, చారుదత్తుని కష్టాలకి ఇతడే కారకుడౌతాడు. వసంతసేన న్యాసంగా ఉంచిన అలంకారాలని రాత్రిపూట రక్షించవలసిందిగా చెప్పి చారుదత్తుడు విదూషకునికి ఇస్తాడు. శర్విలకుడు తాను కన్నం త్రవ్వినది ఒక దరిద్రుని ఇంటికనే విషయం తెలుసుకొని వెళ్ళిపోబోతుండగా సగం నిద్రలో ఉన్న విదూషకుడు ఆతడు చారుదత్తుడని భ్రాంతి చెంది — "మిత్రమా ! ఈ అలంకారాలతో నాకు సరిగా నిద్రపట్టడం లేదు. నీ దగ్గరనే దాచుకో'' అని అంటూ ఆ శర్విలకుని చేతిలో పెడతాడు. అదే విధంగా న్యాయస్థానంలో శకారునితో కలహానికి దిగి ఆ అలంకారాల మూట క్రిందికి జారవిడవడంతో చారుదత్తునిపై మోపిన అభియోగం నిర్ధారితమై ఆతడు వధ్యస్థానానికి వెళ్ళవలసి వచ్చింది.

**వసంతసేన** :- ఈమె జన్మతః వేశ్యయే అయినా కులాంగనా జీవితాన్ని గడపాలనే తీవ్ర వాంఛగల ఉత్తమ వనిత. చతుర్థాంకంలో వర్ణించిన అష్టప్రాంగణాలతో కూడిన ఈమె భవనాన్ని పట్టి చూస్తే ఈమె రాజతుల్యైశ్వర్యవతిగా స్పష్టం అవుతుంది. అయినా ధనానికి ఏ మాత్రమూ ప్రాధాన్య మీయకుండా గుణాలను మాత్రమే పురస్కరించుకొని చారుదత్తుని వరించినది. అంత అధికారైశ్వర్యాదులు గల రాజశ్యాలకుడు స్వయంగా కోరినా, తల్లి కూడా అందుకు

ప్రోత్సహించినా, ఆతనిని చీకొట్టినది. తనను చారుదత్తుని వంటి మహోదాత్త స్వభావునికి తగిన ఉత్తమ వనితగా ఋజువు చేసికొనినది.

**హాస్యరసము :-** మృచ్ఛకటికంలో ప్రధానరసం శృంగారము. ఇతర రసాలన్నీ దానికి అంగాలు. అయితే ప్రారంభంనుంచి చివరివరకూ ఈ రూప కంలో హాస్యరసం కూడా అనేక విధాలుగా పోషింపబడినది. ఇంత హాస్యరస పుష్టి మరియే నాటక ప్రకరణాలలోనూ లేదని చెప్పడంలో సందేహం లేదు. హాస్య ప్రధానాలైన ప్రహసనాదులలో హాస్యరసం పోషింపబడినదంటే అది వేరే విషయము.

శకారుడు దుష్టుడైన ప్రతి నాయకుడైనా ఆతని పాత్ర హాస్యాలంబనంగా చిత్రింపబడినది. ఆతని మాటలే కాక చేష్టలు కూడా హాస్యజనకములు. తనను చూచి పారిపోతూన్న వసంతసేనను "నాణకమోషికా", "మకశికా" మొదలైన అర్థంలేని పది పేర్లుపెట్టి పిలిచి, "ఏమిటి బావా! ఈమెకు ఇలా పదిపేర్లు పెట్టి నాను, అయినా నా ప్రేమను అంగీకరించదేమిటి!" అని అంటాడు విటునితో.

"ఏషా నాణక మోషికా మకశికా మత్స్యాశికా లాసికా
నిర్నాసా కులనాశికా అవశికా కామస్య మంజూషికా
ఏషా వేశవధూః సువేశనిలయా వేశాంగనా లేశికా
ఏతాన్యస్యా దశ నామాకాని మయా కృతాన్యద్యాపి మాం నేచ్ఛతి"

(I-23)

"రాముణ్ణి చూచి భయపడి పారిపోతున్న ద్రౌపదివలె ఎందుకల్లా అలంకారాలు ఝుణఝుణా మ్రోగించుకొంటూ పరుగెత్తుతావు? హనుమంతుడు విశ్వావసువు చెల్లెలైన సుభద్రను హరించినట్లుగా బలాత్కారంగా హరిస్తాను" అని అంటాడు తన పురాణగాథా పాండిత్యాన్ని ప్రకటిస్తూ.

"ఝణఝ్ఝణమితి బహుభూషణ శబ్దమిశ్రం
కిం ద్రౌపదీవ పలాయసే రామభీతా
ఏష హరామి సహసేతి యథా
హనూమాన్విశ్వావసోర్భగినీమివ తాం సుభద్రామ్." (I-21)

వసంతసేన చీకట్లో కనబడకుండా ఉండగా— "అయ్యో! బొగ్గుముక్క మినుగుల రాసిలో కలిసిపోయినట్లు ఈ వసంతసేన చూస్తూ ఉండగానే అంధ కారంలో మాయమైపోయిందే" అంటాడు.

"వసంతసేన నీ ఇంట్లో ప్రవేశించింది. ఆమెను నీవు తీసుకొని వచ్చి స్వయంగా వప్పచెప్పకపోతే నీకూ నాకూ ఆజన్మాంత వైరం ఏర్పడుతుంది" అని చారుదత్తునితో చెప్పవలసిందిగా విదూషకునికి చెప్పి- నేను చెప్పినది సరిగా చెప్పకపోతే తలుపుసందున పెట్టి వెలక్కాయ పటపటలాడించినట్లుగా నీ బుర్ర కటకటలాడించేస్తాను అని అంటాడు "తదా కపాటతలప్రవిష్టం కపిత్థగులికమివ మస్తకం తే మడమడాయిష్యామి" ఆ సందర్భంలో వాడిన ఈ ఉపమానం హాస్యజనకంగా ఉన్నది. శకారునికి సంబంధించిన హాస్యం ఈ విధంగానే నడిచింది.

విదూషకుని ద్వారా కూడా అనేక ప్రదేశాలలో హాస్యం పోషించబడింది. ఉదాహరణకు రెండు మూడు స్థలాలు:

వసంతసేన అలంకారాలు న్యాసంగా ఇచ్చినపుడు చారుదత్తుడు "మైత్రేయా, అవి తీసుకో" అంటాడు. విదూషకుడు అవి తీసుకొని "స్వస్తిభవత్యై" (నీకు సుఖమగుగాక- మనం ఇపుడు "థాంక్స్" అన్నట్లు) అంటాడు. చారుదత్తుడప్పుడు "ధిక్‌మూర్ఖ! న్యాసః ఖల్వయమ్"- "ఛీమూర్ఖుడా! ఇది న్యాసం కదా" (నీకు దానం చేయడం లేదుకదా అని భావం) అంటాడు. "అట్లైతే దీనిని దొంగలు ఎత్తుకొనిపోవుదురుగాక" అని అంటాడు విదూషకుడు మెల్లిగా.

వసంతసేనకి రత్నహారం ఇవ్వడానికై వెళ్ళినప్పుడు విదూషకుడు ఒక గదిలో ఆమె తల్లిని చూస్తాడు. ఆమె చాలా స్థూలకాయురాలుగా ఉంటుంది. అప్పుడు పక్కనున్న చేటితో ఇలా అంటాడు-"అహో అస్యాః కపర్దక డాకిన్యాః ఉదరవిస్తారః, తత్కిమేతాం ప్రవేశ్య మహాదేవ మివ ద్వారశోభా ఇహ గృహే నిర్మితా-" "ఈ డాకిని ఉదరం ఎంత పెద్దదిగా ఉన్నది! ఈమెను ముందుగా ఈ గదిలో కూర్చుండబెట్టి తరవాత ద్వారం బిగించినారా?"

తనను గూర్చి తానే పరిహసించుకోగలవాడు ఈ విదూషకుడు. "యథా సర్వనాగాం మధ్యే డుండుభః తథా సర్వబ్రాహ్మణాం మధ్యేఽహం బ్రాహ్మణః" సర్పాలలో బురదపాము ఎంతో బ్రాహ్మణులలో నేనూ అంతే అంటాడు ఒక చోట.

విదూషకుడు హారం ఇచ్చి తిరిగివచ్చిన తరువాత చారుదత్తుడు నీవువెళ్ళిన పని ఏమైనది అని అడుగుతాడు. "తత్ ఖలు కార్యం వినష్టం" (ఆ పని చెడిపోయింది) అంటాడు విదూషకుడు. "ఐతే ఆమె ఆ రత్నావళిని తీసుకోలేదా?" అని ప్రశ్నిస్తాడు చారుదత్తుడు. "అయ్యో! మనకంత అదృష్టం కూడానా !

దండం పెడుతూ తీసుకొన్నది'' అంటాడు. చారుదత్తుడు - ''ఐతే ఆ పని చెడి పోయిందని అంటావేమి?'' విదూషకుడు-''చెడిపోవండ కాకపోతే ఏమిటి? మనం తిన్నది కాదు, తాగినది కాదు; దొంగలు అపహరించిన ఆకొంచెం సువర్ణభాండానికి ఇంత అనర్ఘమైన రత్నమాలను తీసుకోవడమా !'' ఈ ఘట్టం అంతా హాస్యభరితమై ఉన్నది.

వసంతసేన చేటుని వెంటబెట్టుకొని చారుదత్తుని ఇంటికి వస్తుంది. చేటుడు ముందుగా లోనికివచ్చి విదూషకునితో పరిహాసం ప్రారంభిస్తాడు. వసంతసేన వచ్చినదని నేరుగా చెప్పకుండా ''నీకొకప్రశ్న (పొడువుకథ) వేస్తాను; చెప్పుకో'' అంటాడు. విదూషకుడు అడగమంటాడు. చేటుడు - చూతవృక్షాలు ఎప్పుడు మొగ్గతొడుగుతాయి? విదూషకుడు - గ్రీష్మంలో. చేటుడు -(నవ్వి) అరే కాదు. కాదు. విదూషకుడు (తనలో) ''మన మిత్రుణ్ణి అడిగిచెపుదాం.'' చారుదత్తుని దగ్గరికివెళ్ళి - ''కస్మిన్ కాలేక చూతాః ముకులితా భవన్తి?'' అని అడుగుతాడు. చారుదత్తుడు''మూర్ఖ ! వసన్తే.'' విదూషకుడు చేటునికి ఆ మాటలే చెపుతాడు - ''మూర్ఖ !వసన్తే.'' చేటుడు- మరొక ప్రశ్న వేస్తాను చెప్పు. సుసమృద్ధములైన గ్రామాలకి రక్ష చేసేది ఏది? విదూషకుడు-వీథి. చేటుడు-(నవ్వుతూ)కాదు కాదు. విదూషకుడు మళ్ళీ చారుదత్తుని అడుగుతాడు. చారుదత్తుడు - ''వయస్య ! సేనా.'' విదూషకుడు - ''అరే ! దాస్యాఃపుత్ర! సేనా.'' చేటుడు - ఈరెండూ కలిపిచెప్పు, విదూషకుడు - సేనావసన్తే. చేటుడు - తిప్పిచెప్పు. విదూషకుడు-(శరీరంతిప్పి) సేనావసన్తే. చేటుడు - మూర్ఖుడా! పదాలుతిప్పు. విదూషకుడు-(పాదాలు ఇటుఅటుతిప్పి) సేనావసన్తే. చేటుడు-మూర్ఖా! (పాదాలుకాదు) అక్షరాలున్న పదాలు తిప్పి చెప్పు.'' అప్పుడు విదూషకుడు ''వసన్తేసేనా'' అని అంటాడు. ఈ ఘట్టం హాస్యభరితమైనది.

చారుదత్తుని బండి ఎక్కి ఆర్యకుడు పుష్పకరండోద్యానానికి వెడతాడు. వసంతసేన కోసం ఎదురుచూస్తున్న చారుదత్తుడు బండి అక్కడికి చేరగానే- ''వసన్తసేన వచ్చింది; ఆమెను దింపుము'' అని విదూషకుని ఆదేశిస్తాడు. అతడు బండిలోనికి చూడగానే ఆర్యకుడు కనిపిస్తాడు. వెంటనే అతడు- ''భోః న వసన్తసేనా; వసన్తసేనః ఖల్వేషః''(వసంతసేన కాదు, వసంతసేనుడు వచ్చినాడు) అని అంటాడు.

ఈవిధంగా విదూషకపాత్ర కూడా శూద్రకునిచేత హాస్యరస పరిపోషకంగా తీర్చిదిద్దబడినది.

జూదరుల కలహాన్ని వర్ణించే రెండవ అంకం హాస్యరసభరితమైనది.

సంవాహకుడు జూదంలో పది సువర్ణాలు ఓడిపోయి, సభికుడేవో లెక్కలు వేసుకుంటూ ఉండగా పారిపోయి వస్తాడు. ఆతని తరుముకుంటూ, కేకలు వేసుకుంటూ మాథురుడూ (సభికుడు) రెండవ ద్యూతకరుడూ వస్తారు. ఇంతలో ఆ సంవాహకుడు విపరీతమైన (దేవాలయాభిముఖం కాకుండా వీధికి అభిముఖంగా ఉన్న) పాదాలతో నడిచివెళ్ళి పాడుదేవాలయంలో ప్రవేశించి దేవీ విగ్రహంవలె కదలకుండా కూర్చుంటాడు. అతడు చేసిన వంచన కనిపెట్టి మాథుర ద్యూతకరులు కూడా ఆ దేవాలయంలోనికి ప్రవేశిస్తారు. సంవాహకుని గుర్తించనట్లు అభినయిస్తూ దేవీప్రతిమవలె కూర్చున్న ఆ సంవాహకుని ఎదట ద్యూతం ఆడడం ప్రారంభిస్తారు. ఆ పాచికల చప్పుడు వింటూంటే సంవాహకుని ఒళ్ళు పరవశం చెందుతూ ఉంటుంది. ఇలా అనుకుంటాడు—

> ''అరే కత్తాశబ్దో నిర్నాణకస్య హరతి హృదయం మనుష్యస్య
> ఢక్కాశబ్ద ఇవ నరాధిపస్య ప్రభ్రష్టరాజ్యస్య'' (II-5)

(ఢక్కాశబ్దం రాజ్యభ్రష్టుడైన రాజుయొక్క మనస్సును కలవరపెట్టినట్లు కత్తా (గవ్వలవంటి ద్యూతోపకరణాలు) శబ్దం నాణకాలు లేనివాని మనస్సును కలవరపెడుతుంది).

> ''జానామి న క్రీడిష్యామి సుమేరుశిఖరపతనసన్నిభం ద్యూతమ్
> తథాపి ఖలు కోకిలమధురః కత్తాశబ్దో మనోహరతి'' (II-6)

(జూదం అంటే మేరుపర్వత శిఖరంనుంచి క్రిందపడడం వంటిది. అది ఆడకూడదని నిశ్చయించుకున్నాను. అయినా కోకిలధ్వనివలె మధురమైన ఈ కత్తా శబ్దం మనస్సును ఆకర్షించేస్తూన్నది!). ఇంతట్లో ఆ మాథురుడూ ద్యూతకరుడూ కూడా "నా పందెం'' అంటే ''నా పందెం'' అని అంటూ ఉంటారు. సంవాహకుడు ఉండబట్టలేక ''నా పందెం నా పందెం" అంటూ వాళ్ళ దగ్గరికి వస్తాడు. దొరికాడురా దొంగ అని వాళ్ళు ఆతని బాగా మర్దిస్తారు.

ఇంతలో దర్దురకుడనే మరొక ద్యూతకరుడు ప్రవేశిస్తాడు. ''ద్యూతం హి నామ పురుషస్యాసింహాసనం రాజ్యమ్'' (జూదం అంటే సింహాసనం లేని రాజ్యం) అని ఈతని సిద్ధాంతం. ఇందుకు కారణం ఏమిటనగా—

> ''న గణయతి పరాభవం కుతశ్చి
> ద్ధరతి దదాతి చ నిత్యమర్థ జాతమ్
> నృపతి రివ నికామమాయదర్శీ
> విభవవతా సముపాస్యతే జనేన.'' (II-7)

"జూదరి అవమానం జరిగినా లెక్క చేయడు. ఎల్లప్పుడూ ధనం తీసుకుంటూ ఉంటాడు, ఇస్తూ ఉంటాడు. ఎప్పుడూ ఆయం మీదనే దృష్టి. రాజును సేవించినట్లుగా ఐశ్వర్యవంతులందరూ ఇతన్ని సేవిస్తూ ఉంటారు."

ద్రవ్యం సంపాదించినా, భార్యా మిత్రాదులను పొందినా, తాను తిన్నా, ఇతరులకు పెట్టినా ద్యూతంవల్లనే జరగాలట. సర్వస్వమూ కోల్పోయినా ద్యూతంవల్లనే జరగాలట :

"ద్రవ్యం లబ్ధం ద్యూతేనైవ దారామిత్రం ద్యూతేనైవ
దత్తం భుక్తం ద్యూతేనైవ సర్వం నష్టం ద్యూతేనైవ." (II-8)

ఇలా అనుకుంటూ వస్తుండగా మార్గంలో పూర్వ పరిచితుడైన ఆ మాథురుడు కనబడతాడు. ఉత్తరీయంలో ముఖం కప్పుకొని ఆతనికి కనబడకుండా వెళ్లిపోవాలని అనుకుంటాడు కాని అది అందుకు అనుకూలంగా లేదు. దానిని ఈ విధంగా వర్ణిస్తాడు:

"అయం పటః సూత్రదరిద్రతాం గతో
హ్యయం పటః ఛిద్రశతైరలంకృతః,
అయం పటః ప్రావరితుం న శక్యతే
హ్యయం పటః సంవృతఏవ శోభతే." (II-10)

(ఈ బట్టకి దారాల దారిద్ర్యం ఏర్పడింది. ఈ బట్టకి వందలకొలదీ రంధ్రాలు ఉన్నాయి. ఈ బట్ట కప్పుకోవడానికి వీలు గాలేదు. ఈ బట్ట మడతమీద ఉంటేనే బాగుంటుంది).

సరే వీడికి కనబడితే మాత్రం ఏమవుతుంది అని అనుకుంటూ ముందుకు వస్తాడు. అభివాదన ప్రత్యభివాదనాలు అయిన తరవాత "ఎందుకు ఇతనిని ఇలా పీడిస్తున్నారు ?" అని మాథురుని ప్రశ్నిస్తాడు.

**మాథురుడు:-** మాకు పది సువర్ణాలు బాకీ ఉన్నాడు.

**దర్దురకుడు:-** ఓస్ ! పది సువర్ణాలా ! (ఇది కల్యవర్తం అంత) ప్రొద్దుట చేసే అల్పాహారం అంత లేదు.

**మాథురుడు:-** (ఆతని చకంలో నుంచి చిరిగిన బట్ట పైకి లాగి) అయ్యా ! చూడండి చూడండి ! ఈ చింకిరి బట్టలవానికి పది సువర్ణాలు కల్యవర్తమట.

**దర్దురకుడు:-** డబ్బు ఉన్నవాడు ఒళ్లో పెట్టుకొని తిరుగుతాడా !

ఇలా మాటకి మాటా పెరుగుతుంది. చివరికి ప్రహారాలలోనికి దిగుతుంది.

**దర్దురకుడు:-** ఇప్పుడు నన్ను మార్గమధ్యంలో కొట్టినావు కదా ! కానీ, రేపు రాజకులంలోనికి రా, ఏమవుతుందో చూచెదవు.

**మాథురుడు;-** ఆహా ! చూస్తాను.

**దర్దురకుడు:-** ఎలా చూస్తావు ?

**మాథురుడు:-** ఇదిగో ఇలా చూస్తాను అని అంటూ కండ్లు పెద్దవిగా చాపుతాడు. దర్దురకుడు గుప్పెడు ఇసక ఆతని కండ్లలోనికి పోసి, అక్కడి నుంచి పారిపోవలసినదిగా సంవాహకునికి సంజ్ఞ చేస్తాడు.

ఈ విధంగా ఈ ఘట్టం అంతా హాస్య రసభరితమైన శీఘ్రాభినయ భూయిష్టంగా (Full of action) ఉంటుంది.

ఇంతవరకూ పరిశీలించిన పద్ధతిలో శూద్రకుని మృచ్ఛకటికం కథా సంవిధానంలో కాని, పాత్ర చిత్రణలోకాని, రస పరిపోషణలో కాని, అన్నింటికి మించి సమసామయిక సమాజ సందర్శనంలో కాని నిరుపమానమైనది.

## మృచ్ఛకటికంలోని కొన్ని సూక్తులు

1. సుఖం హి దుఃఖాన్యనుభూయ శోభతే
   ఘనాంధకారేష్వివ దీపదర్శనమ్,
   సుఖాత్తు యో యాతి నరో దరిద్రతాం
   ధృతః శరీరేణ మృతః స జీవతి. (I-10)

   దుఃఖాలు అనుభవించిన తరవాత వచ్చిన సుఖం చీకటి తరవాత వచ్చిన వెలుగువంటిది. సుఖం అనుభవించి దరిద్రుడైనవాడు జీవన్మృతుడే.

2. దారిద్ర్యాన్మరణాద్వా మరణం మమ రోచతే న దారిద్ర్యమ్
   అల్పక్లేశం మరణం దారిద్ర్య మనన్తకం దుఃఖమ్. (I-11)

   దారిద్ర్యం కంటె మరణమే మేలు. మరణంవల్ల కలిగే క్లేశం అత్యల్పమైనది. దారిద్ర్యమో- అది అనంతదుఃఖము.

3. తపసా మనసా వాగ్భిః పూజితా బలికర్మభిః
   తుష్యన్తి శమినాం నిత్యం దేవతాః కిం విచారితైః. (I-16)

తపస్సు, మనస్సు, వాక్కు, బలికర్మలు (బలి అనగా పూజ) వీటిచేత అర్చింపబడిన దేవతలు తప్పక అనుగ్రహిస్తారు, సందేహింపవలసిన పనిలేదు.

4. సఙ్గం నైవ హి కశ్చిదస్య కురుతే సంభాషతే నాదరాత్
సంప్రాప్తో గృహముత్సవేషు ధనినాం సావజ్ఞమాలోక్యతే
దూరాదేవ మహాజనస్య విహరత్యల్పచ్ఛదో లజ్జయా
మన్యే నిర్ధనతా ప్రకామమపరం షష్ఠం మహాపాతకమ్. (I-37)

దరిద్రునితో ఎవరూ స్నేహం చెయ్యరు. ఆదరంగా మాటలాడరు. ఉత్సవ సమయాలతో ధనికుల ఇండ్లకి వెళ్ళినపుడు ఆతనిని అనాదరంగా చూస్తారు. సామాన్యమైన వస్త్రాలు ధరించి ఉండడం చేత సిగ్గుతో ధనికులకి దూరదూరంగానే తిరుగుతూ ఉంటాడు. దారిద్ర్య మనేది ఆరవ మహాపాపము.

5. "చారిత్ర్యేణ విహీనః ఆఢ్యోఽపి చ దుర్గతో భవతి." (I-43)
సచ్చరిత్ర లేనివాడు ధనవంతుడైనా దరిద్రుడే.

6. ఆలానే గృహ్యతే హస్తీ వాజీ వల్గాసు గృహ్యతే
హృదయే గృహ్యతే నారీ యదీదం నాస్తి గమ్యతామ్. (I-50)

ఏనుగను లొంగదీయాలంటే కట్టే స్తంభం కావాలి. గుఱ్ఱాన్ని కళ్ళెంతో లొంగదీసుకోవాలి. స్త్రీని హృదయంతో లొంగదీసుకోవాలి. అది లేని పక్షంలో దూరంగా వెళ్లడం మంచిది.

7. "దరిద్ర పురుషసంక్రాన్తమనాః ఖలు గణికా లోకే అవచనీయా భవతి."
దరిద్రుని కామించిన వారవనితను లోకులెవరూ దూషించరు.

8. య ఆత్మబలం జ్ఞాత్వా భారం తులితం వహతి మనుష్యః
తస్య స్ఖలనం న జాయతే న చ కాన్తారగతో విపద్యతే. (II-15)

తన బలం తెలుసుకొని భారం మోసేవానికి తొట్రుపాటు ఉండదు. (వైరాగ్యంతో) అరణ్యంలో ఉన్నవాడు ఆపద చెందడు.

9. "కవేతి శిక్షితా; ఆ జీవికా ఇదానీం సంవృత్తా."
కళ కదా అని నేర్చుకున్నాను కాని అదే ఇపుడు జీవనోపాధి అయినది. (ఇది సంవాహకుడు అన్న మాట).

10. "దుర్లభా గుణా విభవాశ్చ, అపేయేషు తడాగేషు బహుతరముదకం భవతి."

గుణాలూ ఐశ్వర్యమూ ఒకచోట ఉండవు. తాగరాని చెరువులలో నీరు నిండుగా ఉంటుంది.

11. సుజనః ఖలు భృత్యానుకంపకః
స్వామీ నిర్ధనకోఽపి శోభతే
పిశునః పునర్ద్రవ్యగర్వితో
దుష్కరః ఖలు పరిణామదారుణః. (III-1)

భృత్యుల విషయంలో జాలికల సత్పురుషుడైన ప్రభువు ధనం లేకపోయినా శోభిస్తాడు. ధనగర్వం గల చెడ్డవాడైతే చివరికి కష్టాలు కలిగిస్తాడు.

12. సస్యలంపటబలీవర్దో న శక్యో వారయితుమ్
అన్యప్రసక్తకలత్రం న శక్యం వారయితుమ్
ద్యూతప్రసక్తమనుష్యో న శక్యో వారయితుమ్
యోపి స్వాభావికదోషో న శక్యో వారయితుమ్. (III-2)

చేనుమీద పడి సస్యం తినడానికి అలవాటుపడిన ఎద్దును నివారించడం కష్టమైన పని. పరాయి మొగవానిని మరిగిన స్త్రీని వారించడం అశక్యం. జూదం ఆడేవానిని నివారించడం అశక్యం. స్వభావ సిద్ధంగా వచ్చిన దోషాన్ని తొలగించడం అసాధ్యం.

13. ''వీణా హి నామ అసముద్రోత్థితం రత్నమ్''
వీణ అనేది సముద్రంనుంచి పుట్టని రత్నము.

14. ఉత్కంఠితస్య హృదయానుగుణా వయస్యా
సంకేతకే చిరయతి ప్రవరో వినోదః
సంస్థాపనా ప్రియతమా విరహాతురాణాం
రక్తస్య రాగపరివృద్ధికరః ప్రమోదః. (III-3)

(వీణ) బెంగగొన్న వానికి హృదయానుకూలురాలైన స్నేహితురాలు. సంకేతం ఇచ్చిన ప్రియుడు ఆలస్యం చేసినప్పుడు ఉత్తమమైన వినోదకర వస్తువు. విరహంతో బాధపడే వారి మనస్సును కుదుటపరచే ప్రియతమ. అను రాగవంతుని అనురాగాన్ని పెంచే ఆనంద స్థానము.

15. ''మమ తావద్ ద్వాభ్యామేవ హాస్యం జాయతే- స్త్రియా సంస్కృతం పఠన్త్యా మనుష్యేణ చ కాకలీం గాయతా. స్త్రీ తావత్ సంస్కృతం పఠన్తీ దత్తనవనస్యేవ గృష్టిః అధికం సూసూశబ్దం కరోతి.

4)

మనుష్యోపి కాకలీం గాయన్ శుష్కసుమనోదామ వేష్టితో వృద్ధపురోహిత
ఇవ మన్త్రం జపనౌ దృఢం మే న రోచతే''. (తృ. అం.)

(ఇవి విదూషకుని మాటలు) సంస్కృతం చదువుతున్న స్త్రీని, సంగీతం పాడుతున్న పురుషుణ్ణీ, వీరిద్దరినీ చూస్తే నాకు నవ్వు వస్తుంది. సంస్కృతం చదివే స్త్రీ కొత్తగా ముక్కుతాడు వేసిన తొలిచూలు ఆవువలె "సూసూ'' అంటూ అధికంగా శబ్దం చేస్తుంది. సంగీతం పాడే పురుషుడు కూడా వాడిపోయిన పూవుల దండలు మెడలో వేసికొని ఏవేవో మంత్రాలు గొణిగే వృద్ధ పురోహితుడువలె నాకు నచ్చడు.

16. ఇయం హి నిద్రా నయనావలంబినీ
లలాటదేశాదుపసర్పతీవ మామ్
అదృశ్యరూపా చపలా జరేవ యా
మనుష్యసత్త్వం పరిభూయ వర్ధతే. (III-8)

కండ్లను పట్టుకొని వ్రేలాడుతూ ఈ నిద్ర లలాటం మీదనుంచి వస్తూన్నట్లు ఉన్నది. ఇది ముసలితనంవలె కనబడకుండానే ప్రవేశించి మానవుల బలం తగ్గించి వృద్ధి చెందుతుంది.

17. "ఇదానీం విక్రీతపణ్య ఇవ వణిక్ అహం సుఖం స్వప్స్యామి."

ఇంక ఇప్పుడు సరుకులన్నీ అమ్ముడైన వర్తకునివలె హాయిగా నిద్రపోతాను. (అలంకార భాండం చారుదత్తుడనే భ్రాంతితో శర్విలకుని చేతిలో పెట్టిన తరవాత విదూషకు డన్న మాటలివి).

18. శంకనీయా హి లోకేఽస్మిన్ నిష్ప్రభావా దరిద్రతా (III-24)

ఈ లోకంలో శక్తిని క్రుంగదీసే దారిద్ర్యం ఉన్న వానిని అందరూ శంకిస్తారు.

19. స్వైర్దోషైః భవతి హి శంకితో మనుష్యః. (IV-2)
తప్పుచేసిన మానవుడు ఎల్లపుడూ ఉలికిపడుతూ ఉంటాడు.

20. స్త్రియో హి నామ ఖల్వేతా నిసర్గాదేవ పండితాః
పురుషాణాం తు పాండిత్యం శాస్త్రై రేవోపదిశ్యతే. (IV-19)

పురుషులకి పాండిత్యం శాస్త్రం చదువుకుంటే కలగాలి కాని స్త్రీకి మాత్రం సహజంగానే పాండిత్యం ఉంటుంది.

21. "న చన్ద్రాదాతపో భవతి."
చంద్రుని నుంచి ఎండ వస్తుందా?

22. "గణికా హి నామ పాదుకాన్తరప్రవిష్టేవ లేష్టుకా దుఃఖేన పునర్ని
రాక్రియతే"

చెప్పులో రాయిదూరితే తీసివేయడం ఎంత కష్టమో గణికను వదల్చు
కోవడం కూడా అంత కష్టం.

23. జానామి చారుదత్తం వసన్తసేనాం చ సుష్ఠు జానామి
ప్రాప్తే చ రాజకార్యే పితరమప్యహం న జానామి. (VI-16)

నాకు చారుదత్తుడూ తెలుసు, వసంతసేనా తెలుసు. అయితే రాజకార్యం
వచ్చినదంటే నాకు తండ్రియైనా లెక్కలేదు.

24. ఈదృశైః శ్వేతకాకీయై రాజ్ఞః శాసనదూషణైః
అపాపానాం సహస్రాణి హన్యన్తే చ హతాని చ. (IX-41)

రాజశాసనాన్ని దూషించే ఇలాంటి తెల్లకాకులు (బహుశా ఆ రోజులలో
న్యాయస్థానాలలో పనిచేసే వారు తెల్లటి బట్ట ధరించేవారు కాబోలు) ఎంతోమంది
నిరపరాధులను చంపి ఉంటారు; చంపుతున్నారు కూడా.

25. సర్వః ఖలు భవతి లోకే లోకః సుఖసంస్థితానాం చిన్తాయుక్తః
వినిపతితానాం నరాణాం ప్రియకారీ దుర్లభో భవతి. (X-16)

అందరూ సుఖంగా ఉన్నవాళ్ళ విషయం పట్టించుకునే వాళ్ళే; కష్టాలలో
ఉన్న వాళ్ల సంగతి ఎవరూ పట్టించుకొనరు.

26. న ఖలు వయం చాండాలా శ్చాండాలకులే జాతపూర్వా అపి
యేభి భవన్తి సాధుం తే పాపాస్తే చ చాండాలాః. (X-22)

(చారుదత్తుని వధ్యస్థానానికి తీసుకొని వెడుతూన్న చాండాలులు అన్న
మాటలివి). మేము చండాలుల కులంలో పుట్టినా చండాలులం కాము. సత్పురు
షలను పీడించే పాపాత్ములే చండాలులు.

27. ''యోపి కిల శత్రుం వ్యాపాద్యమానం పశ్యతి
తస్యాన్యస్మిన్ జన్మాంతే అక్షిరోగో న భవతి.''

''చంపబడుతున్న శత్రువును చూచిన వానికి జన్మాంతరంలో నేత్రరోగం
ఉండదు'' (ఇది శకారుని శాస్త్రం).

28. శాస్త్రజ్ఞః కపటానుసారకుశలో వక్తా న చ క్రోధనః
తుల్యో మిత్రపరస్వకేషు చరితం దృష్ట్వైవ దత్తోత్తరః
క్లీబాన్ పాలయితా శఠాన్ వ్యథయితా ధర్మ్యో న లోభాన్వితో
ద్వార్భావే పరతత్త్వ బద్ధ హృదయో రాజ్ఞశ్చ కోపాపహః. (IX-5)

"న్యాయాధికారి శాస్త్రజ్ఞుడై ఉండాలి. మోసం కనిపెట్టకలగాలి. వక్త కావాలి. కోప స్వభావవంతుడు కాకూడదు. మిత్రులు, శత్రువులు, తనవారు అందరినీ సమంగా చూడాలి. విషయం తెలిసిన తరవాతనే జవాబు ఇవ్వాలి. దుర్బలులను రక్షించాలి. దుష్టులను శిక్షించాలి. ధర్మబుద్ధి కలిగి ఉండాలి. లోభం ఉండకూడదు. పక్షపాతం లేకుండా నిజాన్ని కనిపెట్టే దృష్టి కలవాడై ఉండాలి. రాజుకు కోపం కలిగించకూడదు."

# అభిజ్ఞాన శాకుంతలము

డా॥ దివాకర్ల వేంకటావధాని

సంస్కృత సారస్వతమున వాల్మీకి వ్యాసుల తరువాత పేర్కొనదగిన మహాకవి కాళిదాసు.

పురాకవీనాం గణనా ప్రసంగే కనిష్ఠికాధిష్ఠిత కాళిదాసా

అద్యాపి తత్తుల్యకవేరభావా దనామికాసార్థవతీబభూవ- మున్నగు శ్లోకము లాతని కవికుల గురుత్వమును చెప్పక చెప్పుచున్నవి. ఒకప్పుడు రాజాస్థాన మందలి యితరకవులసూయాగ్రస్తులై రాజుతో ''కవయః కాళిదాసాద్యాః కవయోవమయప్యమీ'' అని తమ కతనితో కల సమానత్వమును చెప్పుకొని రట. అప్పుడు కాళిదాసో, రాజో, బుద్ధిమంతులు మఱెవ్వరో ''పర్వతే పరమా ణౌచ పదార్థత్వం ప్రతిష్ఠిత'' మ్మనిరట. ఈ పాదము కాళిదాసునకును, అన్య కవులకును పర్వత పరమాణువులకున్నంత భేదమున్నదని తెల్పుచున్నది. వ్యాఖ్యాతృ సార్వభౌముడైన మల్లినాథునంతటి విద్వన్మూర్ధన్యుడు-

కాళిదాసగిరాం సారం కాళిదాసః సరస్వతీ

అథవా చతుర్ముఖో బ్రహ్మ కథం జానన్తి మాదృశాః

అని ప్రశంసించెనన నతని కవితా మహత్త్వమును గూర్చి వేఱుగా చెప్పవలసిన అక్కఱలేదు.

కాళిదాసు దేశకాలములను గూర్చి ఇదమిత్థమని నిశ్చయముగా చెప్పుటకు తగిన ఆధారములు లేవు. అతడు క్రీ. శ. ప్రథమ శతాబ్దిలో నుండెనని కొంద ఱును, గుప్త విక్రమార్కుని కొలువు నందలి నవరత్న కవులలో నొకడగుటచే క్రీ. శ. 4 వ శతాబ్ది యందుండెనని కొందఱును చెప్పుచున్నారు. అట్లే మేఘ సందేశ మందలి యొక శ్లోకమునుబట్టి అతడుజ్జయినీ నివాసియై యుండునని పలువురు తలంచుచున్నారు. కాళిదాసు మొదటనేమియు తెలియని అజ్ఞుడై యుండె ననియు తరువాత కాళికాదేవి అనుగ్రహమున మహాకవియై కాళిదాసుడను సార్థక నామము వహించెననియు చెప్పుదురు. ఇందెంత సత్యమున్నదో తెలి

యదు. కాని అతడు సర్వశాస్త్ర పారంగతుడనియు, అద్వితీయ కవితా విశారదు డనియు నతని రచనలు చదివినవారికి తేటతెల్లము కాకమానదు.

కాళిదాసు రచించిన నాలుగు కావ్యములును, మూడు నాటకములును లోక మున ప్రసిద్ధములై యున్నవి. వానిలో రఘువంశ, కుమారసంభవ, మేఘ సందేశ, ఋతు సంహారములు కావ్యములు. మాళవికాగ్నిమిత్ర, విక్రమోర్వశీయ, అభిజ్ఞాన శాకుంతలములు నాటకములు, ఈ నాటకములలో అభిజ్ఞానశాకుంత లము సంస్కృత వాఙ్మయము నందలి నాటకములలోనే కాక ప్రపంచ వాఙ్మ యము నందలి నాటకము లన్నింటిలో కూడ అగ్రగణ్యమని పేరు వహించినది. అందుచేతనే-

''కావ్యేషు నాటకం రమ్యం నాటకేషు శకున్తలా
తత్రాపి చతుర్థోంకః తత్రశ్లోక చతుష్టయమ్''

అను అభియుక్తిక్తో ఏర్పడినది. రసపాత్ర పోషణము నందును, కథా కథనము నందును, ప్రదర్శనార్హతయందును, భావగంభీరములైన శ్లోకముల రచన యందును, మృదుమధుర భాషా ప్రయోగము నందును, దానికెనవచ్చు నాటకము లెన్నో కనిపింపవు.

అభిజ్ఞాన శాకుంతలమునందలి వస్తువు, శకుంతలా దుష్యంతుల ప్రణయ వృత్తాంతము. ఇందేడు అంకము లున్నవి. హస్తినాపురమును దుష్యంత మహారాజు ఏలుచుండెను. అతడు వేసవిలో మృగయా వినోదార్థమై వనమున కరిగి, వడిగల ఒక జింకచే ఆకర్షింపబడి, దానిని తఱుముచు, పరివారమును వదలి, చాల దూరమేగెను. అతడా జింకపై బాణమును ప్రయోగించుచుండగా సమీపాశ్రమమునందే నివసించు కణ్వముని శిష్యులాతని''ఇది ఆశ్రమ మృగము, బాణము ఉపసంహరింప వలసిన''దని వారించిరి. రాజు వారివాక్యముల మన్నించి బాణమును ఉపసంహరించెను. వారు దుష్యంతుని వర్తనమునకు సంతసించి అతనికి చక్రవర్తి కాగల పుత్రు డుదయింపగలడని దీవెనలిచ్చి ఆశ్రమమునకు వచ్చి ఆతిథ్యము కొనిపోవలసినదని కోరిరి. అప్పుడు కణ్వుడు తన పుత్రికయగు శకుంతల ప్రతికూల దైవమును ఉపశమింపజేయుటకై సోమ తీర్థమున కేగియుండెను. తపోవనమున అతిథిసత్కార మొనరించుటకై, అతడు శకుంతలనే నియోగించెను. దుష్యంతుడు వినీతవేషుడై ఆశ్రమము ప్రవేశింపగనే, అతనికి శుభసూచనలు పొడమెను. అతడాశ్రమమును ప్రవేశించి

నప్పుడు, విస్రంభాలాపము లొనరించుచు, లతావృక్షములకు నీరు పోయుచున్న ముగ్గురు తాపసకన్యలను గాంచెను. వల్కలధారిణులయ్యు అపూర్వ సౌందర్య శోభితలైన వారి రూపమున కబ్బురపడుచు అతడొక తరుచ్ఛాయ నాశ్రయించి, వారి ఆలాపము లాలకించెను. వారి మాటలవలన అతడా కన్యలలో నొకతె కణ్వుని కూతురైన శకుంతల యనియు, మిగిలిన ఇరువురు నామె సఖులగు అనసూయా ప్రియంవదలనియు నెఱింగెను. శకుంతలను చూడగనే అతని కామెపై అనురాగ ముదయించెను. కాని ఆమె బ్రాహ్మణకన్య యేమో అను సందేహము ఆతనిని బాధించెను. అంతలో సలిలసేక సంభ్రమమున ఒక నవమాలికా పుష్పమునుండి ఎగిరి తుమ్మెదఒకటి పద్మమను భ్రాంతితో శకుంతల వదనమున వ్రాలెను. శకుంతల కలవరపడుచూ దాని బారినుండి తన్ను రక్షింపుమని కేకవేసెను. రాజు తాను బయల్పడుటకదియే మంచి తరుణమని యెంచి భ్రమరము నదల్చు నెపమున వారికడ కేగెను. రాజును చూడగనే, శకుంతలయందు ఆశ్రమ విరుద్ధమైన మనోవికారము కలిగెను. అనసూయా ప్రియంవదలు శకుంతల లజ్జితయగుట గాంచి రాజునకు స్వాగతమొసంగిరి. రాజు వారితో సంభాషించుచు అనసూయవలన శకుంతల జన్మవృత్తాంతము నెరింగి, ఆమె క్షత్రియ కన్యయే యగుటచే మనమున నూరట చెందెను. కణ్వు డామెకు వివాహము చేయ నిశ్చయించినాడని తెలిసికొని అతడానందము నొందెను. ఇంతలో వెనుకబడిన రాజసైన్యము ఆశ్రమప్రాంతము చేరుటచే ఆ అలజడి కడవి ఏనుగొకటి ఆశ్రమప్రాంతమును విధ్వంసము చేయుచున్నదని ఎఱింగి మునికన్యలు రాజునొద్ద సెలవు గైకొని వెడలిరి. రాజు ఆశ్రమ రక్షణమునకై అరిగెను.

శకుంతలానురక్తుడగుటచే రాజునకు వేటపై ఆసక్తి నశించెను. అతడు తన సఖుడగు విదూషకునికి (మాధవ్యునికి) శకుంతలను గూర్చియు, ఆమె సౌందర్యమును గూర్చియు చెప్పి, తిరిగి ఆశ్రమము ప్రవేశించి, ఆమెను గాంచుట కేదైన ఉపాయము తెలుపుమని కోరెను. అంతలో ఇద్దరు ముని కుమారులు రాజు కడ కేతెంచి తమ ఇష్టికి విఘ్నమాచరించుచున్న రాక్షసుల బారినుండి తపోవనమును రక్షింపవలెనని వేడిరి. రాజు అందుకు సంతోషముతో అంగీకరించెను. రాజమాత కడనుండి, వచ్చు చతుర్థీ దివసమున పుత్రపిండపారణమను నామము గల ఉపవాసము కాగలదనియు, అప్పుడు రాజు తప్పక దగ్గర ఉండవలెననియు వార్త వచ్చెను. రాజు కర్తవ్యము నాలోచించి రాజమాత పుత్ర

సమానునిగా గారవించు విదూషకుని తనకు బదులుగా రాజధానికి పోవలెనని కోరెను. ఆశ్రమ ప్రశాంతతకు భంగము గలుగకుండ పరివారమును కూడ అతనితో పంపివేసెను. విదూషకుడు వెడలుచుండగా రాజతనితో తాను ఋషుల యందలి గౌరవమువలననే ఆశ్రమమున నుండవలసివచ్చినదనియు, తాపసకన్య యైన శకుంతల యందు తనకు నిజముగా నభిలాష లేదనియు తెల్పెను.

దుష్యంతుడు ఆశ్రమము ప్రవేశించినంతమాత్రమున మునుల సవనము నిరుపద్రవమయ్యెను. శకుంతల మదనసంతప్తయై బాధపడుచుండ సఖులామెను లతామండపమునకు చేర్చి, శీతలోపచారముల నొనరించుచు, ఆమె మనోరథము నెఱింగి అది సఫలమగుటకు మార్గము నన్వేషింప దొడంగిరి. ప్రియంవద సూచన ననుసరించి శకుంతల రాజున కొక ప్రణయలేఖ వ్రాసెను. శకుంతలను చూచు కోరికతో లతామండపమును జేరి కన్యల సంభాషణమును వినుచుండిన రాజు శకుంతల తన్ను ప్రేమించుచున్నదని యెఱింగి, వారి యెదుటి కేగి, తాను కూడ శకుంతలను ప్రేమించుచున్నట్లు తెల్పెను. సఖులు వారిరువురికిని ఏకాంతము కల్పించిరి. రాజు లజ్జాన్వితయైన శకుంతల ననునయించి గాంధర్వ వివాహము క్షత్రియ కులోచితమనియు, పూర్వము పెక్కురు మునికన్యకలు గాంధర్వ వివాహ విధిచే పరిణీతలై తండ్రులచే నభినందింపబడిరని తెల్పి ఆమె నంగీకరింపజేసెను. ఇంతలో వృద్ధతాపసియైన గౌతమి శకుంతల శరీర స్థితిని విచారించుటకై యేతెంచుచున్నదని చెలులన్యాపదేశముగా హెచ్చరిక గావించిరి. శకుంతల రాజును పొదల మాటున కేగుమని పలికెను. గౌతమి యేతెంచి శకుంతల కుశలము నారసి ఆమెను తన వెంట ఆశ్రమమునకు కొని పోయెను. శకుంతల చంద్రోదయ సమయమున పునఃస్సమాగమము కాగలదని రాజునకు వ్యంగ్యముగా తెల్పెను. కలిగిన అంతరాయమునకు రాజు చింతించు చుండ సాయం సవనమునకు రాక్షసోపద్రవము కలిగెనను మునుల మొర విన బడెను. రాజు వెంటనే సవనరక్షకై అరిగెను. తరువాత దుష్యంతుడు శకుంత లను గాంధర్వవిధిచే వివాహమాడెను. వారిరువురును మాలినీ నదీతీరమున కొన్ని దినములు రహస్యముగా విహరించిరి. సవనము నిర్విఘ్నముగా పూర్తి అగుటచే రాజు నగరి కరుగుటకు మును లనుమతించిరి. అతడు శకుంతలకు స్వనామాంకిత మగు ఉంగరము నిచ్చి దానిపైనున్న అక్షరములు రోజున కొకటి చొప్పున లెక్కింప నది ముగించునాటికి తానామె నంతఃపురమునకు పిల్పించుకొనెదనని వాగ్దానము చేసి వెడలిపోయెను.

భర్తృ విరహమున శకుంతల శూన్యమనస్కయై యుండెను. ఆ సమయమున అతిథియై వచ్చిన దూర్వాసుడామె తన్ను తగినట్లు గౌరవింపకుండుట కలిగి ఆమె ఎవరిని గూర్చి తలపోయుచుండెనో అతడామెను మఱచు గాక! యని శాపమిచ్చెను. దూర్వాసుని శాపము వినిన చెలులు మిక్కిలి కలత నొందిరి. ప్రియంవద వేగముగా పోయి మునిని ప్రార్థించి, ఏదేని అభిజ్ఞానమును చూపిన శాపము తీరునని అతడనుగ్రహింపగా రాజిచ్చిన ఉంగరము కలదు గదా యని సంతోషించెను. సఖులీ శాప సమాచారమును శకుంతల కెఱిగింపలేదు. కణ్వమహర్షి సోమతీర్థమునుండి ఆశ్రమమునకు తిరిగి వచ్చెను. అతడగ్నిశరణము ప్రవేశింపగనే శకుంతల వివాహ వృత్తాంతము తెల్పి ఆమె దుష్యంతుని వలన గర్భము ధరించెనని అశరీరవాణి పల్కెను. అంత నతడు పుత్రికను దీవించి భర్తృగృహమునకు పంపుటకు నిశ్చయించెను. అతడు శకుంతలకు అత్తవారింట మెలగవలసిన విధానమును చక్కగా బోధించి గౌతమిని, శార్ఙ్గరవ శారద్వతులనుతోడిచ్చి ఆమె నత్తవారింటికి పంపెను. ఆమె వెడలునప్పుడు అనసూయా ప్రియంవదలు రాజామె యెడ అనాదరమును ప్రకటించినచో అతడిచ్చిన ఉంగరము చూపుమని బోధించిరి. కశ్యపుడు పుత్రికా వియోగమున కలతచెందిన వాడయ్యును, పరార్థమగు కన్యను భర్త కడ కంపుటచే న్యాసమును తిరిగి యిచ్చివేసినట్లూఱడిల్లెను.

దూర్వాసుని శాపము ప్రభావమున రాజు తాను శకుంతలను పరిణయమాడిన వృత్తాంతమును మఱచిపోయెను. గౌతమియును, ఋషి పుత్రులును శకుంతలను రాజుసమక్షమునకు గొనిపోయిరి. శార్ఙ్గరవుడు రాజునకు కాశ్యప సందేశమును వినిపించెను. శాపోపహతుడై శకుంతలను విస్మరించిన రాజు ఆమెను నిరాకరించెను. ఆమె తన దగ్గర నున్న ఉంగరము రాజునకు చూపనెంచెను గాని అది కానరాలేదు. ఉంగరము శచీతీర్థమున స్నానము చేయు సమయమున జారిపోయి ఉండునని గౌతమి తలంచెను. ఋషి పుత్రులు శకుంతలా స్వీకరణ నిరాకరణములను రాజునకే వదలి ఆశ్రమమునకు వెడలిపోయిరి. రాజు పురోహితుని ధర్మసందేహము తీర్పుమని అడిగెను. కార్తాంతికులు దుష్యంతపుత్రుడు చక్రవర్తి లక్షణ సమేతుడగునని నిశ్చయించిరి. కాన శకుంతలను ప్రసవమగునంత వరకు తన ఇంట నుంచుకొందుననియు, జన్మించిన శిశువు చక్రవర్తి లక్షణోపేతుడైనచో రాజామెను పరిగ్రహింప

వచ్చుననియు పురోహితుడుపదేశించెను. తన దీన స్థితికి దుఃఖించుచు పోవుచున్న శకుంతలను స్త్రీ రూపమైన ఒక జ్యోతి ఎత్తుకొని అప్సర స్తీర్థమునకు గొని పోయెను.

ఒకనాడొక జాలరి రాజనామాంకితమగు నంగుళీయకమును అమ్మ జూపుచు రక్షకభటులచే పట్టుపడెను. వాడది తనకు మత్స్య గర్భమున దొరకిన దని చెప్పెను. భటులతనిని రాజు కడకు గొనిపోయి ఆ వృత్తాంతమును విన్న వించిరి. ఉంగరమునుచూడగనే రాజునకు శకుంతలావృత్తాంత మంతయు స్మృతికి వచ్చుటచే అతడు పశ్చాత్తాపముచే పొగులజొచ్చెను. తనకు ప్రియా స్మృతి కలిగించిన జాలరి నతడు బహూకరించి పంపివేసెను. జ్యోతి రూపము ధరించి శకుంతలను గొనిపోయిన మేనక ఆమెను మారీచాశ్రమమున అదితికడ నుంచెను. శకుంతల ఒక మగ శిశువును ప్రసవించెను. మేనక ఆదేశమున నామె సఖియైన సానుమతి హస్తినకు వెడలి శకుంతలా వియోగ దుఃఖితుడై వసంతోత్సవమును నిషేధించిన దుష్యంతుని గాంచి, రాజునకు శకుంతలపై నిశ్చలమైన అనురాగ మున్నందుకు సంతసించెను. వియోగము నందున్నను ఇంద్రునియొద్ద నుండి పిలుపు వచ్చుటచే దుష్యంతుడు దుర్జయ సంహారమునకై మాతలితో స్వర్గమునకు పోవలసి వచ్చెను.

దుర్జయ సంహారము నిర్విఘ్నముగా జరిగెను. దుష్యంతుడు ఇంద్రుని వీడ్కొని మరలివచ్చుచు మార్గమందున్న మారీచాశ్రమమును సందర్శింప గోరెను. ఆశ్రమ ప్రాంత మందాతనికి సింహ కిశోరములతో క్రీడించుచున్న ఒక బాలుడు కనిపించెను. సత్త్వమునుబట్టి ఆ బాలుని కచ్చటి మునులు సర్వ దమనుడని పేరు పెట్టిరి. ఆ కుమారుని యెడ రాజునకు మమతానురాగము లుదయించెను. బాలుని రక్షాకంకణము క్రింద పడగా రాజు దానిని తీయ బోయెను. తండ్రి కానివాడు దానిని తీసినచో అది పామైకరచుననియు వారించి. అంతకుముందు అట్టి దృష్టాంతములు కలిగెననియు తెల్పి తాపసకన్యలతని వారిం చిరి. రక్షాకంకణము పామై తన్ను కఱవని కారణమున సర్వదమనుడు తన పుత్రుడే అని నిశ్చయించి రాజు పరమానందము నొందెను. తాపస కన్యలు కూడ దుష్యంతుడు ఆ కుమారుని జనకుడని గుర్తించిరి. దుష్యంతుడు శకుంతలను కలసికొని తన పశ్చాత్తాపమును తెల్పి క్షమింపుమని కోరెను. తరువాత రాజ దంపతులు అదితి మారీచుల ఆశీర్వాదమును పొంది పుత్రునితో రాజధాని కరిగిరి.

శకుంతలా దుష్యంతుల కథ మహా భారతము నందును, పద్మపురాణము నందును కలదు. రాజునకు శకుంతల జన్మ వృత్తాంతమును ప్రియంవద చెప్పి నట్లును, రాజు హస్తినాపురమున కరుగుచు శకుంతల కుంగరము నిచ్చినట్లును పద్మ పురాణములో నున్నది. దానినిబట్టి కణ్వుడు శకుంతలను హస్తినాపురము నకు పంపునప్పుడామె కేడవనెల. నాటకమున కణ్వుడశరీరవాణివలన శకుంతలా దుష్యంతుల సమాగమ వృత్తాంతము నెఱిగిన వెంటనే ఆమెను హస్తినాపురము నకు పంపెను. పురాణమున ప్రియంవద కూడ శకుంతలతో హస్తినాపురమున కరిగినట్లున్నది. మార్గ మధ్యమున సరస్వతీజలమున స్నానమాడునప్పుడు శకుంతల ఉంగరమును ప్రియంవద కిచ్చెను. అది ఆమె చేతి నుండి నీటిలో పడిపోయెను. ఆ సంగతి ఆమె శకుంతలకు చెప్పలేదు. కొలువున రాజు శకుం తలను నిరాకరించినప్పుడామె ప్రియంవద నుంగరము నిమ్మని అడిగెను. ఆమె మెల్లగానది జలమున పడిపోయెనని చెవిలో చెప్పెను. అది విని శకుంతల చాల కలతపడెను. పై విషయములు తప్ప మిగిలిన కథ యంతయు పద్మపురాణ నాటకములు రెండింట సమానముగానే యున్నది. కాని నాటకమునకు పద్మ పురాణము మూలమని చెప్పజాలము. భారత నాటకములందలి కథలను జోడించి కాళిదాసు తరువాత నెవరో దానిని పద్మ పురాణమున వ్రాసి యుందురని పలు వురు పండితుల అభిప్రాయము.

కాళిదాసు మహాభారతమందలి కథనే అనుసరించినను రసపాత్రశీలౌచిత్య పోషణార్థము కొన్ని మార్పు చేర్పులు చేసియుండెను. మూలకథ ననుసరించి, రాజు వేటాడుచు సేనతో కూడ కణ్వమహర్షి ఆశ్రమము కడకేగి, సేనను బయటనుంచి, తానొక్కడే ఆశ్రమములోని కేగెను. నాటకము ననుసరించి రాజు సేనను విడిచి లేడిని తఱుముచు ఆశ్రమ ప్రాంతమున కరుదెంచెను. ఋషులు ఆశ్రమ మృగముపై బాణము వేయవలదని కోరి అతడట్లు చేసిన పిమ్మట ఆశ్రమమున కరిగి అతిథి సత్కారము స్వీకరింపుమని ఆహ్వానించిరి. ఆ సమయమున శకుంతలయు సఖులును లతావృక్షములకు నీరుపోయుచుండిరి. రాజు వారి సంభాషణము విని, శకుంతల తుమ్మెద బాధ నొందుచున్నప్పుడు వారి ముందుకేగి వారితో మాట్లాడెను. తరువాత సేనవచ్చి ఆశ్రమము సమీప మున అలజడి చేయుచుండగా దానిని శాంతింపచేయుటకై బయటి కరుదెంచెను. మహాభారతమునందు వలె నాటకమున రాజు హఠాత్తుగా నాశ్రమము ప్రవే

శించియుండలేదు. సరిగా మునికన్యలు లతావృక్షములకు నీరుపోయుచుండిన సమయమున ప్రవేశించియుండెను. ఈ ప్రవేశము మిక్కిలి సరసముగా నున్నది.

మూలకథ ననుసరించి రాజాశ్రమమును ప్రవేశించినప్పుడు కణ్వుడు ఫలానయనార్థము వనమున కరిగియుండెను. అందుచే శకుంతలయే రాజునకు స్వాగతము చెప్పి అతడడిగిన పిమ్మట తన జన్మ వృత్తాంతమును స్వయముగా నెఱింగించెను. రాజు వివాహప్రస్తావము తేగా నామె కణ్వుడు వచ్చువఱకును ఆగుమని కోరెను. అప్పుడు దుష్యంతుడు గాంధర్వ వివాహ స్వరూపము చెప్పి, ఆమె నంగీకరింపజేయగా ఆమె తమకు పుట్టిన కుమారుని యౌవరాజ్యమున నభిషిక్తుని చేయవలెనని నియమము పెట్టెను. రాజందు కంగీకరించి గాంధర్వ వివాహమున నభిమతసుఖము లనుభవించి "నిన్ను తోడ్కొని వచ్చుటకు ప్రధాన వర్గమును కణ్వముని కడకు పంపెద"నని పలికి తన పురమున కరిగెను. జవ్వనులైన కన్యలు అపరిచితుడైన పురుషునితో నిట్లు ప్రసంగించుట అస్వాభావికముగా నున్నది. మఱియు నియమమున కంగీకరించి దుష్యంతుడు శకుంతలను వివాహమాడుటయు అంత యుక్తముగా లేదు. ఇది దుష్యంతుని కామపరాయణత్వమును సూచించుచున్నది. అందుచే కాళిదాసు ఇచ్చటి సన్నివేశములను మార్చెను. నాటకము ననుసరించి కాళిదాసు, రాజు శకుంతలా జన్మ వృత్తాంతమును అనసూయా ప్రియంవదల వలన నెఱింగినట్లు రచించెను. ఇది సహజమును, ఉచితమునై యున్నది. కాళిదాసు కణ్వుడు ఫలానయనార్థముకాక శకుంతల ప్రతికూల దైవమును శమింపజేయుటకు సోమతీర్థమున కరిగి యుండెనని తెల్పి, శకుంతలా దుష్యంతుల సమాగమమునకు అవకాశము కల్పించెను. రాజు శకుంతలను విడిచివెళ్ళునప్పు డామెకు అంగుళీయక మిచ్చిన వృత్తాంతము మూలమున లేదు. నాటకమున దీని కపారమైన ప్రాధాన్యము కలదు. దీనిని బట్టియే నాటకమునకు పేరు కూడ పెట్టబడినది.

మహాభారతమును బట్టి కణ్వుడు వనము నుండి ఆశ్రమమున కరుదెంచి శకుంతలా దుష్యంతుల వృత్తాంతము నెఱింగిన పిమ్మట కూడ శకుంతల తొమ్మిదియేండ్లు ఆశ్రమము నందే యుండెను. మూడు సంవత్సరముల తరువాత ఆమె కొక కుమారుడుదయించెను. తరువాత నాఱు సంవత్సరములకు వివాహితయైన కన్య పుట్టినింట నెక్కువ రోజులుండుటుచితము కాదని కణ్వునికి తోచెను. అప్పుడతడు శిష్యులతో సపుత్రకయైన శకుంతలను దుష్యంతుని కడకు పంపెను. నాటకమున కణ్వుడు సోమతీర్థము నుండి రాగానే అగ్ని

హోత్రగృహమున కరిగి అశరీరవాణి వలన శకుంతలా దుష్యంతుల సమాగమము నెఱింగెను. వెంటనే అతడు గౌతమిని శారద్వత శార్ఙ్గరవులను తోడిచ్చి గర్భిణియైన శకుంతలను. దుష్యంతుని కడకు పంపెను.రాజామెను నిరాకరించిన పిమ్మట శకుంతల దుఃఖించుచు నేగుచుండగా జ్యోతి రూపమున మేనక యామెను హేమకూట పర్వతమందలి మారీచాశ్రమమునకు గొనిపోయెను. అచ్చటనే శకుంతల ప్రసవించెను. మూలము నందు వలె శకుంతలను తొమ్మిది సంవత్సరముల వఱకు భర్తకడకు పంపకుండుట ఉచితముగా లేదని కాళిదాసీ మార్పు కావించెను.

మూలము నందు శకుంతల పుత్ర సహితయై కొలువు కరుగ రాజెరిగి యుండియు మఱచిపోయినట్లు నటించి ఆమెను నిరాకరించెను.

శకుంతల నిరాశ నొంది దుఃఖితయై పుత్రునితో కూడ బయటి కరుగుచుండ ఆకాశవాణి శకుంతల పల్కిన పల్కులు సత్యమనియు, రాజామెను వివాహమాడెననియు తెలిపెను. అప్పుడు రాజు ''మేము గాంధర్వ వివాహముచేసి కొనుట ఇతరు లెఱుగకుండుటచే లోకాపవాద భయమున నిజముగా నెఱిగియు, శకుంతల నెఱుగనంటిని. ఇప్పుడాకాశవాణి అందరికిని తెలియునట్లుగా నెఱింగించినది'' అని పల్కి కుమారుని కౌగిలించుకొని, శకుంతలను సంభావించి, తాను మొదట వాగ్దానము చేసినట్లా కుమారుని యౌవరాజ్యమున అభిషిక్తుని గావించెను. ఇందు దుష్యంతుడు శకుంతలను నిరాకరించుటకు లోకాపవాద భయమే కారణముగా చెప్పబడినది. కాని ఈ కారణము అంత బలవత్తరముగా కనబడదు. శకుంతలను నిరాకరించుటయందు దుష్యంతుని కుటిలతయు, హృదయ కాఠిన్యమును వ్యక్తము లగుచున్నవి. నాటకమును బట్టి ఆపన్న సత్త్వయైన శకుంతల రాజు కొలువున కరిగెను. దూర్వాసుని శాపముచే దుష్యంతుడు శకుంతలను మఱచిపోయెను. అందుచే నతడు శకుంతలను నిరాకరించెను. ఈ సన్నివేశమున దుష్యంతుని ధర్మపరాయణతయు, పరస్త్రీ పరాఙ్ముఖత్వమును గోచరించు చున్నవి. బెస్తవాడు తెచ్చిన స్వనామాంకితమైన ఉంగరమును చూడగానే అతనికి పూర్వ వృత్తాంతమంతయు జ్ఞప్తికి వచ్చెను. అతడు శకుంతల యెడ చూపిన కాఠిన్యమున కెంతయో పశ్చాత్తాపపడి తరువాత అనుభవించిన వియోగ బాధ వర్ణనాతీతమైనది. అతడు దానవసంహరణానంతరము తిరిగి మారీచాశ్రమమున సర్వదమనుని చూచెను. తరువాత శకుంతలను కూడ కలసి

కొని తన పశ్చాత్తాపము వెల్లడించెను. కాళిదాసు క్రొత్తగా చేసిన ఈ కల్పన అత్యంత సరసమై రాజును దోషరహితుని కావించుచున్నది. అందుచే దూర్వాసుని శాపమీనాటకమున అత్యంత ప్రాముఖ్యము వహించి యున్నది.

మూలమున లేని క్రొత్త పాత్రల నెన్నిటినో కాళిదాసు నాటకమున ప్రవేశపెట్టి యుండెను. అనసూయా ప్రియంవదలు, గౌతమీ, శారద్వత, శార్ఙ్గరవులు, మాఢవ్యుడు, బెస్తవాడు, సానుమతి మున్నగు వారందఱును, అతడు కల్పించినవారు. ఆఱవ అంకమునందలి సానుమతి పాత్ర ప్రవేశనము మిక్కిలి ప్రశంశనీయమైనట్టిది. ఆమె మేనకచే పంపఁబడి, ఉంగరమును చూచిన పిమ్మట దుస్సహ వియోగము నందుచున్న దుష్యంతుని దర్శించి, అతడు శకుంతలను నిరాకరించుటకు దూర్వాసుని శాపమే కారణముకాని హృదయ కాఠిన్యము కారణము కాదని మేనకకును శకుంతలకును తెల్పెను. ఆ వృత్తాంతము వినగానే శకుంతల కాతని యెడగల కోపము తొలగుటయేగాక అనురాగము జనించుటయు ఆమె అతనితోడి పునఃసమాగమమును కాంక్షించుటయు సంభవించెను. సానుమతి వృత్తాంతము లేనిచో దుష్యంతుడు ఆశ్రమమున కానిపించి తన పశ్చాత్తాపమును వెల్లడించినను ఆత్మాభిమానముచే ఆమె పునఃస్సమాగమునకు అంగీకరించి యుండెడిదో కాదో ! ఈ సన్నివేశమును చూచియే భవభూతి ఉత్తర రామ చరిత్రమున ఛాయా సీతా కల్పన మొనర్చి యుండును. అందు రాముని కామె కన్పడలేదు కాని ఆమె రాముని వియోగ బాధను చూచుచు అతని మాటలను వినుచునే యుండెను. రామునికి తనపై గల అనురాగమెంత దృఢమో ఆమె గ్రహింప జాలెను నిష్కారణముగా తన్ను వనవాసమున కంపిన రాముని యెడ కూడ ఆమెకు సానుభూతి కల్గుటకు ఈ సన్నివేశము ఎన్నో విధముల తోడ్పడినది. ఈ విధముగా అభిజ్ఞానశాకుంతల మందలి సానుమతీ ప్రవేశ దృశ్యమునకును ఉత్తర రామాయణ మందలి ఛాయా సీతా దృశ్యమునకును ఎంతో సామ్యమున్నది. సానుమతి పాత్రవలెనే అనసూయా ప్రియంవదాది పాత్రలును నాటకమున కెంతో వన్నె చేకూర్చినారు. దూర్వాసుని శాపము రాజును కళంకరహితుని కావించినది. మొదటి నాలుగంకములందలి అనసూయా ప్రియంవదల సంభాషణము లతి సరసములై యున్నవి అంగుళీయక వృత్తాంతము చిన్న పొరపాటు కూడ ఎంత గొప్ప ప్రమాదమును తెచ్చి పెట్టునో తెల్పుచున్నది. అదియే నాయికా నాయకుల మనస్సులందు పరస్పరానురాగమును రేకెత్తించెను. నాటకమున విదూషకుని హాస్యప్రసంగములు సహృ

దయ హృదయానంద సంధాయకములుగా నున్నవి. మాతలి విదూషకుని నాక్రమించుట. వియోగ బాధితుడైన రాజు చిత్తవృత్తి యందు, అఖండమైన మార్పు కలిగించినది. అది వియోగము వలన ఉత్సాహ హీనుడైన, దుష్యంతునికి కోపము కలిగించి, రాక్షస సంహారమునకై పురికొల్పినది. చివరి నాల్గంకముల కథ యందును శకుంతల రాజుచే నిరాకరింపబడుట తప్ప మిగిలిన దంతయు కవి కల్పించినదే.

కథా కథనమున కాళిదాసు ప్రదర్శించిన అపూర్వ కౌశలమునకు రెండు మూడు దృష్టాంతములు మాత్రము చూపెదను. ప్రథమాంకమున శకుంతలా దుష్యంతుల సమాగమము భూలోకమందలి కణ్వాశ్రమమున జరిగినది. ఆ ఆశ్రమ మెంత పవిత్రమైనదైనను అచ్చట జరిగిన ప్రణయ కలాప మంతయు లౌకిక కామ కలుషితమైనట్టిదే. చివరి అంకమున శకుంతలా దుష్యంతులకు జరిగిన సమాగమము హేమకూటమందలి మారీచాశ్రమమున జరిగినది. ఈ ఆశ్రమము స్వర్గమునకు సన్నిహితము. ఇచ్చట పశ్చాత్తాపముతో కూడిన పవిత్రమైన అనురాగము గోచరించును. ఈ విధముగా ఆద్యంతాంకము లందలి నాయికా నాయకుల సమాగమములకు మర్త్యామర్త్య లోకములకున్నంత భేదమున్నది.

రాజు కణ్వుడు లేని సమయమున ఆశ్రమమున కరిగి శకుంతలను ప్రేమించెను. తరువాత నామెను కణ్వుని అనుమతి లేకుండనే ఒప్పించి గాంధర్వ విధిచే వివాహమాడెను. గాంధర్వ వివాహము క్షత్రియులకు విహితమే యైనదైనను, రాజు కణ్వుని అనుమతి లేకుండ శకుంతలను కలియుట అతని దోష మనక తప్పదు. అట్లే శకుంతలయు తండ్రి వచ్చిన తరువాత వివాహమాడ వచ్చునని మొదట చెప్పినను మోహాకృష్టయై రాజు మాటలను కాదనజాలక అతనిగూడి గర్భవతి యయ్యెను. తన్ను పెంచి పెద్దచేసిన తండ్రి అనుమతి లేకుండ నామె ఇట్లొనరించుట ఆమె యందలి దోషము. కాళిదాసు వారిరువు రొనరించిన ఈ దోషము ప్రక్షాళించుటకై ఇరువురికిని దుర్భరమైన వియోగ మును కల్పించెను. ఆ వియోగము వట్టి వియోగము కాదు. తపఃకల్పమైనట్టిది ఆ తపస్సుచే వారిరువురును అగ్నితప్తమైన సువర్ణము శ్యామికా రహితమై విశుద్ధ మైనట్లు విగత దోషులై పునస్సమాగమము సౌఖ్యము ననుభవించుట కర్హులైరి. కాళిదాసు కల్పించిన ఈ వియోగ పశ్చాత్తాపములు కడుంగడు ప్రశంసనీయములు.

ద్వితీయాంకమున రాజు శకుంతలా సౌందర్యమును వర్ణించి తన కామె యందుగల అనురాగమును ప్రకటించెను. మరల నతడు తనకు బదులు నగర మున కేగునప్పుడు—

పరిహాస విజల్పితం సఖే
పరమార్థేన నగృహ్యతాంవచః

అని చెప్పియుండెను. విదూషకుడు అది నిజమే అనుకొనెను. లేనిచో రాజు శకుంతలను నిరాకరించినప్పు డతడు అతనికి శకుంతల యెడగల ప్రణయమును జ్ఞాపకము చేసి యుండెడివాడే. అప్పుడు కథ యందలి రామణీయకమునకు భంగము వాటిల్లును. అందుచే కాళిదాసు ముందే జాగరూకత వహించి రాజుచే విదూషకునికి ఆ మాట చెప్పించెను. అయినను అంతమాత్రమున విదూషకుడు మఱచిపోవుట యుక్తియుక్తముగా లేదని కొందరు భావింతురు.

ప్రథమాంకాంతమున రాజును శకుంతలయు సంభాషించుచుండగా వేటలో వెనుకబడిన రాజ సైన్యము ఆశ్రమప్రాంతము చేరెను. ఆ అలజడికి అడవి యేనుగొకటి చెలరేగి ఆశ్రమమును ధ్వంసము చేయుచున్నదని యెఱిగి ముని కన్యలు రాజునొద్ద సెలవు గైకొని వెడలిరి. రాజు ఆశ్రమ రక్షణమునకై వెడల వలసి వచ్చెను. లేనిచో సమాగమ మప్పుడే జరిగి యుండును. రాజెట్లైన మరల నాశ్రమము ప్రవేశించి శకుంతలను జూడ గోరుచుండెను. దాని కుపాయమేమని రాజు విదూషకు నడిగెను. అంతలో ముని కుమారు లరుదెంచి తమ సవనము నకు విఘ్నమాచరించుచున్న రాక్షసుల బారినుండి తపోవనమును రక్షింపగోరిరి. రాజునకు మంచి అవకాశము లభించెను. అతడు తనబదులు విదూషకుని నగరికి పంపి తానచటనే ఉండి పోయెను. లేనిచో కథ సాగుటకు అవకాశము లేదు. తృతీయాంకమున శకుంతల ప్రేమలేఖ వ్రాయుచుండగా రాజామె కడకేగి శకుంతలపై తనకుగల అనురాగమును వెల్లడించెను. సఖులు వారిరువురికిని ఏకాంతము కల్పించిరి. రాజు శకుంతలను గాంధర్వ వివాహమునకొప్పించు చుండ శకుంతల శరీర స్థితిని విచారించుటకై గౌతమి అరుదెంచి ఆమెను తనతో తీసికొని పోయెను. పొదల మాటున దాగియుండిన రాజీ అంతరాయమునకు కలత చెందుచుండ సాయంసవనమునకు రాక్షసోపద్రవము కలిగెనను మొర విని పించెను. రాజు సవనరక్షణకై యరిగెను. తరువాత నతడు శకుంతలను గాంధర్వవిధిని వివాహమాడి కొన్ని దినములు ఆమెతో మాలినీ తీరమున విహ

రించుటకు అవకాశము కలిగెను. శక్రావతార తీర్థమున వ్రేలినుండి అంగుళీయకము జాఱిపోవుట శకుంతల గుర్తించి యుండలేదు.

ఆమె గుర్తించి యుండినచో కథాగమనమునకు భంగము వాటిల్లియుండెడిది. రాజు రాక్షస సంహారము గావించి తిరిగి వచ్చుచుండ మారీచాశ్రమమున కరుగుటయు, నతడు సింహకిశోరములతో క్రీడించుచున్న సర్వదమనుని గాంచుటయు సంభవించెను. రక్షాకంకణ కల్పనము అద్భుతముగా నున్నది. దానిని బట్టియే రాజు సర్వదమనుడు తన కుమారుడని గుర్తించుటయు తరువాత శకుంతలను కలయుటయు సంభవించెను. పంచమాంకమున రాజు హంస పదిక పాడిన పాట వినెను. అతనికి మనసున నేదో ఆందోళనము చెలరేగెను. దూర్వాసుని శాపముచే నతడు శకుంతలా విషయమును మఱచిపోయెను. షష్ఠాంకము నందలి ధనవృద్ధియను వణిజుని వృత్తాంతమును విని రాజు, అనపత్యతాదోషమును గూర్చి విచారించెను. పిమ్మట "సంపన్నుడైన ఆ వర్తకునికి బహు భార్యలుండవచ్చును. వారిలో నెవతెయైన గర్భిణియై యున్నదేమో తెలిసికొను" మని పలికెను. ప్రతీహారి ధనవృద్ధి భార్యలలో నొకతెయైన సాకేతశ్రేష్ఠి దుహిత నిర్వృత్త పుంసవనయైనట్లు తెలిసినదని తెల్పెను. రాజంత నాగరశ్రేష్ఠ సంతానమునకే పైతృకమైన ఆస్తి చెందవలెనని ధర్మ నిర్ణయము కావించెను. ఈ విషయమెట్టి స్థితిలో నున్నను. దుష్యంతుడు ధర్మము నుపేక్షింపడని తెలుపుచున్నది. పై కల్పన లన్నియు కాళిదాసు బుద్ధి వైభవమును, నాటక నిర్మాణ మర్మ కౌశలమును తెల్పుచున్నవి.

చతుర్థాంకమున నాశ్రమ వాతావరణమును, పంచమాంకమున రాచకొలువును చక్కగా వర్ణింపబడినవి. మొదటిది నిష్కపటము, నిర్మలమును, పవిత్రమునైనట్టిది. అందెచ్చట చూచినను హార్దమైన యనురాగమును అలౌకికమైన సానుభూతి సంపదయు కనిపించును. అచేతనములైన లతావృక్షాదులును ముగ్ధములైన మృగపక్ష్యాదులును ప్రేమామృతమును వర్షించుచుండును. రాజు కొలువట్టిదికాదు. అందు మాయా కపటాసత్యములు ప్రత్యక్షములగును. తాను గాంధర్వవిధిచే వివాహమాడిన కాంతయే గర్భిణియై వచ్చి యెదుట నిల్చి "నీవు నన్ను వివాహమాడితివి, గ్రహింపు" మని వేడుచుండ రాజేమియు నెఱుంగ ననియు, నామె అసత్యము పల్కుచున్నదనియు తెల్పి నిరాకరించెను. ఈ నిరా

కరణమునకు కారణమున్న మాట నిజమే, కాని యందు కపట కాఠిన్యములు కనిపించును. ఈ భేదమునే కాళిదాసు శారద్వత శార్ఙ్గరవులచే ననిపించిన మాటలలో సూచించెను. జనాకీర్ణమైన పురము శార్ఙ్గరవునికి హుతవహపరీతమైన గృహమువలె కనిపించెను. శారద్వతుడు పురమును ప్రవేశింపగనే

అభ్యక్తమివ స్నాతః శుచిర శుచిమివ ప్రబుద్ధ ఇవసుప్తం
బద్ధమివ స్వైరగతి ర్జన మిహసుఖ సంగిన మవైమి (5-12)

అని పల్కియుండెను.

**చతుర్థాంకము వైశిష్ట్యము:-** అభిజ్ఞాన శాకుంతలమునకాయువు పట్టిన దూర్వాసుని శాపవృత్తాంతము చతుర్థాంకారంభములో విష్కంభమున చెప్పబడినది. కాళిదారచ్చట శాంతులైన ఇతని ఋషులను కాక సులభకోపుడైన దూర్వాసుని ప్రవేశపెట్టుటలో నపారమైనలోకజ్ఞతను సూచించియున్నాడు. ప్రియంవద దూర్వాసుని పాదములపైబడి ఆభరణాభిజ్ఞాన దర్శనముచే శాపము నివృత్తమగునని అతని అనుగ్రహమునుగూడ పొంది వచ్చినది. ఇచ్చటనే సుప్తోత్థితుడైన శిష్యుడు కణ్వాదేశముచే వేళను పరికించుటకు వచ్చి-

యాత్యేకతోఽస్త శిఖరం పతిరోషధీనా
మావిష్కృతోఽ రుణ పురస్సర ఏకతోఽర్కః
తేజోద్వయస్య యుగపద్వ్యసనోదయాభ్యామ్
లోకోనియమ్యత ఇవాత్మ దశాంతరేషు

అని చంద్రాస్తమయమును, సూర్యోదయమును సూచించెను. చంద్రసూర్యులలో నొకరస్తమించుటయు, నింకొకరు ఉదయించుటయు లోకమునందలి జనులు దుఃఖము, సుఖము అను దశలను పర్యాయమున పొందుదురని సూచించుచున్నట్లున్నవని అతడు తెల్పుట శకుంతల ముందు దుఃఖమును తరువాత సుఖమును పొందునని సూచించుచున్నది. ఈ అంశమున కవి జడాజడ ప్రకృతిని సమానమైన దృష్టితో చూచి యుండెను. శకుంతల అత్తవారింటికి పోవుచుండగా కణ్వుడును, అనసూయా ప్రియంవదలును మాత్రమే కాక లతలును, వృక్షములును, లేళ్ళను పక్షులును కూడ వియోగ దుఃఖమును అనుభవించినవి. ద్వంద్వాతీతుడై కణ్వముని కూడ-

యాస్య త్యద్య శకున్తలేతి హృదయం సంస్పృష్ట ముత్కంఠయా
కంఠః స్తంభిత బాష్పవృత్తి కలుష శ్చింతాజడం దర్శనం
వైక్లబ్యం మమ తావ దీదృశమపి స్నేహాదరణ్యౌకసః
పీడ్య న్తే గృహిణః కథంను తనయా విశ్లేష దుఃఖైర్నవైః.

అని దుఃఖించి యుండెను. అతడు శకుంతలను, నవమాలికను సమాన మైన దృష్టితోనే చూచెను.

సంకల్పితం ప్రథమయేవ మయా త్వదర్థం
భర్తార మాత్మసదృశం సుగుణైర్గతాసి
చూతేన సంగతవతీ నవమాలికేయం
అస్యామపి త్వయిచ సంప్రతి వీత చింతః

అని పల్కెను. శకుంతల ఆత్మ సదృశుడైన వరుని పొందుట అతనికి ఎంత సంతోషము కలిగించెనో నవమాలిక చూతముతో సంగమించుట కూడ అతని కంతే సంతోషము కలిగించెను. శకుంతల శిష్యాదులతో వెడలుచుండగా కణ్వుడు - ''పాతుంన ప్రథమం వ్యవస్యతి జలం యుష్మాస్వపీతేషుయా'' అను శ్లోకమున శకుంతల పతి గృహ గమనము ననుమతింపుమని లతలను కూడ కోరియుండెను. అప్పుడు కోకిల శబ్దము వినిపించెను. శార్ఙ్గరవుడు-

''అనుమత గమనా శకున్తలా తరుభిరియం వనవాస బంధుభిః
పరభృత విరుతం కలం యతః ప్రతివచనీకృతమేభి రాత్మనః''

అని తరువులు కోకిల శబ్దము నెపమున తమ అంగీకారమును తెలుపు చున్నవని పల్కెను. అనసూయా ప్రియంవదలు శకుంతలకు ఉచిత మండనము కావించిరి. ఆమె వెడలుచుండగా హారీతుడు శకుంతల కొరకై చెట్లనుండి కుసు మాదులను తెచ్చుచు-

''క్షౌమం కేనచి దిందుపాండు రుచినా మాంగల్య మావిష్కృత'' మ్మను శ్లోకమున ఒక చెట్టు పట్టువస్త్ర ద్వయము నొసగెననియు, నింకొక చెట్టు చరణోపరాగ సుభగమైన లాక్షారసము నొసగెననియు, వనదేవతలు ఆ పర్వ భాగోత్థితములైన కరతలములచే ఆభరణముల నొసంగిరనియు తెల్పియుండెను. దీనినిబట్టి జడములైన వృక్షములకును, అదృశ్యులైన వనదేవతలకును కూడ శకుంతల యెడ ఎంత ప్రేమ కలదో వ్యక్తమగుచున్నది.

ఉద్గాళ్ణ దర్భకబలా మృగా పరిత్యక్త నర్తనామయూరాః
అపశృత పాండుపత్రా ముంచ త్యశ్రూణీవ లతాః

అని ప్రియంవద మృగములును, నెమిళ్ళును, లతలును శకుంతల వియోగ శోకమును ఎట్లు వహించుచున్నవో తెల్పియుండెను. శకుంతల ''ఆర్య పుత్ర దర్శనోత్సుకనై నను ఆశ్రమ పదమును పరిత్యజించుచున్న నా చరణ ములు అతి దుఃఖముచే ముందుకు సాగకున్న''వని పలుకగా ప్రియంవద "నీవు మాత్రమే తపోవన విరహకాతరవు కావు. నీ వియోగమువలన తపోవనము కూడ నెట్టి అవస్థను పొందుచున్నదో చూడు"మని పై శ్లోకమున చెప్పెను. శకుంతల అనసూయా ప్రియంవదల నెట్లు చూచెనో ఆశ్రమము నందలి లతలను కూడ అట్లే చూచెను. వెడలునప్పుడామె లతలను చూచి "నేటి నుండి నేను మీకు దూరవర్తినినగుచున్నాను. నన్ను మీ శాఖాబాహువులతో కౌగిలించుకొను"డని పల్కి తండ్రితో "తాత! అహమివత్వయా చిన్తనీయా" అని, లతను కూడ తన వలెనే చూడమని ప్రార్థించియుండెను. ఆమె వెడలుచు గర్భభార మంధరయైన మృగ వధువు సుఖ ప్రసవమైనపుడు మరచిపోక తనకు ఆ శుభవార్త తెలుపు మని తండ్రిని వేడియుండెను. ఒక లేడి పిల్ల శకుంతల వెడలుచుండగా ఆమె చీర చెంగును నోటితో లాగుచు ననుసరించెను. దానిని శకుంతల పుత్రునివలె పెంచి యుండెను. అనసూయా ప్రియంవదలతో నామె "మాధవీ లతను మీ ఇరువురి హస్తములందుంచుచున్నా"నని పల్కగా వారు "అయంజనః ఇదానీం కస్యహస్తే సమర్పితః" అని శోక బాష్పములను విడువదొడంగిరి. కణ్వుడంత వారిని ఊరడించెను. ఈ విధముగా కాళిదాసు చతుర్థాంకమున ఆశ్రయము నందలి జడాజడ ప్రకృతి నంతను పవిత్ర ప్రేమ మయముగా కల్పించి యుండెను. శకుంతల పతి గృహమున కరుగుట సంతోష విషయమేయైనను అది ఆశ్రమ మున కంతటికిని వియోగ దుఃఖమును కల్గించి ఆ సన్నివేశమును కరుణ రస నిర్భరము కావించెను.

కణ్వుడు ద్వంద్వాతీతుడైన మహర్షి అయినను శకుంతల వెడలునప్పు డాతడు దుఃఖమును ఆపుకొనజాలకపోయెను. ఋషులు కూడ హృదయవంతు లైన మానవులే కదా! అతని లోకజ్ఞత అపారమైనది. శకుంతల అత్తవారింట మెలగవలసిన విధము నంతను అతడు ''శుశ్రూషస్వ గురూన్ కురు ప్రియసఖీ వృత్తిం సపత్నీజనే'' అను శ్లోకమున బోధించి యుండెను.

"అస్మాన్ సాధువిచిన్త్య సంయమధనా నుచ్చైఃకులం చాత్మనః
త్వయ్యస్యాః కథమప్యబాంధవ కృతాం స్నేహ ప్రవృత్తించ తామ్

సామాన్య ప్రతిపత్తి పూర్వక మియం దారేషు దృశ్యాత్వయా
భాగ్యాయత్త మతఃపరం నఖలు తద్వాచ్యం వధూబంధుభిః"

అని కణ్వుడు దుష్యంతునికి పంపిన సందేశము భావగర్భితమై అద్భుతముగ నున్నది. అది సామాన్య సందేశమువలెనే కాక ఒక విధమైన మందలింపుగ కూడనున్నది. కణ్వుడు శకుంతల పోవుచుండగ దుఃఖించిన మాట నిజమే.

"శమమేష్యతి మే శోకః
కథంను వత్సే త్వయా రచిత పూర్వమ్
ఉటజ ద్వార నిరూఢం
నీవారబలిం విలోకయతః."

(వత్సా, నీవు ప్రతి దినమును ఉటజద్వారమునందు వేయుచుండిన బలిరూపమైన నీవార ధాన్యము మొక్కలుగా మొలిచినప్పుడు చూచుచు నా శోకము ఎట్లుపశమించును) అని పల్కుట అతని హృదయము నందలి ఉత్కంఠా విశేషమును సూచించుచున్నది. శకుంతల "తపశ్చరణ వ్యాపారేణ నిరుత్కంఠః తాతః. అహం పునరుత్కంఠా భాగినీ సంవృత్తా" అని పల్కినప్పుడాతడు "వత్సే మామేవం జడీకరోషి" అని నిట్టూర్పు విడిచి యుండెను. ఇంత దుఃఖమును పొందినవాడు శకుంతల ఆశ్రమ పదమును విడువగానే-

"హన్త భో శకున్తిలాం పతి గృహే విసర్జ్య లబ్ధ మిదానీం స్వాస్థ్యం-"
అర్థోఽపి కన్యా పరకీయ ఏవ తామద్య సంప్రేష్య పరిగ్రహీతుః"
జాతోమయాయం విశదప్రకామం
ప్రత్యర్పితంన్యాస ఇవాంతరాత్మ త్తెను

అని పల్కియుండెను. ఇది సాధారణ మానవులకును, సర్వసంగపరిత్యాగులైన మునులకును గల భేదమును తెల్పుచున్నది. సామాన్యులు దుఃఖమును చిరకాలమనుభవింతురు. ఋషులు తాత్కాలికముగా కొంత దుఃఖము ననుభవించినను వెంటనే స్వస్థచిత్తులై తపోనుష్ఠానములందు ప్రవృత్తులగుదురు.

## నామౌచిత్యము

అభిజ్ఞాన శాకుంతల మను సమాసము విగ్రహమును గురించి పలువురు పలువిధములు వ్రాసియున్నారు. ''అభిజ్ఞానేన స్మృతా శకున్తలా యస్మిన్ తత్'' అని కొందఱును, ''అభిజ్ఞానం చ శకున్తలాచ అభిజ్ఞాన శకున్తలే, తే యస్మిన్ తత్'' అని కొందఱును పై సమాసమునకు విగ్రహము తెల్పియున్నారు. అభి

జ్ఞాన మనగా చిహ్నము. రాజు శకుంతలను విడిచి వెళ్ళునప్పుడు స్వనామాంకిత మైన అంగుళీయమును ఆమె కొసంగి-

"ఏకైక మత్ర దివసే దివసే మదీయం
నామాక్షరం గణయ గచ్ఛసి యావదస్తం
తావత్ ప్రియే మదవరోధ నిదేశవర్తీ
నేతాజనస్తవ సమీప ముపైష్యతీతి"

అని చెప్పి వెడలిపోయెను. కణ్వుడు వచ్చిన పిమ్మట అశరీరవాణి వలన శకుంతలా దుష్యంతుల సమాగమము నెఱింగి గౌతమిని శిష్యులను తోడిచ్చి ఆమెను రాజుకడకు పంపెను. శూన్యహృదయయై యుండిన శకుంతల దూర్వాసుఁడు ఆశ్రమమునకు వచ్చినప్పుడు అతనికి తగిన సత్కారము లాచరింపని కారణమున నత డాగ్రహించి ఆమె ఎవరిని గూర్చి ఆలోచించుచుండెనో అతడు ప్రబోధితుఁడైనను ఆమెను విస్మరించుగాక యని శపించి వెడలిపోయెను. ప్రియంవద కోపముతో వెడలుచున్న దూర్వాసుని అనునయింపగా అతడు అభిజ్ఞానాభరణమును చూపినచో రాజామెను గుర్తింపజాలునని చెప్పెను. శకుంతల రాజు కొలువున కరుగుచుండగ రాజిచ్చిన యుంగరము శక్రావతార తీర్థమున పడిపోయెను. శకుంతల దానిని గుర్తింపలేదు. కొలువున కేగిన పిమ్మట రాజు శాప ప్రభావమున జరిగిన దానిని విస్మరించియుండుటచే శకుంతలను నిరాకరించెను. ఆశ్రమము వెడలునప్పుడు సఖు లొకవేళ రాజు గుర్తింపనిచో నుంగరమును చూపుమని తెల్పిన కతమున శకుంతల ఉంగరమునకై వెదకెను. అది కనపడలేదు. రాజనిరాకృతయై దుఃఖించుచు నామె వెడలిపోవుచుండగా జ్యోతి రూపమున మేనక యామెను గ్రహించి మారీచాశ్రమమున విడిచెను. అచ్చట నామె ఒక మగశిశువును ప్రసవించెను. శకుంతల చేతినుండి జాఱిన ఉంగరమును ఒక చేప మ్రింగెను. దానిని పట్టుకొనిన బెస్తవాడు చీల్చి చూడగా నుంగరము కనిపించెను. అతడు దాని నమ్మబోవుచుండ రాజభటులు అతనిని బంధించి రాజుకడకు గొనిపోయిరి. రాజునకు ఆ ఉంగరము చూడగనే పూర్వ కథ స్మృతికి వచ్చెను. అతడెంతో పశ్చాత్తాపపడి వియోగబాధ ననుభవించెను. తరువాత నత డింద్రుని కోరికపై రాక్షస సంహారముకొఱ కరిగి తిరిగివచ్చుచు మారీచాశ్రమమున సింహముతో క్రీడించుచున్న సర్వదమనుని చూచెను. తరువాత శకుంతలను కలసికొని తన పశ్చాత్తాపమును వెల్లడించెను. శకుంతల

సానుమతివలన సర్వము నెఱింగి ఉండుటచే అతడు నిర్దోషియని యెఱింగి అతనితో సపుత్రకయై రాజధాని కరిగెను. ఈ విధముగ అభిజ్ఞానముచే రాజు శకుంతలను గుర్తించుట సంభవించెను. అందుచే నీ నాటకమున కా పేరు వచ్చినది.

నాటకమునకీ పేరేర్పడుట కింకొక కారణము కూడ కలదు. "అభిజ్ఞానే నజ్ఞాతం శాకున్తలం (శకున్తలా కుమారం) అధికృత్య కృతం నాటకమ్" అని ఇంకొక విధముగా సమాసమునకు విగ్రహము చెప్పవచ్చును. శాకుంతలు డనగా శకుంతల కుమారుడు. రాజు మారీచాశ్రమమున సర్వదమనుని చూచినప్పుడాతని చేతినుండి తాయెత్తు క్రింద పడెను. దానిని రాజు తీసెను. తండ్రి కానివాడు దానిని తీసినచో అది పామై కఱచునని అచ్చటి వారు తెల్పిరి. అది పామై తన్నుకఱవని కారణమున రాజా బాలుడు తన కుమారుడేయని గుర్తించెను. తరువాత శకుంతల కడకేగెను. ఈ విధముగా కూడా నాటక నామము సార్థక మగుచున్నది కాని అంగుళీయక వృత్తాంతము చేతనే నాటకమున కాపేరు వచ్చినదని లోకమున పలువురు తలంచు చున్నారు.

**అభిజ్ఞాన శాకుంతల మందలి రసము :** నాటకమున శృంగార వీరము లలో నొకటి అంగిరసముగ నుండవలెననియు, మిగిలిన వంగరసములుగ నుండ వచ్చుననియు, నాటకాంతమున అద్భుతముండ వలెననియు లక్షణము చెప్పు చున్నది. ఈ నాటకమున శృంగార రసమే అంగిరసము. ప్రథమ ద్వితీయాంక ములలో అయోగ శృంగారమున్నది. తృతీయాంకమున సంభోగమును పంచమ షష్ఠాంకములయందు వియోగమును గోచరించుచున్నవి. సప్తమాంకమున శకుంతలా దుష్యంతులకు పునస్సమాగమమైనది. ఈ విధముగా నిందు సంభోగ శృంగారమే అంగి, విప్రలంభ శృంగార మంగము. దీనితోపాటు హాస్య, కరుణ, బీభత్స, భయానక, వీర, రౌద్రాద్భుతములు కూడ నాయా సందర్భము లందంగరసములుగా గోచరించుచున్నవి. చతుర్థాంకమున శకుంతల అత్తవారింటికి వెళ్ళునప్పుడు కణ్వుడును అనసూయా ప్రియంవదాదులును మాత్రమే కాక లతా వృక్షములును తిర్యక్కులును కూడ దుఃఖించినవి. రాజుచే నిరాకరింపబడినప్పుడు శకుంతల పొందిన దుఃఖమునకు మేరలేదు. అంగుళీయక దర్శనానంతరము రాజు పొందిన వియోగమునకరుణముకూడ మిశ్రితమైయున్నది. ద్వితీయాంకమున రాజు వేటయందుత్సాహముచూపెను. ఉత్సాహము వీరరసమునకు స్థాయి. అందుచే అచ్చట వీరరసమున్నదని చెప్పవచ్చును. విదూషకుని మాటల

యందును; అనసూయా ప్రియంవదా శకుంతలల సంభాషణము నందును, ఎడనెడ హాస్యము గోచరించుచున్నది. అడవి యేనుగు రాజు సైన్యము అలజడికి కలిగి ఆశ్రమమును ధ్వంసము చేయ గడంగునప్పుడును, రాక్షసులు మునుల సవనమునకు విఘ్నము కలిగించునప్పుడును బీభత్స, భయానకములున్నవి. దుర్వాసుడు శకుంతలపై నాగ్రహించునప్పుడును, శకుంతలపై నాగ్రహించు నప్పుడును శకుంతల రాజుపై కోపము ప్రదర్శించునప్పుడును, మాతలిభూతమై విదూషకునాక్రమింప రాజాతని సంహరింప గడంగునప్పుడును రౌద్రము వ్యక్త మగుచున్నది. చతుర్థాంకము చివరను సప్తమాంకమునను శాంతరసచ్ఛాయ లున్నవి. రాజు రక్షాకవచము గ్రహించినప్పుడు అది పామై కఱవకుండుటచే నెల్లరును దుష్యంతుని సత్యస్వరూపమును గ్రహించిరి. అచ్చట అద్భుత రసము విశదమగుచున్నది. ఈ విధముగ శాకుంతల నాటకము శృంగార రస ప్రధాన మయ్యు నవరస శోభితమై విరాజిల్లుచున్నది.

**శాకుంతల మందలి పాత్ర పోషణ :-** కాళిదాసు పాత్ర పోషణమున కృతహస్తుడు. ఆతడు నాయికా నాయకుల పాత్రలనే కాక ఇతర పాత్రలను కూడ యథోచితముగా పోషించియుండెను. మొదటి మూడంకముల యందును రాజు కాముకుడుగా గోచరించినను ఆతనియందు ధర్మప్రియత్వమును, గురుజన భక్తియు కానిపించును. కాళిదాసు దూర్వాసుని శాపమును, అంగుళీయక వృత్తాంత మును సృష్టించి కణ్వుని అనుమతి లేకుండగనే దుష్యంతుడు శకుంతలతో ప్రణయ వ్యాపారమును సాగించుట యందును శకుంతలను గాంధర్వవిధిచే పెండ్లియాడి నామెను నిరాకరించుట యందును, ఆతడు కావించిన అపరాధమును తొలగించి అతనిని నిర్దోషిని కావించెను. పంచమాంకమున రాజు పరస్త్రీ పరాఙ్ముఖుడుగను ధర్మైక పరాయణుడుగను గోచరించును. ఉంగరము కనబడిన తరువాత పొందిన పశ్చాత్తాపము, అతడు ముందొనరించిన పాపమును ప్రక్షాళించి అతనిని విశుద్ధాత్మునిగా వ్యక్తము చేయుచున్నది. ధనవృద్ధి యను వైశ్యుని విషయమున రాజు కావించిన తీర్పుకూడ అతని ధర్మ పరిపాలన తత్పరత్వమును ప్రకటించు చున్నది. రాక్షస సంహారమునకు ఇంద్రుడాతని సాహాయ్యమును కోరుట అతని అసాధారణ ధైర్య పరాక్రమములకు తార్కాణము. ప్రథమాంకమున నతడు మునుల వాక్యమును మన్నించి లేడిపై బాణము నేయకుండుటయు, కణ్వాశ్రమము నుండి వచ్చిన తాపసులను గౌరవించిన క్రమమును, పురోహితుని వచనముల యందు చూపిన విశ్వాసమును, దుర్జయ సంహారానంతరము తిరిగి వచ్చుచు

హేమకూటము నందలి మారీచ దంపతులను చూడనెంచుటయు, అతనికి మునుల యెడను, పెద్దల యెడను గల భక్తిని విదిత మొనరించుచున్నది. ఉపవాస సమయమున తన్ను రమ్మని రాజమాత కబురంపగ నతడు తనకుబదులు విదూషకుని నగరమునకు పంపెను. ఇది అతని మాతృభక్తిని చాటుచున్నది. అతడు మృగయాప్రియుడు, సరస సంభాషణ కుశలుడు, రూపవంతుడు. ఈ విధముగ నతనియందు ధీరోదాత్త లక్షణము లన్నియు గోచరించుచున్నవి.

శకుంతల అపార సౌందర్య నిధానము. "చిత్రే నివేశ్య పరికల్పిత సత్వ యోగా" అను శ్లోకమామె సౌందర్య పరాకాష్ఠను ప్రకటించుచున్నది. వల్కలములను ధరించినను ఆమె అలౌకిక సౌందర్యముతో విరాజిల్లు చుండెను. అందుచేతనే దుష్యంతుడు "కిమివహి మధురాణాం మండనం నా కృతీనా" మ్మని పల్కియుండెను. దుష్యంతుడు గాంధర్వ విధి వివాహము సూచించి నప్పుడు ఆమె కణ్వుడు వచ్చువరకు వేచియుండుమని రాజును ప్రార్థించెను. తరువాత నాతని మాట కాదనజాలక గాంధర్వ వివాహమున కంగీకరించి సమాగమ సౌఖ్యము ననుభవించెను. ఇది నిజముగా నామె కావించిన దోషమే. కాని కాళిదాసు చివర కామెను తీవ్రవియోగము ననుభవించునట్లు చేసి ఆ వియోగ తపస్సుచే ఆమె దోషమును ప్రక్షాళించి వైచెను. ఆశ్రమవాసిని యయ్యును ఆమె సమయానుకూల వర్తనము నెఱింగిన ధీమంతురాలు. గౌతమి వచ్చుచున్నదని సఖులు తెల్పినప్పు డామె రాజును పొదలమాటున దాగు కొనుమని పంపి మరల చంద్రోదయ సమయమున పునఃదిస్సమాగమ మగునని వ్యంగ్యముగ తెల్పెను. సప్తమాంకమున దుష్యంతుడు పశ్చాత్తాపము వెలిబుచ్చి నప్పుడు అతనిని మన్నించి అతనితో రాజధాని కరిగెను. సఖులైన అనసూయా ప్రియంవదలయెడను, ఆశ్రమము నందలి లతావృక్ష పక్షిమృగముల యందును ఆమె చూపిన అనురాగము అప్రతిమానమైనది. అట్లే కణ్వునియెడ నామె అపారమైన భక్తిని ప్రకటించెను. అతనిని విడువలేక విడువలేక ఆశ్రమమును విడిచి అరిగెను. దుష్యంతుడు తన్ను నిరాకరించి నప్పుడామె అతనిని ధర్మకవచమును ధరించి తృణచ్ఛన్న కూపమువలె నుండెనని సక్రోధయై పల్కెను. ఇచ్చట నామె చూపిన కోపమునకు కారణము లేకపోలేదు. అతడు తన్ను వివాహమాడియు తన్నెఱుగనట్లు నటించుచుండెనని ఆమె భావించెను. శాప విషయ మామెకు తెలియదు. ఈ విధముగ శకుంతల యందు సౌందర్య, సౌశీల్యానురాగ నిష్కాపట్యాది గుణము లెన్నో గోచరించుచున్నవి.

కణ్వుడు నిస్సంగు డయ్యును శకుంతలను అత్తవారింటికి పంపవలసి వచ్చినప్పుడు మిక్కిలి దుఃఖించెను. ఆశ్రమము నందలి లతలను శకుంతలను అతడు సమాన భావముతోనే చూచెను. వెడలు నప్పుడు శకుంతలకు బోధించిన నీతులును, రాజునకు పంపిన సందేశమును అతని లోతజ్ఞతను చాటుచున్నవి. పెంచి పెద్దగ చేసిన కూతునెడ అతడెంత ప్రేమ చూపినను ఆమె ఆశ్రమ ప్రాంతమును వీడగనే ''అర్థో హి కన్యా పరకీయ యేవ'' అని భావించి స్వస్థ చిత్తుడై మరల తపోఽనుష్ఠానమున కుపక్రమించెను. సంగము నుండి అసంగ మున కిట్లు మఱలుట కణ్వుని వంటి మహామునులకు తప్ప ఇతరులకు సాధ్యము కాదు. అనసూయా ప్రియంవదలు శకుంతల యెడ చూపిన అనురాగము ఇంతింతన రానట్టిది. తాపస కన్యోచితములైన గుణము లన్నియు వారి యందు గోచరించును. దూర్వాసునకు కోపముతో వెడలిపోవుట చూచి ప్రియంవద అతని ననునయించి అనుగ్రహమును పొంది వచ్చెను. శకుంతల తమ్ముఁ విడిచి అత్త వారింటి కేగునప్పుడు వారు మిక్కిలి దుఃఖమును ప్రదర్శించిరి. దుర్వాసుడు సులభకోపి విదూషకుడు భోజన ప్రియుడు, భీరువు. రాజునెడ అపారమైన భక్తి స్నేహములు కలవాడు. రాజు శకుంతల యెడ చూపిన అనురాగము నెఱింగియు అతడు పంచమాంకమున నా విషయము తెల్పకుండుటకు నెఱింగియు రాజు ద్వితీయాంకాంతమున మాటలను విశ్వసించుటయే కారణము. అతడు అమాయకుడయ్యును హాస్య సంభాషణమునందు పరమ నిపుణుడు. నర్మసఖు డగుటచే రాజున కాయా సందర్భములందు తగిన ఉపాయములను బోధించుట యందాతడు నేర్పరి. ఈ విధముగ కాళిదాసు శాకుంతలమందలి ప్రధానా ప్రధాన పాత్రల నన్నిటిని పరమ కౌశలముతో చిత్రించెను.

## శాకుంతలమునాటి సాంఘికాది పరిస్థితులు

శాకుంతల నాటకమునుబట్టి అప్పటి సాంఘికాది పరిస్థితులు కొన్ని తెలియవచ్చుచున్నవి. రాజులయందును, వైశ్యులయందు బహుభార్యత్వ విధాన మున్నట్లు కన్పించును. పంచమాంకము నందలి హంసపదికాదుల విషయమును, ధనవృద్ధి అను వైశ్యుని విషయమును ఇందుకు సాక్ష్యములు. క్షత్రియులు గాంధర్వవిధిని వివాహ మాడుచుండిరనుటకు దుష్యంతుడు ఆశ్రమమున శకుం తలను గాంధర్వ వివాహము చేసికొనుటయే తార్కాణము. అప్పుడు అనులోమ వివాహములేకాని విలోమ వివాహములు లేనట్లు తోచును. అందుచేతనే దుష్యం

తుడు శకుంతల మేనకా విశ్వామిత్రుల కూతురని తెలియక పూర్వము క్షత్రియు డైన తాను బ్రాహ్మణ కన్యను ఎట్లు వివాహమాడుటా యని సంశయించెను. రత్నములను దొంగిలించువారి కా రోజులలో ప్రాణదండము విధింపబడుచుండె నని తెలియుచున్నది. ఇది మన్వాపస్తంబుల ధర్మశాస్త్రమున కనుగుణముగనే యున్నదట! రాజభటులు అపరాధము చేసినవారిని తాడించుచుండిరనుటకు బెస్తవాడు "ఏతావాన్ తావదేతస్య ఆగమః. అథ మామ్ మారయతం కుట్టయ తంవా" అని పల్కియుండెను. అపరాధులు నిర్దోషులని తేలిన పిమ్మట వారికి కొంత బహుమాన మిచ్చుచుండెడివారు. రాజభటులు ఆ బహుమానము నుండి కొంత గ్రహించి సురాపానాదులు కావించుచుండిరనుటకు షష్ఠాంకము ముందున్న ప్రవేశకము తార్కాణము. ఆ రోజులలో సంపన్ను లెవరైన సంతానరహితులై మరణించినచో వారి ధనము రాజకోశమునకు చేరుచుండెడిది. మరణించినప్పుడు వారి భార్యలలో నెవరైన గర్భవతులై యుండినచో ఆ ధనము గర్భస్థ సంతానమునకే చెందెడిది. ఆ రోజులలో దయ్యములయందు, భూతములయందు నమ్మక మున్నట్లు షష్ఠాంకమునందలి విదూషకుని వృత్తాంతమువలన తెలియుచున్నది. భూలోకమందలి రాజు లింద్రసఖులై రాక్షస సంహారమున నతనికి సాయపడు చుండిరి. రాజులు కొంతకాలము పరిపాలించి రాజ్యభారమును కుమారుల కప్పగించి వానప్రస్థాశ్రమము స్వీకరించుచుండిరనుటకు కణ్వుడు శకుంతలతో "భర్త్రా తదర్పిత కుటుంబ భరేణ సార్ధం శాంతే కరిష్యసి పదం పునరాశ్రమే త్వమ్" అని పల్కుట నిదర్శనము. మునులు యజ్ఞములు చేయుచుండగా రాక్షసులు విఘ్న మొనరించుచుండిరని ద్వితీయాంకమువలన తెలియుచున్నది. స్త్రీలు ప్రియులకు ప్రేమలేఖలు వ్రాయుచుండిరి. శకుంతల దుష్యంతున కట్టి లేఖ వ్రాయుచుండగనే అతడామె కడ కరిగి తన అనురాగమును వెల్లడించెను.

**కాళిదాసు కవిత్వము :-** ఒక రసికుడు భగవంతుడు ప్రత్యక్షమై నీకేమి కావలయునని అడుగగా ఆఱు వస్తువులు కోరుచు- "కాళిదాస కవితా నవం వయః" అను శ్లోకమున కాళిదాసు కవిత్వమునకు ప్రాథమ్య మొసంగి యుండెను. దీనిని బట్టి అతని కవితారసము నాస్వాదించువారికి మోక్షానందము కూడ తక్కువగనే కన్పించుచుండునని విదితమగుచున్నది. దృశ్యములను వర్ణించుటయందును, భావములను వ్యక్తము చేయుట యందును కాళిదాసు కడుంగడు నిపుణుడు. అతని వర్ణనములు సహజములును, ఔచిత్య శోభితములును, భావగంభీరములునై యుండును.

అధరః కిసలయరాగః, కోమల విటపానుకారిణీ బాహూ
కుసుమ మివ లోభనీయం, యౌవన మంగేషు సన్నద్ధమ్

అను శ్లోకము చిన్నదయ్యును శకుంతల యౌవనమును చక్కగా వ్యక్తము చేయుచున్నది. బాహువులను వర్ణించిన పిమ్మట మరొక కవియైనచో నింక వేనినో వర్ణించి యుండెడివాడు. ఔచిత్యజ్ఞుడై కాళిదాసట్లుకాక శకుంతల యంగములందు యౌవనము కుసుమమువలె లోభనీయమై యొప్పుచున్నదని తెల్పియుండెను.

అనాఘ్రాతం పుష్పం కిసలయమలూనం కరరుహైః
అనావిద్ధం రత్నం మధునవ రసాస్వాదితరసమ్
అఖండం పుణ్యానాం ఫలమివచ తద్రూపమనఘమ్
నజానే భోక్తారం కమిహ సముపస్థాస్యతివిధిః

అను శ్లోకమును—

చిత్రేనివేశ్య పరికల్పిత సత్వయోగా
రూపోచ్చయేన మనసా విధినాకృతాను
స్త్రీరత్న సృష్టి రపరా ప్రతిభాతిసామే
ధాతుర్విభుత్వమను చింత్యవపుశ్చతస్యాః

అను శ్లోకమును శకుంతల అసాధారణ సౌందర్యమును అద్భుతముగా వ్యక్తము చేయుచున్నవి. వియోగినియైన శకుంతలను కాళిదాసు-

''వసనే పరిధూసరే వసానా
నియమ క్షామముఖీ ధృతైకవేణిః
అతినిష్కరుణస్య శుద్ధ శీలా
మమదీర్ఘం విరహవ్రతం బిభర్తి

అని వర్ణించెను. ఈ శ్లోకమున శకుంతల వియోగదశలో నెట్లుండెనో విస్పష్టముగా తెలియుచున్నది. తుమ్మెద శకుంతలను బాధించుచున్నప్పుడు దుష్యంతుడు దాని నుద్దేశించి-

చలాపాంగాం దృష్టిం స్పృశసి బహుశో వేపథుమతీమ్
రహస్యాఖ్యాయీవ స్వనసి మృదు కర్ణాన్తిక చరః
కరౌవ్యాధున్వాన్త్యాః పిబసి రతి సర్వస్వ మధరమ్
వయం తత్త్వాన్వేషాన్ మధుకర హతాః త్వం ఖలుకృతీ.

అని పల్కియుండెను. ఇందు తనకంటె నా మధుకరమే అదృష్టవంతమని దుష్యంతుడు భావించుచున్నాడు. ఏలయన, నది చంచలమైన శకుంతల కటాక్షమును స్పృశించుచున్నది. ఏదో రహస్యముగ చెప్పుచున్నట్లు మృదువుగ కర్ణ సమీపమున ఝుంకార మొనరించుచున్నది. ఆమె కరముల తోలగ రతి సర్వస్వమైన అధరము నానుచున్నది. తన కా భాగ్యము లేకపోయెను.

కాళిదాసు ప్రథమాంకమున రథ వేగమును నిసర్గ సుందరముగ వర్ణించెను.

యదాలోకే సూక్ష్మం ప్రజతి సహసా తద్విపుల తామ్
యదర్ధే విచ్ఛిన్నం భవతి కృత సంధానమివతత్
ప్రకృత్యా యద్వక్రం తదపి సమరేఖం నయ నయో
నమే దూరే కించిత్ క్షణమపి చ పార్శ్వే రథజవాత్.

అను శ్లోకము అతని సూక్ష్మ పరిశీలనమును వ్యక్తము చేయుచున్నది. అట్లే దుష్యంతుడు మాతలితో రథమునందు క్రిందికి దిగునప్పుడు, "శైలానామ మవరోహతీవ శిఖరాదున్మజ్జతాం మేదినీ" అని కాళిదాసు అప్పటి దృశ్యమును వర్ణించుట పరికించినచో అతడు విమానము మీద పయనించెనేమో యని తోపక మానదు.

కాళిదాసు లోకజ్ఞత అనన్య సామాన్యమైనది. "స్తనన్య స్తో శీరం ప్రశిథిల మృణాలైక వలయ" మ్మను శ్లోకమున మన్మథ తాపమునకును, గ్రీష్మ తాపమునకును గల భేదము నాతడు చక్కగా సూచించెను. శకుంతల ఎన్ని చెప్పినను వినక దుష్యంతు డామెను నిరాకరించినప్పుడు శార్ఙ్గరవుడు-

ఆజన్మనః శాఠ్య మశిక్షితోయః
తస్యా ప్రమాణం వచనం జనస్య
పరాతి సంధాన మధీయతే యైః
విద్యేతి తేసన్తు కిలాప్త వాచః.

అని పల్కియుండెను. ఇందు అతడు దుష్యంతుని గూర్చి కావించిన ఉపాలంభము అత్యంత నిశితమై యున్నది. ధనవృద్ధి విషయము విన్నప్పుడు దుష్యంతు డనపత్యుల దుస్థితిని గురించి విచారించుచు-

అస్మాత్పరం బత యథాశ్రుతి సంభృతాని
కోనఃకులే నివపనాని కరిష్యతీతి

నూనం ప్రసూతి వికలేన మయాప్రసిక్తమ్
ధౌతాశ్రుశేష ముదకం పితరఃపిబన్తి

అని తన విషయమును కూడ స్మరించుకొని కలతనొందెను. రఘువంశ మందును నిట్టి శ్లోకమొకటి కలదు. వీనినిబట్టి కాళిదాసు కూడ అనపత్యుడై యుండెనేమో అను భావము స్ఫురించును.

కాళిదాసు ప్రకృతి ప్రియుడు. ప్రకృతి యందలి వస్తువుల నాతడు సహజ సుందరముగ వర్ణించుచుండును. చతుర్థాంకము నందలి వర్ణన లన్నియు అతని ప్రకృతి పరిశీలన కౌశలమునకు తార్కాణములే. శకుంతల సంగతి జ్ఞాపకము వచ్చినపిమ్మట దుష్యంతుడు వసంతోత్సవమును నిషేధించెను. అప్పుడు వసంతమునందు సహజముగ జరుగవలసిన క్రియలన్నియు సగములో నాగి పోయెను. అనగ వసంతుడు కూడ రాజాజ్ఞకు భయపడెనన్నమాట.

చూతానాం చిరనిర్గతాపి కళికా బధ్నాతి నస్వంరజః
సన్నద్ధం యదపి స్థితం కురవకం తత్కోరకావస్థయా
కంఠేషు స్ఖలితం గతేపి శిశిరే పుంస్కోకిలానాం రుతం
శంకే సంహరతిస్మరోఽపి చకితస్తూణార్థ కృష్టంశరమ్.

అను శ్లోకము ఇందుకు తార్కాణము. ప్రథమాంకమున తపోవన వర్ణనము కలదు. దుష్యంతుడు అది తపోవనమని గుర్తించుటకు కారణములు అందు వ్యక్తము చేసి యుండెను. తపోవనములను చూచిన వారికి అందలి సహజత్వము తేటతెల్లము కాజాలును. లేడిని తరుముచు దుష్యంతుడు భయముతో పరుగెత్తుచున్న దానిని-

గ్రీవా భంగాభిరామం ముహురనుపతతి స్యందనే బద్ధ దృష్టిః
పశ్చార్ధేన ప్రవిష్టః శరపతన భయాతే భూయసా పూర్వకాయమ్
దర్భైరర్ధావ లీఢైః శ్రమ వివృత ముఖభ్రంశిభిః కీర్ణ వర్త్మా
పశ్యోదగ్ర ప్లుతత్వాత్ వియతి బహుతరం స్తోకముర్వ్యాం ప్రయాతి

అని వర్ణించెను. ఇందలి సహజ రామణీయకమును వర్ణించుటకు మాటలు చాలవు.

కాళిదాసు మహాకవి. అతని రచనలో సర్వత్ర ధ్వని సౌందర్యము గోచరించుచునే యుండును. శకుంతలా దుష్యంతులు ఏకాంతమున మాటలాడుకొను చుండగ శకుంతల శరీరస్థితిని కనుగొనుటకై గౌతమి వచ్చుచుండెను. అప్పుడు

సఖులు "చక్రవాక వధుకే! ఆమంత్రయస్వ సహచరమ్ ఉపస్థితారజనీ" అని పలికి గౌతమి ఆగమనమును వ్యంగ్యముగ సూచించిరి. ఇట్టివి శాకుంతలమందు ఎన్నియో కలవు. రాజు తన్ను నిరాకరించినప్పుడు శకుంతల అంగుళీయక విషయమును తెల్పెను. రాజు దానిని చూపుమనెను. శకుంతల చూపదలచెనుగాని అది నీటిలో జారి పడిపోవుటచే కనబడలేదు. అప్పుడు దుష్యంతుడు—

> స్త్రీణా మశిక్షిత పటుత్వ మమానుషీషు
> సందృశ్యతే కిముతయాః ప్రతిబోధ వత్యః
> ప్రాగంతరిక్ష గమనాత్ స్వమపత్య జాత
> మన్యైర్ద్విజైః పరభృతాఃఖలు పోషయన్తి

అని పల్కెను. శకుంతలకు అమితమైన ఆగ్రహము వచ్చెను. ఆమె "అనార్య! ఆత్మనో హృదయాను మానేన సర్వంపశ్యసి. కఇదానీమన్యో ధర్మకంచుక ప్రవేశినః తృణచ్ఛన్న కూపోప మస్యతవాను కృతం ప్రతిపత్స్యతే" అని అతని నిందించెను. ఆమె కోపమునకు కారణమున్నది. పై శ్లోకము నందలి పరభృత శబ్దమునకు వేశ్య యనియు, ద్విజ శబ్దమునకు బ్రాహ్మణుడనియు అర్థములు కలవు. మేనకా విశ్వామిత్రులు తన్ను కని అడవిలో విడిచిపెట్టగ కణ్వుడు చూచి ఆమె నాశ్రమమునకు గొనివచ్చి పెంచి పెద్దగ చేసెను. ఈ విషయ యామెకు తెలియును. పై శ్లోకమున దుష్యంతు డా విషయమును వ్యంగ్యముగ సూచించి ఎత్తిపొడుచుచున్నాడేమో యని ఆమె భావించెను. ఒడలు మండి ఆమె యాతని నిందించెను. కాళిదాసు సాధారణముగ శ్లేషల జోలికి పోడు. "సర్వదమన! శకుంతలావణ్యం పశ్య" అని తాపస స్త్రీలు సర్వదమనునితో చెప్పినప్పుడు శకుంత + లావణ్యం, పశ్య అని చెప్పినవారి ఉద్దేశమై యుండగ అతనికి తన తల్లియైన శకుంతల స్ఫురించెను. ఇది ఇచ్చట చమత్కారము.

కాళిదాసు రచనలో అలంకారము లప్రయత్నముగా దొరలుచుండును. అన్ని అలంకారములును అచ్చటచ్చట కానవచ్చినను ఉపమలును, అర్థాంతర న్యాసములును అసాధారణ సౌందర్య శోభితములై యుండును.

> సరసిజ మనువిద్ధం శైవలేనాపి రమ్యం
> మలిన మపి హిమాంశోః లక్ష్మ లక్ష్మీంతనోతి
> ఇయ మధిక మనోజ్ఞా వల్కలే నాపిరమ్యా
> కిమివ హి మధురాణాం మండనం నాకృతీనామ్.

శుద్ధాంత దుర్లభ మిదం వపురాశ్రమ వాసినో యది జనస్య
దూరీ కృతాః ఖలు గుణైః ఉద్యానలతా వనలతాభిః
జ్వలతి చలితేంధనోగ్నిః విప్రకృతః పన్నగః ఫణాంకురుతే
ప్రాయ స్వం మహిమానాం క్షోభాత్ ప్రతిపద్యతే జంతుః

కాస్విదవ కుంఠన వతీ నాతి పరిస్ఫుట శరీర లావణ్యా
మధ్యే తపోధనానాం కిసలయమివ పాండు పత్రాణామ్
గచ్ఛతి పురశ్శరీరం ధావసి పశ్చాదసంస్తుతం చేతః
చీనాంశుక మివకేతోః ప్రతివాతం నీయమానస్య

మున్నగునవి అతని సహజాలంకార రచనా పాటవమునకు తార్కాణ ములు.

కాళిదాసు శైలి లలిత మధురమై యుండును. దీర్ఘ సమాసముల నెచ్చటనో కాని అతడు వాడడు. అతని శ్లోకములన్నియు ధారాశుద్ధి శోభితములై శ్రవణ సుభగములుగా నుండును. అతనిది వైదర్భీ శైలి-నాటకోచితమైన పద్యరచన అతని కలపడినట్లు ఇతర కవుల కలవడి యుండలేదు. అతడు భావనిర్భరమైన చోట్లనే శ్లోకములు వ్రాయును. ఎచ్చట శ్లోకములు వ్రాయవలెనో, ఎచ్చట వచనము వ్రాయవలెనో అతనికి బాగుగ తెలియును. అందుచేతనే ఒక రసజ్ఞు డాతని కవిత్వమును-

అస్పృష్టదోషా నలినీవ దృష్టా
హారావలీవ గ్రథితా గుణౌఘైః
ప్రియాంకపాలీవ విమర్దహృద్యా
న కాలిదాసా దపరస్యవాణీ

అని వర్ణించియుండెను. జర్మన్ కవి గేటే శాకుంతలమును చదివి ఆనంద పార వశ్యమున నాట్య మొనరించెనట! ఆ పారవశ్యమున అతడు కావించిన ప్రశంశకు సంస్కృతానువాదమిది :

వాసంతం కుసుమం ఫలంచయుగపత్ గ్రీష్మస్య సర్వంచయత్
యచ్చాన్యత్ మనసో రసాయనమతః సంతర్పణం మోహనమ్
ఏకీభూత మభూత పూర్వమథవా స్వర్లోక భూలోకయోః
ఐశ్వర్యం యది వాంఛసి ప్రియ! సఖే! శాకున్తలం సేవ్యతామ్.

నిజముగ స్వర్లోక భూలోకముల ఐశ్వర్య మొక్కచో చూడవలెనన్నచో శాకుంతలమునే పఠింపవలెను. రాజశేఖరుడు "కాళిదాసో విలాసః" అని అతని ప్రశంసించి యుండెను. అతని నోట గీర్వాణ శారద విలాస భాసురయై లలిత సుందర లాస్య విలాసముతో బయల్వెడలుచుండును. అతని నాటకము నందు నాటక లక్షణము లన్నియు గోచరించును. సంస్కృత నాటక వాఙ్మయమున శాకుంతలమువలె ప్రవర్శన యోగ్యములైన వెన్నో యుండవు. కాళిదాసు కవి మాత్రుడే కాదు. మహా భక్తుడు. మోక్షకాంక్షి. అతని నాటకము నందలి భరత వాక్యమిట్లున్నది:

ప్రవర్తతాం ప్రకృతి హితాయ పార్థివః<br>
సరస్వతీ శ్రుతి మహతీ మహీయతే<br>
మమాపి చ క్షపయతు నీలలోహితః<br>
పునర్భవం పరిగతశక్తి రాత్మభూః.

''మమాపి చ క్షపయతు నీలలోహితః పునర్భవమ్".

# ఉత్తర రామచరిత్రము

డాక్టర్ ధూళిపాళ శ్రీరామమూర్తి

అహోమే సౌభాగ్యం మమచ భవభూతేశ్చభణితీ
తులాయా మారోప్య ప్రతిఫలతి తస్యాం లఘిమని
గిరాందేవీ సద్యశ్శ్రుతి కలిత కల్హార కళికా
మధూళీ మాధుర్యం క్షిపతి పరిపూర్త్యై భగవతీ.

భోజ ప్రబంధములోనిదీ శ్లోకము. అందులో కాళిదాసు డన్నమాట లివి. ఔరా! ఏమి నా సౌభాగ్యము. నా కవిత్వము భవభూతి కవిత్వముతో తులతూచి నా కవిత్వమించుక తేలిపోవ సరస్వతీదేవి వెంటనే తన చెవియందలి కలువ మొగ్గలోని మకరందమును చిలికి పూర్ణము గావించినది. అది భవభూతి వైశిష్ట్యము.

నాటకేషు చ కావ్యేషు వయంవా వయమేవ వా
ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే

ఇదికూడ కాళిదాసన్నదే. కావ్యములుగాని నాటకములుగాని నిర్మించుటలో నా అంత వారెవ్వరునూ లేరు. కాని ఉత్తర రామచరిత్ర నాటకములో భవభూతి మమ్ము మించిపోయినాడు.

ఈ రెండు శ్లోకములు కాళిదాస రచితములు కానేకావు. ఆయన యన్నట్లు కల్పించినవి. అయిన నేమి ? అవి తెలియచేయు విషయముమాత్రము సత్యమే. అది భవభూతి వైశిష్ట్యము. భవభూతి వాణి అంతర సోత్కటమైనది. అంతేకాదు. అంత కంటె పవిత్రమైనది కూడ. భవభూతి కంటె పవిత్రమైన వస్తువు మరియొకటి యేమున్నది ? అది జగన్మాతను కూడ పవిత్రము సేయు నట్టి దనిరి.

'సాంబా పునాతు భవభూతి పవిత్రమూర్తిః'

ఈ చరణము భవభూతి వ్రాసినదట. దీనినిబట్టియే యాయన కీ బిరుదు వచ్చిన దందురు. ఇట్టిదే మరియొక శ్లోకము:

తపస్వికాం గతోఽ వస్థా మితి స్మేరాననావివ
గిరిజాయాః స్తనౌ వందే భవభూతి సితాననౌ.

శివుడు పార్వతిని కౌగిలించుకొన్నాడు. ఆయన దేహము నందలి భూతిచే ఆమె స్తనాగ్రములు తెల్లవడి యీ తాపసియెట్లు మారిపోయినాడని నవ్వుచున్నట్లున్న వట. ఈ శ్లోకము కూడ భవభూతి రచనయేయని, దీనివలననే యీయనకా బిరుదు వచ్చినదని చెప్పుదురు. ఎట్లు వచ్చినను భవభూతియన్న పేరు సంస్కృత సాహిత్యములో చాల ప్రధానమైనది. ప్రథమగణ్యమైనదనుటలో మతభేదము లున్నను ప్రధానమైనదనుటలో విప్రతిపత్తి లేదు.

ఇంతకు నీ భవభూతి యన్నదికవి బిరుదా! నామధేయమా! అన్న వివాదము కలదు. కొంద రది నామధేయమనియు, కొందఱు బిరుదనియు తీర్మా నించిరి. ఈ కవి వ్రాసిన మూడునాటకములలోని ప్రస్తావనము చూచినచో భవ భూతి యనునదే పేరనియు, శ్రీకంఠు డన్నదియే బిరుదనియు మనకు తోచును. ఈ ప్రస్తావనలను పర్యాలోచించిన మీదట నీ కవి కంఠోక్తిగా చెప్పిన విశేషము లివి. దక్షిణాపథమున విదర్భ దేశమందలి పద్మపుర మీయన నివాస స్థలము. ఉదుంబరశాఖకు చెందిన బ్రాహ్మణు డితడు. ఉదుంబరులు పంక్తి పావనులు, పంచాగ్నులు, సోమపీథులు, ధృతవ్రతులు. ఇతడు కాశ్యపసగోత్రుడు. కృష్ణ యజుశ్శాఖాధ్యాయి, మహా కవి నుండి పంచమ పురుషుడు. మహాకవి వాజపేయ యాజి. భవభూతి పితామహుడు భట్టగోపాలుడు, తండ్రి నీలకంఠుడు, తల్లి జాతుకర్ణి. 'శ్రీకంఠపదలాంఛనః భవభూతిర్నామ'. శ్రీకంఠుడన్నది బిరుదనియు, భవభూతి పేరనియు యీ మాటలలో తెలియుటలేదా! ఐనను మొద టిదే పేరనియు, రెండవదే బిరుదనియు నీ మాటల కర్థము లాగవచ్చును. ఇతడు పద వాక్య ప్రమాణతత్వజ్ఞుడు. పదమనగా వ్యాకరణశాస్త్ర మనియు, వాక్యమనగా మీమాంసా శాస్త్రమనియు, ప్రమాణమనగా తర్కశాస్త్ర మనియు అర్థము చెప్పుదురు. కొందరు వాక్య మనగా తర్కమనియు ప్రమాణ మనగా మీమాంస యనియు చెప్పుదురు. కొందరు ప్రమాణ మనగా కోశములని చెప్పు దురు. కాని యీ సమాసమునకు పదప్రమాణము, వాక్యప్రమాణము అని అర్థము చెప్పుట సమంజసమని తోచును. పదస్థితికి ప్రమాణము వ్యాకరణము. వాక్యసిద్ధికి మీమాంస. తర్కశాస్త్రమున కిందు చోటులేదు. మీమాంస యనగా పూర్వోత్తర మీమాంసలు రెండును వచ్చును. ఈ రెంటికిని తర్కశాస్త్రము విరుద్ధము. కావున ప్రమాణ మెట్లగును? వేదాంతులు తార్కికుల నర్థవైనాశిక

లందురు. భవభూతి తన యుభయ మీమాంసా పాండిత్యమును వేదవేదాంత విద్యా పారీణతను తన రచనల యందు ప్రదర్శించెను. కుమారిలభట్టు తంత్రవార్తిక మునకు వ్యాఖ్య వ్రాసిన ఉంబేకాచార్యుడు భవభూతియే యనియు, భావనా వివేక మను మీమాంసా గ్రంథమునకు వ్యాఖ్య వ్రాసినది కూడ నతడే యనియు, నితడే కుమారిలుని శిష్యుడైన మండనమిశ్రు డనియు, శంకరునిచే నోటువడి, సురేశ్వరా చార్యుడన్న పేరుతో 'చిత్సుఖి' 'నైష్కర్మ్యసిద్ధి' మొదలైన గ్రంథములు వ్రాసిన దితడే యనియు చెప్పుదురు.

'శ్రీకుమారిల స్వామి ప్రసాదప్రాప్త వాగ్వైభవ శ్రీమదుం బేకాచార్య విరచితే మాలతీ మాధవే షష్ఠోంకః' యను గద్యకల వ్రాత ప్రతి చాల పురాతనమైనది కలదని శంకర పాండురంగ పండితు లభిప్రాయము వెల్లడించిరి. భవభూతి వ్రాసిన మాలతీ మాధవ మందలి 'యేనామ కేచి దిహనః ప్రథయం త్యవజ్ఞాం అన్న శ్లోకము శ్లోక వార్తిక వాక్యారంభమున నుంబేకాచా ర్యుడు వ్రాసికొనెను. ఉత్తరరామ చరిత్రమందలి 'యంబ్రహ్మాణ మియందేవీ' యన్న శ్లోకము కూడ యీ యభిప్రాయమున కుపష్టంభకముగా నున్నది. ఈ యభిప్రాయము సరియైనను కాకపోయినను భవభూతి పాండిత్యపు లోతును తెలియచేయుటకు ఆయన నాటకములే చాలును.

భవభూతి తన నివాసస్థానముగా చెప్పుకొన్న పద్మపురమును గుఱించి విమర్శకులలో భిన్నమైన యూహలు గలవు. పద్మపురము విదర్భ దేశమందలి దని భవభూతియే చెప్పెను. ఇప్పటి బేరారే అప్పటి విదర్భ యందురు. నాగపూర్ సమీపమున చాందా ప్రాంతమున ఉదుంబర శాఖకు చెందిన బ్రాహ్మణు లిప్పటికి నున్నారట. భవభూతి మహావీరోత్తర రామ చరిత్రలలో ప్రదర్శించిన గోదావరీ దండకారణ్యముల గాఢ పరిచితిని బట్టి అతడు గోదావరీ తీరమున నివసించి యుండనగునని చెప్పవచ్చును. ఉదుంబరు లచ్చటి వారే. ఇప్పుడు కొంచెము లోతట్టునకు వలసపోయి యుందురు. కావున పద్మపురము గోదావరీ తీరముననే యుండి యుండవచ్చును. శతవిధముల భవభూతి ఆంధ్రుడే కావచ్చును. భవ భూతి ప్రస్తావనలయందు ప్రస్తుతించిన కాలప్రియనాథు డెవ్వరన్న చర్చ దీర్ఘ ముగా సాగినది. దానిని వివరించుట కిట తావులేదు. విమర్శకులు కాలప్రియము ఒక పట్టణ మనియు కాలప్రియానాథు డచ్చట నున్న దైవమనియు యమున దరిని నున్న యిప్పటి కాల్పి యను పట్టణమే నాటి కాలప్రియ మనియు, వేములవాడ భీమేశ్వరాలయమున దొరికిన శాసనము నుదాహరించి డా॥

నేలటూరి వేంకటరమణయ్య గారు రూఢి గావించిరి. కాల్పిలో నేటికిని కాలప్రియానాథాలయము కలదట. కాలప్రియమున కుత్తరముగా కాన్యకుబ్జము కలదు. దీనికి గాధి పురమని నామాంతరము. 'యోగాధిపురస్య దక్షిణః సకాల ప్రియస్య ఉత్తరః' అని గాధిపురమును గుఱించి రాజశేఖరుడు చెప్పెను. రాజ తరంగిణియందు కల్హణుడు లలితాదిత్యుని చేతిలో నోడిపోయి సంధి గావించు కొన్న కన్యకుబ్జాధీశుడైన యశోవర్మ యాస్థానమున భవభూతి, వాక్పతి రాజాదు లున్నారని తెల్పెను. లలితాదిత్యుని రాజ్యకాలము క్రీ.శ. 693 నుండి 729 వరకు యశోవర్మ రాజ్యకాలము క్రీ.శ. 725 మొదలుకొని 752 వరకు. వాక్పతిరాజు గౌడ వాహమన్న ప్రాకృత కావ్యమున భవభూతిని స్తుతించియుండుటచే భవభూతి వాక్పతి రాజుకంటె జ్ఞాన వయోవృద్ధుడై యుండవచ్చును. ఆ కారణమున భవ భూతి క్రీ.శ. 8వ శతాబ్ద ప్రారంభమున యుండి యుండవచ్చును. 7 వ శతాబ్ది పూర్వార్ధమున జీవించియున్న బాణభట్టు, కాళిదాస ప్రవరసేన సుబంధాదులను పేర్కొనుచు భవభూతిని చెప్పలేదు.కావున 7వ శతాబ్ది ఉత్తరార్ధమున 8వ శతాబ్దికి పూర్వార్ధమున భవభూతి కాలము నిర్ణయించుట సరియైన పద్ధతి. విమర్శ కులు భవభూతి కాలమును క్రీ.శ. 675 నుండి 725 మధ్యస్థము కావచ్చునని యూహించుట సమంజసము. భవభూతి యాంధ్రుడే. కుమారిలభట్టు నాంధ్రుడే కుమారిలభట్టు స్థాపించిన మీమాంసా మతము, కర్మతత్వము, సదాచార సంపత్తి మొదలైన వానికి నాంధ్రదేశము, తత్రాపి గోదావరీ తీరము పట్టుగొమ్మ. భవ భూతి తన పాండిత్యమంతయు గోదావరీ తీరముననే సంపాదించి యుండును. తరువాత రాజాశ్రయమునకై ఉత్తర దేశమునకు పోయి యశోవర్మ యాస్థాన మున కుదురుకొని యుండును. సమీపమునందలి కాలప్రియానాథుని యాత్రో త్సవములలో ప్రదర్శించుటకై నాటకత్రయమును వ్రాసియుండును. భవభూతి నాటక ప్రియుడు, నటజన మిత్రుడును. ఈయన వ్రాసిన నాటకత్రయమే మన కిప్పుడు లభించుచున్నది. దీనికి పూర్వమితదేవియైన నాటకములను. గ్రంథము లను వ్రాసియుండవచ్చును. అవి ఏవియు మనకు లభించుటలేదు. దొరికిన నాటక ములలో కాలము చేత మొదటివి మాలతీ మాధవము. దీని ప్రస్తావనలో—

యేనామకేచిదిహనః ప్రథయం త్యవజ్ఞాం
జానంతి తే కిమపి తాన్ప్రతి నైషయత్నః
ఉత్పత్స్యతేస్తి మమకోపి సమానధర్మా
కాలోహ్యయం నిరవధిర్విపులా చ పృథ్వీ.

నన్ను తక్కువ చేసి చెప్పువారెందులకు చెప్పుదురో! ఈ రచన వారి కొరకు గాదు. నావంటి వారి కొరకు. అట్టివాడీ విశాలభూమిలో నుండకపోడు. లేదా భవిష్యత్తులో పుట్టవచ్చును. దేశకాలము లనంతములు గదా! ఈ శ్లోకమును బట్టి ఆ నాటక రచనా కాలము నాటికి భవభూతి సామాజిక లోకమున నేమాత్ర మును ప్రశస్తిలేదనియే గాక యపప్రథయున్నదని కూడ మనకు తెలియనగును. మాలతీ మాధవముతో నతనికి కొంత ప్రశస్తి లభించియుండును. మాలతీ మాధవము నందలి యితివృత్తము కల్పితము, లౌకికము. అట్టి యితివృత్తములు గల చారుదత్తము, స్వప్న వాసవదత్తము, మృచ్ఛకటికము మొదలైన వానిలో నున్న ప్రదర్శన యోగ్యత్వము, రామణీయకము, లాలిత్యము దానియందు కొర వడినవి. దానితో భవభూతి లౌకికేతివృత్తములతో విసుగుచెంది రామాయణము పట్టికొని యుండును. అతడు రామాయణమును నిత్యసేవనము చేయుచు గాఢ ముగా భావన చేసియుండు ననుటలో సందేహము లేదు.

> పాప్మభ్యశ్చ పునాతి వర్ధయతిచ శ్రేయాంసినేయం కథా
> మంగళ్యాచ మనోహరాచ జగతో మాతీవ గంగేవ చ

ఇది పట్టి యభిప్రాయము కాదు. భవభూతి యనుభూతి రామాయణ భావనవలన జన్మాంతర పాపములు నశించి భవభూతి పవిత్రుడయ్యెను. అతనికి శ్రేయస్సులు పెరిగెను. ఈ శ్రేయశ్శబ్దము బహువచనముగా శ్రేయాంసి యని భవభూతి ప్రయోగించెను. కావున నిది యైహికాముష్మికములైన సర్వశ్రేయ స్సులను చెప్పును. భవభూతి కాలప్రియమునకు పోయి మొదట కొన్ని నాటక ములు వ్రాసి, యచటి నటకులతో స్నేహము చేసి వానిని ప్రదర్శించి, కష్టపడి, రామాయణ సేవనముచే రాజాశ్రయమును పొంది రామ నాటకములను వ్రాసి రాజ ప్రశంస, పండితుల ప్రశంస, సామాజికుల ప్రశంసయు పొంది తన పాండిత్య వివేకములను స్వోపయోగ మొనరించుకొని తరించియుండెననుటలో సందేహము లేదు. భవభూతి రామ నాటకములు వ్రాయుటకు పూర్వ మెంత యపప్రథపాలయ్యెనో తరువాత అంత సుప్రతిష్ఠితుడాయెను. సంస్కృత సాహి త్యమున కాళిదాస భవభూతులన్నవి జంట పేర్లు. ఈ వ్యాసమునకు తొలుత నుదాహరించిన శ్లోకము భవభూతి యాధిక్యమును చెప్పునట్టిదే. మరొకటి కాళి దాసుని పేరుతో ప్రసిద్ధమైనది 'నాటకేషు చ కావ్యేషు' అన్నది. అది కూడ భవభూతి విశేషమునే చెప్పునట్టిది. ఉత్తరరామచరిత్రము నందలి —

కిమపి కిమపి మందం మందమాసత్తి యోగా
దవిరళితకపోలం జల్పతోర క్రమేణ
అశిథిల పరిరంభ వ్యాపృతైకైకతోష్ణో
రవిదితగతయామా రాత్రిరేవ వ్యరంసీత్

భవభూతి కాళిదాసునకు నుత్తరరామచరిత్రమును చదివి విన్పించుచున్నాడట. కాళిదాసు రమణీప్రియదూతిక చుట్టి యిచ్చుచున్న తమలపాకు చిలుకలను నమలుచున్నాడట. భవభూతి 'రాత్రిరేవం వ్యరంసీత్' అని చదివినాడట. కాళిదాసు వెంటనే ఓ చుక్క సున్నమెక్కువైనదన్నాడట. వెంటనే భవభూతి దిద్దుకొని 'రాత్రిరేవ వ్యరంసీత్' అన్నాడట. కాళిదాసు ఔత్తరాహుడే యైన నతనికి తెనుగు బాస ఎట్లువచ్చియుండును? వారి కాలము లత్యంత భిన్నములు గదా యన్నచో మహాకవు లజరామరులు గదా యని చెప్పుకొందము. కథ కల్పితమే యన్నను భవభూతి కవిత్వములో ఒక చినుకు సున్న మెక్కువే మఱి. భవభూతి తరువాత వచ్చిన కవులు నలంకారికులలో పలువు రాతని మిక్కిలి గౌరవముతో పేర్కొనిరి.

మాన్యో జగత్యాం భవభూతి రార్యః
సారస్వతే వర్త్మని సార్థవాహః
వాచం పతాకా మివ యస్యదృష్ట్వా
జనఃకవీనా మనుపృష్ఠమేతి

అని రాజశేఖరుడును,

ప్రాచేతసేన యా నీతా
పాలితా భవభూతినా
సర్వత శ్చర్వ్యతే వాణీ
సైవాద్య కవిమానిభిః

అని నీలకంఠదీక్షితుడును,

స్పష్టభావరసాచిత్రైః పాదన్యాసైః ప్రవర్తితా
నాటకేషు నటస్త్రీవ భారతీ భవభూతినా

అని ధనపాలుడును,

రత్నావళీపూర్వక మన్యదాస్తాం
అసీమభోగస్య వచోమయస్య

పయోధరస్యేవ హిమాద్రిజాయాః
వరం విభూషా భవభూతి రేఖా

అని బిల్హణుడును,

భవభూతేశ్శిఖరిణీ నిరర్గళ తరంగిణీ
రుచిరాఘన సందర్భే యా మయూరీవ నృత్యతి

అని క్షేమేంద్రుడును వారి గ్రంథములలో భవభూతిని శ్లాఘించిరి. గోవర్ధనాచార్యుడు భవభూతిని శ్లేషతో చమత్కరించినాడు

భవభూతే స్సంబంధాత్ భూధరభూరేవ భారతీ భాతీ
ఏతత్కృత కారుణ్యే కిమన్యధారోదితి గ్రావా

భవభూతి సంబంధము చేత సరస్వతి కొండపుట్టువుగా కన్పట్టును. లేనిచో నామె చేసిన కారుణ్యమువలన రాయి ఏడ్చుట యెట్లు? భవభూతి ఉత్తర రామ చరిత్రమున ప్రథమాంకమున వ్రాసిన యొక శ్లోకమున కిది పొగడికగను, తెగడికగను నన్వయించుట గలదు. ఆ శ్లోక మిది :

అథేదం రక్షోభిః కనక హరిణశ్ఛద్మవిధినా
తథావృత్తం పాపైర్వ్యథయతి యథాక్షాళిత మపి
జనస్థానే శూన్యే వికలకరణై రార్యచరితైః
అపిగ్రావారోదిత్యపిదళతి వజ్రస్య హృదయం

(లక్ష్మణుడు రామునితో నన్న మాట లివి : రాక్షసులు మాయ పన్ని బంగరు లేడి మిషతో చేసిన పని యిది. దీనికి మనము ప్రతిక్రియ చేసి కడిగివేసినను నిది యింకను బాధించుచునే యున్నది. శూన్యమైన జనస్థానములో నొడలు మఱచి నీవు పొందిన దుఃఖావేగమునకు పాషాణ మేడ్చెను. వజ్రమునకు గుండె పగిలినది.)

సారస్వతములో రాయి యేడ్చినట్లెక్కడను లేదు. భవభూతి దానిని వ్రాసెను. ఈ దుఃఖము సరస్వతీయమైనది. అనగా కరుణరస రూపమైనది. రాతిని కూడ కరగించునట్టిది. భవభూతికున్న కరుణరసావేశ మిట్టిదని ప్రశంస. ఇచ్చట సరస్వతి భవభూతి సంబంధము వలన కొండపుట్టువైనది. భవభూతి యనగా శ్లేషచేత శివుని శరీరమందలి బూడిద. అది అంటుకొనుటచే భారతి పార్వతి యైనదని. భవభూతి రచన కొండదారిగా నుండునని, పాషాణపాకమని వ్యంగ్యము. గోవర్ధనాచార్యుని యీ శ్లోకమునందు భవభూతి పూర్వజీవితమున ననుభవించిన యపప్రథ చోటుచేసికొని తొంగి చూచుచున్నది. ఆధునిక

విమర్శకులలో కొందరు భవభూతి శైలీవిన్యాసమును గూర్చి యిట్టి యభిప్రాయమునే వెలిబుచ్చిరి. కొంద రాతని నాటకములు చదువుకొనుటకే పనికివచ్చుననియు ప్రదర్శించుటకు యోగ్యములు కావనియు పల్కిరి. ద్విజేంద్రలాల్‌రాయ్ కాళిదాస భవభూతులను పోల్చుచు వ్రాసిన గ్రంథములో భవభూతి నాకసమున కెత్తెను. బెరిడెల్ కీత్ మొదలైనవారు భవభూతి శక్తిసామర్థ్యములు ప్రశంసించుచునే యతని శైలీ కాఠిన్యమును విమర్శించిరి. సంస్కృత నాటకములు చదువుకొనుట కేర్పడినవి గాని ప్రదర్శించుటకు కాదని యొక యభిప్రాయము విద్వాంసులలోనే యున్నది. ఇది కేవలము నిరాధారమని త్రోసివేయుటకు వీలు లేదు. సంస్కృత నాటక రచనయందు భాసుడు, దిఙ్నాగుడు, కాళిదాసు, భవభూతి, మురారి వీరిని ప్రతినిధులుగా స్వీకరించి పరిశీలించినచో గాని శైలీ పరిణామము మనకు బోధపడదు. భాసునినుండి మురారివరకు నాటకీయభాష, శైలీవిన్యాసము క్రమక్రమముగా శోభతోపాటు బరువును కూడా సంపాదించుకొన్నది. ఫలితముగా లాలిత్యము, ప్రసాదము కొరవడి సామాన్యులకు దుర్బోధమై పండితైకవేద్యమై పోయినది. కాళిదాసు 'అపరితోషా ద్విదుషాం న సాధుమన్యే ప్రయోగవిజ్ఞానం'' అని శాకుంతలములో చెప్పెను. జనానురంజనము కంటె పండితుల మెప్పుకే కవులు ప్రాధాన్యమిచ్చుటవలన మురారి నాటికి నాటకములు పండితులకు కూడ దుర్బోధమై పోయినవి. దీని కింకను అనేక కారణములు గలవు. ఈ విషయము మనకంత ప్రస్తుతము కాదు. భవభూతి వ్రాసిన నాటకము లతని కాలముననే జనసామాన్యమున కందుబాటులో లేవనుటకు అతడు చేసిన జన నిందయే సాక్ష్యము. 'యథా స్త్రీణాం తథా వాచాం సాధుత్వే దుర్జనో జనః.' ఉత్తర రామచరిత్ర రచన నాటికి కూడ భవభూతి కున్న జన ప్రీతిపాత్రత పాక్షికమైనది. పండిత ప్రీతిపాత్రత కూడ యతనికి పాక్షికమే యని యా మాటలలో నున్నది. కాని. 'ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే' యన్నదే భవభూతికి సరియైన కొలత. భవభూతి ఒక ప్రక్క జనులను, పండితులను నిందించుచునే మరియొక ప్రక్క వారి విమర్శలను పాటించి ప్రయోగములు చేయుచు వచ్చెను. కాని, మారుటకు బదు లతని సహజ లక్షణములు మరింత వన్నెకెక్కెను. ఉత్తర రామచరిత్ర నాటి కతడు సానబట్టిన జాతిరత్నమై వెలుగొందెను. మాలతీ మాధవము నాటికి అతని రచనాగుణము లేవియో ఉత్తర రామచరితము నాటికిని నవియే కాని, వాని వన్నె వేరు, వాని అంతస్తు వేరు. మాలతీ మాధవములో ఆయన యిట్లు చెప్పుకొనెను :

యద్వేదాధ్యయనం తథోపనిషదాం సాంఖ్యస్యయోగస్యచ
జ్ఞానం తత్కథనేన కిం నహి తతః కశ్చిద్గుణో నాటకే
యత్ప్రౌఢిత్వముదారతాచవ చ సాం యచ్చార్థతో గౌరవం
తచ్చే దస్తి తత స్తదేవగమకం పాండిత్య వైదగ్ధ్యయోః

వేదాధ్యయనము, ఉపనిషద్విచారము యోగ సాంఖ్యాది జ్ఞానము వీని యన్నిటిని చెప్పుట యేల? ఇట్లు చెప్పుటవలన నాటకమునందు కల్గు గుణమేమియు లేదు. వాక్కులలో ప్రౌఢి యుండవలెను. ఉదారత యుండవలెను. అర్థమునందు గౌరవ ముండవలెను. ఉన్నచో అవియే పాండిత్యమునకును, వైదగ్ధ్యమునకునూ గమకములు. కాబట్టి వాక్ప్రౌఢి, వాగ్గాంభీర్యము, పాండిత్య వైదగ్ధ్యస్ఫోరకత్వము, యివి భవభూతి కవితాత్మను పట్టి యిచ్చు గుణములు. భవభూతి ఆకసమంత ఎత్తైనవాడు. అంబుధియంత లోతైనవాడు కాదు. అంబుధియంత లోతైనవాడు కాళిదాసు. ఇద్దరును మహానుభావులే. ఇద్దఱివియు రెండు విభిన్నమైన మార్గములు. ఇద్దరును మన కారాధనీయులే. తన రచనలలో కాళిదాసు తాను కన్పింపడు. భవభూతి తాను కన్పించును. కాళిదాసు తనను గురించి చెప్పుకొనడు. చెప్పుకొన్నను వ్యంగ్యముగా చెప్పుకొనును. భవభూతి వాచ్యముగా చెప్పుకొనును.

'యం బ్రహ్మాణ మియందేవీ వాగ్వ స్యేవాన్వవర్తత.' సరస్వతి తన మాటకు లోబడి బ్రహ్మకువలె తన్ననుసరించునట. తాను వశ్యవాక్కు నని చెప్పుకొనుట కూడ కాదు. దానిని తిరుగవేసినాడు. సరస్వతియే తన వాక్కునకు పశ్యయన్నాడు. ఆమెయే తన వాక్కున కట్టుబడి పోయినది, మోహపడి పోయినదని. 'ఇవ' కారమా 'ఏవ'కారమా. నాకు 'ఏవ'కారమని గుర్తు. బ్రహ్మశబ్దముతో నన్వయించవచ్చును. కాని వాగ్వస్యతో నన్వయించుటయే భవభూతి యభిప్రాయము. బ్రహ్మతో తన కభేదాధ్యవసాయ మన్నమాట. భవభూతి ఉంబేకాచార్యుడగు మండనమిశ్రు డన్న యూహకిది యుపోద్బలక మన్న మాట యట్లుంచి యిది భవభూతి యహంకారమును చెప్పును. చెప్పినను భవభూతి యంతవాడే యనుటలో మనకు విప్రతిపత్తి లేదు. ఒక విధముగా అహంకార ప్రకటనము కూడ కవికి ప్రజామోదము కొరవడి యుండెననుటకు నిదర్శకము. భవభూతి యెంత వాడో మనకు తెలిసినట్లు ఆ కాలమునాటివారికి తెలియదు. ఆ కాలమువారి కతని యహంకార ప్రకటనము దోషముగనే కన్పించును. వైముఖ్యమునే కల్పించును. భవభూతి కోవకు చెందిన మహా కవుల కవితా గుణ.

ములు సమకాలము నాటి వారికి తెలియునట్టివి కావు. తెలియుట యనగా నిచ్చట హృదయ సంవాద భాగులు కాదని యర్థము. జనానుమోదము వలసిన కవికి అంత యున్నతమైన వ్యక్తిత్వము పనికిరాదు. లోతైనవ్యక్తిత్వ మున్నను నష్టములేదు. అసలు వ్యక్తిత్వము లేకున్నను నష్టము లేదు. ఆకసమంత గౌరీ శంకర శిఖరమంత యున్నతమైన వ్యక్తిత్వ మతకిగలదు. లోతైన వ్యక్తిత్వము పైకి కన్పించెడిదికాదు. దిగిన కొలది తెలియునట్టిది. అర్థమైనంత యగును. కావున వివాదము లేదు. ఉన్నతమైన వ్యక్తిత్వము సమకాలికులకు మనస్సుపట్టక వెక్కసమై యుద్వేజకముగా నుండును. చంద్రుడు పున్నమినాటి వాడైనను పంచమినాటి వాడైనను వెన్నెల యాహ్లాదకరముగనే యుండును. మధ్యాహ్న సూర్యుడట్లు కాదుగదా! ఈ వ్యక్తిత్వమునకు తోడు భవభూతి ప్రయత్నము గూడ నట్టిదే. అత డేది వ్రాసినను దాని యందొక వైశిష్ట్యము లేకుండ వ్రాయడు. అతడు వ్రాసిన ప్రత్యంశమునందును అతని ముద్ర వ్యక్తమగుచుండును. అతని యనుభూతి ప్రకట మగుచుండును. ఈ వైశిష్ట్యము క్రమక్రమముగా నధికమై, యుత్తర రామ చరిత్రమునందు పరాంకోటి నందుకొన్నది. కాబట్టి "ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే" అన్నదే సరియైన కొలత. భవభూతి కవితాత్మను పట్టి యిచ్చునది.

ఉత్తర రామచరిత మేడంకముల నాటకము. ఇందలి యితివృత్తము నాటకము పేరు వలననే తెల్లము. ఇందు ప్రధానాంశము సీతా వివాసనము. నాటకీయత కొఱకై భవభూతి యిందు కొన్ని మార్పులనుచేసెను ప్రథమాంకము నందుపూర్వ రామాయణ ఘట్టములన్నిటిని చిత్రదర్శన వృత్తాంతమును కల్పించి సంగ్రహించెను. రామ పట్టాభిషేకోత్సవములు సంవత్సరముల తరబడి సాగినవి. ఉత్సవాగతులైన వారు క్రమముగా ఋష్యశృంగుని యజ్ఞమునకై వసిష్ఠాదులు, కౌసల్యా సుమంత్రులు వెడలిపోయిరి. జనకాదులు మిథిలానగరమునకు వెడలి పోయిన క్రొత్తలోనే నాటక కథ యారంభమగును. జనకుని నిర్గమనమునకు సీత బెంగపడి యుండును. ఆమె పూర్ణ గర్భిణి. ఆమెను రాము డోదార్చు చుండగా ఋష్యశృంగాశ్రమము నుండి అష్టావక్రముని వచ్చి రామునికి సీత కోరినది సంపాదింపుమనియు ప్రజానురంజనము నేమర వలదనియు, వసిష్ఠాదుల సందేశము చెప్పును. రాము డామోదించి వలసిన సీతను గూడ వీడుదునని ప్రతిజ్ఞ చేయును. అష్టావక్రుని విశ్రాంతికై పంపును. లక్ష్మణుడు వచ్చి పూర్వ రామాయణ చిత్రములను చూచుటకు సీతా రాముల కొనిపోవును. విశ్వామిత్రుడు

రామునికొనర్చిన జృంభకాస్త్రదానము, శివ ధనుర్భంగము, సీతా కల్యాణము, పరశురామ భంగము, అయోధ్యా వాసము, మంథరా వృత్తాంతము, గుహ సమాగమము, భాగీరథీ తరణము, భరద్వాజాశ్రమము, శ్యామవటము, విరాధ వధము, దండకారణ్య ప్రవేశము, పంచవటి, శూర్పణఖావృత్తాంతము, సీతాపహరణము, జటాయు విక్రమము, కబంధ వృత్తాంతము, మతంగాశ్రమము, పంపాసరోవరము, హనుమదాగమనము, మాల్యవంతము వరకును తిలకించు సరికి సీత యలసిపోవుట, లక్ష్మణుడెరింగి యామెను విశ్రమింప జేయుమని రామునికి విన్నవించును. సీత చిత్ర దర్శనముచే మరల నా వనములందు విహరింప వలయుననియు గంగలో స్నానము చేయవలయుననియు తనకు కోరిక గల్గినదని రామునికి వెల్లడించును. రాముడు లక్ష్మణునికి యోగ్యమైన రథమును, సీతను కొనిపోవుటకై సన్నద్ధము జేయవలసినదని చెప్పి పంపును. సీత తనకు నిద్ర వచ్చుచున్నదని చెప్పును. రాముడామె నవలంబించి శయనమునకు కొనిపోవును. రామ బాహువు ఉపధానముగా అతని వక్షస్థలమునందామె నిద్రించును. దుర్ముఖుడన్న గూఢచారి వచ్చి సీతాపవాదమును నివేదించును. రాము డంత దుఃఖించి సీతను త్యజించుటకై నిశ్చయించి సీత నడవిలో దించిరమ్మని లక్ష్మణునికి చెప్పును. లవణత్రాసితులైన తాపసులు వచ్చి మొరపెట్టగా శతృఘ్నుని వాని యున్మూలనముకై పంపును. లక్ష్మణుడు తెచ్చిన రథ మెక్కి సీత అరణ్యములకు పోవును. ఇది ప్రథమాంకము. దీనికి చిత్ర దర్శనమని పేరు.

ద్వితీయాంక ముఖమున శుద్ధ విష్కంభము కలదు. ఇందు ఆత్రేయీ వాసంతుల ముఖమున లక్ష్మణుడుసీతను గంగయొడ్డున వాల్మీక్యాశ్రమ సమీపమున విడిచిపోవుట సీత గంగలో పడుట, వాల్మీకి కుశలవులను పెంచి యుపనీతులను చేయుట, జృంభకాస్త్రములు వారికి జన్మసిద్ధములగుట, వాల్మీకి రామాయణ రచనము, రాముని యశ్వమేధ యజ్ఞదీక్ష, శంబూకవధకై రాముని పంచవటీ గమనము వర్ణితమైనది. ద్వితీయాంకమునకు పంచవటీ ప్రవేశ మని పేరు. రాముడు శంబూకుని వధించుటతో ద్వితీయాంక మారంభమగును. శరీరము విడిచి శంబూకుడు దివ్యపురుషుడై ప్రవేశించి రామునికి పంచవటీ ప్రాంతమంతయు పునఃపరిచయము చేయును. రాము డా యాప్రదేశములందు సీతతో విహరించుట గుర్తు తెచ్చికొని దుఃఖపడును.శంబూకుడు అగస్త్యుని దర్శించుటకు పోయి తిరిగి

వచ్చి రామునికి నగస్త్యాహ్వానము చెప్పును. రాముడు శంబూకునితో పుష్పకముపై నగస్త్యాశ్రమమునకు పోవును. ఇది ద్వితీయాంకమునందలి కథ.

తృతీయాంక ముఖమున కూడ శుద్ధ విష్కంభము కలదు. ఇందు తమసా మురళలన్న నదీ ద్వయసంభాషణచేత కొన్ని కథాంశములు సూచింపబడును. లోపాముద్ర గోదావరికి సందేశమంపును. సీతావిరహకర్శితుడైన రాముడు పంచవటిలో పూర్వవృత్తాంతమును తలచికొని యడుగడుగునను మోహము పొందవచ్చును. గోదావరీ దేవి తన చల్లని గాడ్పులను పంపి యాతని తీర్ప వలయునని. గంగానది కూడ యట్లే యూహించినది. లక్ష్మణుడు గంగయొద్దను సీతను దించిపోయిన వెంటనే సీత ప్రసవవేదన భరింపలేక దుఃఖముతో గంగలో పడి యిద్దఱు మగపిల్లవాండ్రను ప్రసవించినది. పృథ్వీభాగీరథులు ఆమెను రసా తలమునకు కొనిపోయినారు. పాలు వదలిపెట్టిన తరువాత ఆ బాలుర నిద్దఱను గంగాదేవి వాల్మీకి కప్పగించినది. రాముని పంచవటీ గమనమును సరయూ నది వలన విని గంగాదేవి లోపాముద్రవలెనే యూహించి సీతను మిషపెట్టి గోదావరిని చూచుటకు పంపెను. అమ్మా ! సీతా ! కుశలవులకు ద్వాదశవత్సర సంఖ్యా మంగళగ్రంథి కట్టుచున్నారు. కావున మీ వంశమున కాది పురుషుడైన సూర్యుని నీ చేతితో కోసిన పూలతో అర్చించుటకు గోదావరి యొద్దునకు పొమ్ము. నా మహిమచే మన దేవతల కంటికి కూడ నీవు కన్పింపవు. తరువాత విరహిణియైన సీత వనమున ప్రవేశించును. ఇది విష్కంభ కథ. తృతీయాంకమునకు ఛాయాంక మనిపేరు. ఇది యీ నాటకమునందు ప్రధానమైనది. ఇది భవభూతి నాటకీయ మహాప్రతిభకు నిదర్శకము. వనమునందు సీత పూలు కోయుచుండును. ఆమెకు రాముని కంఠధ్వని విన్పించి చూచి రాముని గుర్తుపట్టి మూర్ఛపోవును. రాముడు పంచవటిని చూచి సీతావిరహముద్దీప్తమగుటవలన మూర్ఛిల్లును. సీత రాముని హృదయ స్థానమును స్పృశించును. రాముడు తేరుకొనును. రాముడు సీతా స్పర్శను గుర్తించును. సీతకొరకై పరికించును. అతని సంతాప వాక్యములు విని సీత యానందపడును. సీతాదేవి పెంచిన కరికలభమును నెదుర్కొన్న మదపుటేనుగు నుండి రక్షింపుమని సీతారాముల వనవాసమునాటి ప్రియసఖి వాసంతి యరచుచు ప్రవేశించును. రాముడు వాసంతిని, వారిరువురను సీతాతమసలు అనుసరించి పోవుదురు. గోదావరి యందలి సీతా తీర్థమున నాకరికలభము వీరు పోవుసరికి శత్రువును తోలివైచి కరిణితో జలక్రీడలాడుచున్నది. ఆ కలభమును జూచి సీతకు కుశలవులు గుర్తువత్తురు. సీత వారి ముఖములు రాముడు ముద్దిడలేక

పోయెనే అని దుఃఖించును. అచ్చట నొక నెమలి శైశవమున సీత చేతిలో పెరిగినది, తన పెద్ద పింఛమును విప్పి కడిమిచెట్టు కొమ్మపై తన పెంటితో కూర్చుండి కేకవేయుచున్నది. ఆ కడిమిచెట్టు కూడ సీత పెట్టినదే. కొంచెముగా పూచినది కూడను. ఒక కొండనెమలి సీతచే పెంపబడినది ఆ కడిమిచెట్టునందు ప్రేమ నెఱపు చున్నది. వీరిని చూచి రామునకు సీతావిరహ ముల్బణమగును. వాసంతి ఒక కదళీ వనమును దానిలోసీతారాముల శయనీయమైన శిలాతలమును చూపును. అచ్చట కూర్చుండిసీత లేళ్లకు పచ్చగడ్డి పెట్టెడిదట.ఇవి చూచి రాముడు వావిడిచి ఏడ్చును. సీత దుఃఖించును.ప్రేమ నొలుకబోయు చూపులను రామునిపై పఱపును వాసంతి, రాముని సీతకు కపటముగా ప్రేమ మాటలు చెప్పి విడిచి పెట్టితి వని నొవ్వనాడి మూర్ఛపోవును. వాసంతి మూర్ఛదేరి, నీకు యశస్సు ప్రియమైనచో సీతను విడ చుటకంటె అపయశస్సేమున్నది. ఆమె యడవిలో ఏమైయుండుననుకొను చున్నా వని యడుగును. రాము డామె క్రూరమృగములచే భక్షింపబడి యుండు నని రోదించును. వాసంతి సీతారాముల విహార భూమియైన యొక లతా గృహ మును చూపును. రాముడు మరల మూర్ఛపోవును. సీత సమీపించి హ్వాల్లలాటము లందు స్పృశించును. రాముడు తేరుకొనును. సీత, రామ స్పర్శఫలన పరవశయై చేతిని తీయలేదు. రాము డామెచేతిని పట్టుకొనును. సీత త్రొట్రుపాటున చేతిని లాగుకొని తొలగిపోవును. రాముడు సీతాకరము తనచేతినుండి జారిపోయిన దని దుఃఖించును. వాసంతి అది యున్మాద మనును. రాము డదియంతయు తన విప్రలంభ కల్పితమని దుఃఖించును. జటాయువుచే కూల్చబడ్డ రావణుని రథమును చూచి సీతారాము లున్మాదస్థితి నందుదురు. తమసా వాసంతులచే వారు తేర్పబడు దురు. రాముడు వాసంతిని నామంత్రించుట విని సీత రాముడు పోవుచున్నాడే యని దుఃఖించును. రాముని నోట హిరణ్మయమైన సీతాప్రతికృతి ధర్మ పత్నిగా నత డశ్వమేధ దీక్షితుడయ్యె నని విని సీత కృతార్థురాలై నట్లు భావించును. రాముడు పోవుటకుద్యమించుటచే సీతను మూర్ఛిల్లును. సీత అతని పాదములకు నమస్కరించి, మూర్ఛిల్లును. తమస యామెను తేర్చి, మబ్బులలో నిండు జాబిలి యెంత సేపు కన్పించు నని యోదార్చును. తమస యా సంవిధానకమునకు నబ్బురపడి కరుణ యొక్కటే రసము. నిమిత్త భేదము వలన నదియే వేరువేరు రసములుగా ప్రత్యక్షమగును. సుళ్లు చుట్టినను, నురుగులు గ్రక్కినను, కెరటములు వేచినను నివి యన్నియు నీళ్లు తప్ప జల

వికృతులే అంతయు జలమే కదా ! అని తీర్పరించును. పోవుచున్న సీతా రాము లతో పోవుచు వారిరువురకు గంగా పృథ్వులు, వాల్మీకి వసిష్ఠులు మీకు భద్ర మొసంగుదురు గాక, శుభ మొసంగుదురు గాక యని తమసావాసంతులు శుభోదర్కమైన యాశీర్వాదమును చేయుచు నిష్క్రమింతురు.

చతుర్థాంక ముఖమున కూడ మిశ్ర విష్కంభము గలదు. సౌధాతకీ భాండాయనులన్న వాల్మీక్యాశ్రమ వటువుల ముఖమున కౌసల్యాది దేవులతో నరుంధతీ వసిష్ఠులు వచ్చియుండి రనియు రాజర్షియైన జనకుడు చంద్ర ద్వీపము నందు వైఖానసవృత్తిని తపమాచరించి, యప్పుడే వాల్మీకులను చూచుటకు వచ్చి యుండెననియు సూచింపబడినది. చతుర్థాంకమునకు కౌసల్యాజనక యోగ మని పేరు. సీతా దుఃఖమున మునిగియున్న జనకుని చూచుటకు కౌసల్యారుంధతులు వత్తురు. జనకుడు సీతాపవాద ప్రస్తావనచే కుపితుడై సీత యతిలోక పావిత్ర్య మును పేర్కొనును. అరుంధతి దాని నామోదించి సీత గుణములు వర్ణించును. కౌసల్య దుఃఖావేగమున మూర్ఛిల్లును. జనకుడు పశ్చాత్తాపముతో దశరథుని తలచుకొని దురపిల్లును. తన కమండలోదకము నామెపై చల్లి తేర్చును. వారిద్దఱు పూర్వ స్నేహమున దురపిల్లుదురు. అరుంధతి వసిష్ఠుడు ఋష్యశృంగా శ్రమమున పలికిన శుభోదర్క వాక్యములను స్మరింపజేసి, అట్టి కాలము వచ్చిన దని పల్కును. ఇంతలో బాలుర కలకలము విన్పించును. అందు శ్రీరాముని పోలిక గల లవుని చూచి వారందరు ముచ్చటపడి యంతికము నకు పిల్పింతురు. సీతారాముల పోలికలను వానియందు జూచి, నాయనా, నీ తల్లి తండ్రు లెవరని యడుగుదురు. అతడు వాల్మీకిని తప్ప నెవరి నెరుగ ననును. ఇంతలో కుమార చంద్రకేతుని యాజ్ఞ యాశ్రమ భూములలోనికి చొరరాదన్నది విన్పించును. చంద్రకేతు ప్రస్తావ వశమున వాల్మీకి యుత్తర రామచరితము నభిన యార్థముగా వ్రాసి అప్సరసలచే నాడింపజేయుటకై యా పుస్తకమును తన యన్నయైన కుశుని రక్షణమున శిష్యులతో భరతమునికి పంపెననియు, నా ఘట్టమును తామధ్యయనము చేయలేదనియు, సీతా వివాసపర్యంతము తాము చదివితి మనియు చెప్పును. సీతా వివాసమన్న మాటవలన క్రుద్ధుడై జనకుడు చాపమునో, శాపమునో నుపయోగింప నాయత్తపడి యరుంధతి యనునయముచే నివృత్తుడగును. వటువులు వచ్చి గుఱ్ఱము వచ్చినది చూతము రమ్మని లవుని లాగి కొని పోవుదురు. వృద్ధులందరు వాల్మీకి దర్శనమునకు పోవుదురు. లవు డది మేధ్య యాశ్వ మని చెప్పును. వటువులు ప్రశ్నింప అది సప్తలోకవీరుడైన రాముని

మేధీయాశ్వమని సైనికులు చాటింతురు. లవుడు పౌరుషముతో గుఱ్ఱమును పట్టించి లోపలికి తోలించును. సైనికులపై చాప మెక్కుపెట్టి యుద్ధమునకు సిద్ధమగును. ఇది చతుర్థాంక కథ.

పంచమాంకము కుమారవిక్రమ మన్న పేరు గలది. లవుని చేతిలో పరీభూతమైన సైన్యమునకు బాసటగా చంద్రకేతువు ప్రవేశించి లవుని పరాక్రమమును చూచి మెచ్చుకొనును. లవుడుకూడ చంద్రకేతువునకు మెప్పుదలతో నభిముఖుడై జృంభకాస్త్రముతో సైనికుల యాటోపమును కట్టును. కుమారు లిద్ద రభిముఖులై పరస్పరాకృష్టులైనను సమరాభిముఖు లగుదురు. లవుడు పాదచారియగుట చంద్రకేతువు రథ మవరోహింప బూనును. లవుడు రథము దిగవలదనగా చంద్రకేతువు నీవు కూడ రథమెక్కి యుద్ధము సేయుమనును. లవుడు అడవి వారికి మాకు రథచర్య తెలియదని చెప్పును. ప్రసంగము రామునిపైకి తిరిగి లవుడు రాముని పరాక్రమ దోషము లెన్నును. కుమారులు పరాస్పరావహేళనములతో యుద్ధమునకు సిద్ధపడుదురు.

షష్ఠాంక ముఖమున విష్కంభము కుమారుల పరస్పర విజిగీషతోడి యుద్ధమును వర్ణించి యంత్యమున వారిమధ్య రఘుపతి ప్రవేశమును సూచించును. షష్ఠాంకమునకు కుమార ప్రత్యభిజ్ఞాన మని పేరు. రాముడు చంద్రకేతుని కౌగలించుకొని కుశలమడుగును. చంద్రకేతువు లవుని పరిచయము సేయును. లవరాములు పరస్పరాకృష్టు లగుదురు. రాముడు లవుని కౌగిలించుకొనును. లవుడు యుద్ధోన్ముఖుడై నందులకు సిగ్గుపడి రాముని క్షమింపవేడుకొనును. లవుని జృంభకాస్త్ర ప్రయోగము విని రాముడు లవునిచే నుపసంహరింపజేసి యస్త్ర సంప్రదాయప్రకార మడుగును. లవుడు తనయన్న కుశుడనియు, నిద్దరును కవలనియు జృంభకములు స్వతః ప్రకాశము లయ్యెననియు చెప్పును. అపుడు రాజసైన్యముతో లవుని యుద్ధమును విని కుశుడు వీరావేశముతో ప్రవేశించును. లవుడు కుశు నుపశమింప జేసి రాముని కభివాదము చేయించును. రాముడు వానిని కౌగలించుకొని అబోధపూర్వమై లోపలినుండి ప్రవహించుచున్న నిసర్గ స్నేహమునకు కరిగిపోవును. వారియందు తన పోలికలు, సీత పోలికలు, రాఘవకుమారచ్ఛాయలు పరిశీలించి ఆ యరణ్యమునందే సీతను విడుచుట, ఆమె గర్భము ద్విధాప్రతిపన్నమై యుండుట, చిత్రదర్శనమున పుట్టబోవు శిశువులకు తాను జృంభకాస్త్రము లొసంగుట తలంచికొని కన్నుల నీరు నించును. రాముని దుఃఖము జూచి లవుడు కారణమడుగగా, కుశుడు సీతను విడిచిన

రామునకు దుఃఖముతప్ప నేమియుండు నను. రాముడు వాల్మీకి రామాయణము మీరు చదివి యుంటిరా యని యడుగగా, కుశుడు బాల కాండాంతమున సీతా రాముల దివ్యప్రేమను గుఱించి వాల్మీకి వ్రాసిన రెండు శ్లోకములు చదువును. రాము డానాటి సందర్భమును నెమరువేసికొని దుఃఖించుచుండగా, చిత్రకూట వన విహార ఘట్టము నందలి సీతను గుఱించి రాము డన్న మరొక శ్లోకమును పఠించును. రాము డలనాటి మాధుర్యమును తలంచికొని కుమిలిపోవును. ఇంతలో నేపథ్యము నుండి జనక వాల్మీకి వసిష్ఠులు అరుంధతీ కౌసల్యాదులు శిశు కలహమును విని వచ్చుచున్నారను మాట విని దుఃఖితుడైన రాముడు వారి నెదుర్కొన పోవును.

సప్తమాంకమునకు సమ్మేళనాంకమని పేరు. దీని యందు సీతా ప్రసవ వృత్తాంతము అంతర్నాటకముగా నిబంధితమై కడకు పృథ్వీగంగారుంధతులు సీత పావిత్ర్యము సర్వలోకవిదితము గావించి సీతా లవకుశులను వాల్మీకి రామున కప్పగించుటలో పర్యవసించును. వాల్మీకి తన ప్రభావమువలన త్రిలోక వాసులగు భూతగ్రామమును తన నాటకప్రయోగము తిలకించుటకు గంగ యొడ్డున సన్నిధాపితము చేయును. లక్ష్మణుడు రామాజ్ఞచే మర్త్యామర్త్యులకు సముచిత స్థానము లేర్పాటు చేయును. లవ కుశులు చంద్రకేతువుతో సరిగా కూర్చుందురు. రామలక్ష్మణులు కూర్చున్న తరువాత నాటక మారంభమగును. సీత ప్రసవవేదనతో గంగలో దుముకుట సూచింపబడుటతో నాటకమారంభ మగును. రామునకు దుఃఖ ముల్బణమగును. పృథ్వీ భాగీరథుల నవలంబించి సీత యొడి యందు కవల పిల్లలను చేర్చుకొని రంగమునందు ప్రవేశించును. వారిని గంగా పృథ్వులనుగా నెఱింగి సీత తన స్థితికి విలపించును. సీతా పృథ్వులు కౌగిలించుకొని మూర్ఛ పోవుదురు. తల్లిప్రేమచే పృథ్వీదేవి రాముని నిందించును. భాగీరథి రాముని రాజధర్మ పరాయణత్వము చెప్పి వారి ననునయించును. పృథ్వి రాముని దుఃఖము తా నెరుగుదుననియు దుఃఖముతో సీతను త్యజించి కూడా అతడు ప్రజా పుణ్యముచే జీవించి యున్నాడనియు చెప్పును. సీత పృథ్విని తన్ను లోజేర్చుకొమ్మని యడుగగా పిల్లల కొఱకు బ్రదుకుమని భూమిచెప్పును. సీత తన యనాథత్వమునకై దురపిల్లును. గంగా పృథ్వులు మా యిద్దరి కంటె నీవు పవిత్రురాలవని యామె నోదార్తురు. ఇంతలో నస్త్రదేవతలు స్ఫురించి

అనుజ్ఞాతలై అంతర్హిత లగుదురు. స్తన్యత్యాగానంతరము క్షత్రియోచిత కర్మములకు భాగీరథి వాల్మీకికి వారి నప్పగింతునని చెప్పును. వారే కుశలవులని రామలక్ష్మణులు గుర్తింతురు. సీత పృథ్వీదేవితో రసాతలమునకు పోవుట రంగము నందు చూచి రాముడు మూర్ఛితుడగును. తరువాత గంగ నుండి గంగా పృథ్వీ సీతలు బయల్వెడలి, సీత నరుంధతికి కప్పగింతురు. అరుంధతి యాజ్ఞచే సీత రాముని స్పృశించును. శాంతర్ష్యశృంగులతో గురుజనమును సీతను చూచి రాముడు లజ్జించును. గంగాపృథ్వులు చిత్రదర్శన సమయమున రాముడు చెప్పిన మాటలను వారు పరిపాలించితిమని చెప్పుదురు. (చిత్ర దర్శన సమయమున సీతకు మంగళము కలుగ చేయుమనియు గంగాదేవిని, నామెను కాపాడవలసినదని పృథ్వీదేవిని కోరెను.) అరుంధతి గంగాపృథ్వులట్లు ప్రసంశించిన సీతను తాను రామునకు సమర్పించుచుంటిననియు నామెను పూర్వ మగ్నిహోత్రుడు పుణ్యచారిత్రయని నిర్ణయించెననియు బ్రహ్మాది దేవత లామెను సంస్తుతించిరనియు ప్రకటించి వారి యభిప్రాయము చెప్పుడని కోరెను. ప్రజలందరును అచ్చట చేరిన సర్వభూతములు సీతకు నమస్కరించిరి. సప్తర్షులు లోకపాలురు పుష్పవృష్టి కురిపించిరి. వాల్మీకి కుశలవులను రామున కప్పగించును. రాముడు వారిని స్వీకరించును. ఈ రామకథ పాప నివారకము. పవిత్రము. శ్రేయస్సులను పెంచునట్టిది. శుభకరమైనది, మనోహరమైనది. గంగవంటి దీ కథ. పరిణత ప్రజ్ఞుడు, శబ్ద బ్రహ్మవేత్తయైన మహాకవి వాక్కులలో అభినేయార్థమైన యీ కథను పండితులు చక్కగా భావింతురుగాక అన్నమంగళాశాసనముతో నాటకము శుభాంతముగా ముగియును. ఇది యుత్తర రామచరిత నాటక కథ.

వాల్మీకి రచితోత్తర రామాయణ గాథ నెఱింగిన వారికి భవభూతి కథ నెట్లు మార్చి రసానుకూలముగ మలచెనో తెలియగలదు. పద్మ పురాణమునందును జైమిని భారతమందును సంయోగాంతముగా నీ గాథ కన్పించును. భవభూతి చేసిన మార్పునకును, వానికిని బహ్వంతరములున్నవి. కుందమాలలో కూడ సంయోగాంతముగనే నీ కథ నిబంధితమైనది. భవభూతి కథకు దానితో సామ్య భేదములు కలవు. వాని నన్నింటిని వివరించుట కిది తావుకాదు. కవి యుద్దేశించిన ప్రయోజనమును బట్టి కథను మార్చుట సంప్రదాయ సిద్ధమైనదే. కావ్యమునకు చెప్పిన ప్రయోజనములలో రసోపదేశములన్నవి రెండును ముఖ్యమైనవి. రసము మాట తరువాత పరిశీలింతము. ఇందలి యుపదేశ మేమన్నది చూతము.

భవభూతి యిందు చెప్పదలచుకొన్నదేమి? ఈ ప్రశ్నను గుఱించి వ్యాఖ్యాతలు గాని, విమర్శకులు గాని యాలోచించినట్లు కనపడదు. వారెవరికి నీప్రశ్నయే పుట్టినట్లు లేదు. భవభూతి భారతీయ నాగరకత కంతకును వైదికమతమున కంతకును జీవగఱ్ఱయైన దాంపత్య జీవనపరమార్థము నీ నాటకమునందు చిత్రింపదలచుకొనెను. కాళిదాసు నభిజ్ఞాన శాకుంతలమును గుఱించి యభియుక్తులిట్లు చెప్పుదురు: దుష్యంతుడు శకుంతలను మూడు తడవలు కలిసికొనెను. 1) కణ్వాశ్రమములో, 2) రాజసభలో, 3) మారీచాశ్రమములో. తొలిసారి కల్సినది శారీరకాకర్షణ- అప్పటి యతని శకుంతలా వర్ణనము.

అధరః కిసలయరాగః
కోమల విటపానుకారిణౌ బాహూ
కుసుమమివ లోభనీయం
యౌవనమంగేషు సన్నద్ధం.

పెదవి చివురుటాకువలె నెఱ్ఱగా నున్నది. లేత కొమ్మలవలె భుజములున్నవి. అవయవము లన్నింట యౌవనము నిండి కోరదగినట్లుగా నున్నది. మఱితడవ శంకా కళంకితమైన మానసిక స్థితి:

కాస్విదవగుంఠనవతీ
నాతిపరిస్ఫుట శరీర లావణ్యా
మధ్యే తపోధనానాం
కిసలయమివ పాండుపర్ణానాం.

ఈ ముసుగు వేసికొనియున్న యామె యెవరై యుండును? ఈమె శరీర లావణ్యము ప్రస్ఫుటముగా లేదు. ఈ తాపసుల మధ్య, ఎండుటాకులలో చివురుటాకువలె నున్నది. మూడవ సారి-

వసనే పరిధూసరే వసానా
నియమక్షామముఖీ ధృతైకవేణీ
అపి నిష్కరుణస్య శుద్ధశీలా
మమవిరహవ్రతభారం బిభర్తి.

మాసినచీర కట్టుకొన్నది. నియమములచేత ముఖము పాలిపోయినది జుట్టు జడ కట్టినది. నా విరహవ్రతభారము మును భరించుచున్నది.

మూడు శ్లోకములు వ్రాసి దాంపత్యము నందలి మూడవస్థలను వర్ణించి శారీరకాకర్షణ యస్థిరమని ము అర్ధార్థముగా నర్థ సుగుట దుఃఖహేతువనియు,

శీల పరిచయమున దాంపత్యము సుప్రతిష్ఠిత మగుననియు కాళిదాసుని సందేశమని, మరి భవభూతి వ్రాసినది చూడుడు:

అద్వైతం సుఖదుఃఖయో, రనుగతం సర్వాస్వవస్థాసుచ,
యద్విశ్రామోహృదయస్య యత్ర, జరసాయస్మిన్నహార్యో రసః
కాలేనావరణాత్యయా త్పరిణతం యత్ప్రేమసారేస్థిరం
భద్రం తస్య సుమానుషస్య కథమ ప్యేకం హి తత్ప్రార్థితం

సుఖములందు నేకరీతిగా నుండునది, అన్ని యవస్థలయందును ననుగతముగా నుండునది, హృదయమునకు విశ్రాంతి యిచ్చునది; వార్ధక్యముచే హరింపరాని రసము గలది, కాలక్రమమున అరమరికలు తొలగిపోయి, పండిన ప్రేమనిగ్గునందు స్థిరముగా ప్రతిష్ఠితమగునట్టిది-ఇట్టి దాంపత్యము భద్రమైనది. (లేక దీనికి భద్రమగుగాక యని యాశంస.) ఏ విధముగనైన నీ యొక్కటియే కోరుదును.

అనగా కాళిదాసు వదలిపెట్టినచోట భవభూతి మొదలుపెట్టినాడు. సీత లావణ్యమును రాముడు వర్ణించినను నదివట్టి శరీరాకర్షణము తెలియచేయదు.

ఇయం గేహే లక్ష్మీ రియ మమృతవర్తి న్నయనయో
రసావస్యా స్పర్శో వపుషి బహుళ శ్చందనరసః
అయం కంఠే బాహుః శిశిరమసృణో మౌక్తికసరః
కిమస్యాన్నప్రేయో యది పరమ సహ్యాస్తు విరహః
అలస లలితముగ్ధాన్యధ్వ సంజాతఖేదా
దశిథిల పరిరంభై ర్దత్త సంవాహనాని
పరిమృదిత మృణాలీదుర్బ లాన్యంగకాని
త్వ మురసి మమకృత్వా యత్రనిద్రామతాప్తా

ఈమె ఇంటికి లక్ష్మి. కన్నులకు నమృతపువర్తి. ఈమె స్పర్శ దేహమునకు చక్కని చందన రసము. నా కంఠమందలి ఈమె బాహువు ముత్యాల పేరు. ఈమెను గుఱించినది ప్రియముగాని దేది ? భరింపరాని దొక్కటియే. ఈమె విరహము— ఓ సీతా! యిచ్చటనే గదా నీవు పథిశ్రమముచే నలసిపోయిన నీ లలితసుందరములైన యంగకములను వాడిన తామర తూడులవలె దుర్బలములైనవానిని నా యురమున చేర్చి బిగికౌగిలిచే సంవాహనము పొందుచు నిద్రించితివి. ఇత్యాది వర్ణనయందు 'యత్ప్రేమ సారేస్థిరం' అన్న దాంపత్యపు చొక్కుతప్ప వట్టి శారీరకమైన కామతృప్తి కాదని వేఱ చెప్పవలెనా!

వాల్మీకి రామాయణము నందు ప్రధానాంశ మేది ? రామాయణము మనమును చదివితిమి. భవభూతియు చదివెను. ఆయన దాని నుపాసించెను. రాముడు మనకు దేవుడు. ధర్మమూర్తి. ఆదర్శపురుషుడు. మహావీరుడు. సీత మహా పతివ్రత. ఇవి యన్నియు సరే! వీని కన్నింటికంటె ముఖ్యమైనది, ప్రాణభూతమైన దొకటున్నది. అది రామకథయందంతటను గూఢముగా ననుస్యూతముగా వ్యాపించియున్నది. అది లేనిచో రామకథ లేదు. రామాయణ మన్న పేరులోనే వాల్మీకి దానిని సూచించినాడు. అది సీతారాముల దాంపత్యము. వారి యతిలోకమైన ప్రేమలక్షణము. ఇదియేనా! ఇది యందరకును తెలిసినదే యని మన మనుకొనవచ్చును. కాని, మనకు తెలియదు. భవభూతి కొక్కనికే తెలియును. మనకు మొద్దుగా తెలియును. భవభూతికి వివిచ్యమానముగా తెలియును. దానియందలి శిల్ప చమత్కారము తెలియును. షష్ఠాంకమున కుశుడు లవునితో 'వినా సీతాదేవ్యాః కిమివహి న దుఃఖం రఘుపతేః' యనును. 'పృచ్ఛస్వ నధిగత రామాయణ ఇవ' యనును. రామునిచే నడుగబడి కుశుడు బాలకాండాంతమునందలి శ్లోకముల రెండింటి నుదాహరించును.

> 'ప్రియాతు సీతా రామస్య దారాః పితృ కృతాయితి
> గుణై రూప గుణైశ్చాపి ప్రీతిర్భూయో భ్యవర్థత'
> 'తథైవ రామ స్సీతాయాః ప్రాణేభ్యోపి ప్రియో భవత్
> హృదయ స్త్వేవ జానాతి ప్రీతి యోగం పరస్పరం.'

రామునికి తండ్రి చేసిన భార్య యని సీత ప్రియమయ్యెను. ఆప్రేమ సౌందర్య సౌశీల్య గుణములచే మిక్కుటముగా వృద్ధి పొందెను. అట్లే సీతకు రాముడు ప్రాణముకంటె ప్రియుడయ్యెను. వారి పరస్పర ప్రేమ హృదయమే యెరుగును. అనగా మనసుతో తెలియదగినది గాదు. హృదయము తోడనే తెలియదగిన దని యర్థము. ఈ మాటను పట్టుకొని భవభూతి యుత్తర రామ చరిత్రమునందు సాగకొట్టెను. 'హృదయ స్త్వేవ జానాతి' యనుటలోని శిల్ప చమత్కార మెరుగుటకు బ్రహ్మ కావలయును. భవభూతి యట్టి బ్రహ్మ. అందు కనియే హార్దమైన యీ దాంపత్య ప్రేమను హార్ద సంవాదమును చేయుటకు ప్రథమాంకముననే రామునినోట ప్రతిపాదించినాడు. దానిని వ్యాఖ్యానించుటకు స్పర్శగుణమును ప్రవేశ పెట్టినాడు.

ఈ స్పర్శగుణము యుత్తర రామచరిత నాటక నిర్మాణమునందలి కీలుకు. ప్రధాన శిల్ప స్తంభము. ప్రథమాంకములో రాము డనును-

వినిశ్చేతుం శక్యో న సుఖమితి వా దుఃఖమితివా
ప్రమోహో నిద్రావా కిము విష విసర్పః కిము మదః
తవస్పర్శేస్పర్శే మమ హి పరి మూఢేంద్రియగణో
వికారశ్చైతన్యం భ్రమయతి సముస్మీలయతి చ.

ఇది సుఖమో, దుఃఖమో చెప్పలేను. ఇది మూర్ఛయో, నిద్రయో, విష వ్యాపనమో, మదమో తెలియదు. నీవు ముట్టుకొన్నప్పుడెల్ల నా ఇంద్రియము లవశములై పోవునట్టి వికారముగల్గి, నా తెలివిని ముకుళింప చేయును, వికసింప చేయును. (సీతస్పర్శ) తెలివిగా నున్నదానిని ముకుళింపజేయును. మూర్ఛలో నున్న వికసింప జేయును. ఉత్తర కథ యంతయు నిదియే. ఛాయాంకమున రాముడు రెండుసార్లు మూర్ఛిల్లును. సీతస్పర్శవలన తేరుకొనును. సప్త మాంకమున సీత స్పర్శవలన తేరుకొనును. ఉత్పన్న ప్రాయమైన రాముని ప్రత్యాశ సీత స్పర్శవలన పల్లవితమగును. రాము డేకపత్నీవ్రతు డనగా నిది. దాని నిష్ఠ యెట్టి దనిన అంత సుకుమారమైన, సుంకుదేరిన స్పర్శ గ్రహణము గలది. ఆ స్పర్శ కేవల శరీర గతమైనది కాదు. ఆత్మ పర్యంత వ్యాపి యైనది. సీతకు నట్లే యన్నమాట. పూర్వోక్తమైన దాంపత్యమునందలి దివ్యలక్షణ మును వ్యక్తము చేయుచున్న దీ భవభూతి నిబంధించిన స్పర్శగుణము.

దాంపత్యమునకు ముఖ్య ప్రయోజనములు రెండు. ఒకటి భోగము, రెండు సంతానము. భవభూతి వర్ణించిన దాంపత్యమునకు కూడ నివియే ప్రయోజనములు. కాని, వాని యందొక యసాధారణత్వమును భవభూతి నిర్దే శించెను. ఆ భోగము రస పర్యవసాయి. కామతృప్తి కాదు. ఆ సంతానము 'అంగాదంగా త్సంభవసి హృదయదధిజాయసే ఆత్మావై పుత్రనామాసి.' ఇందు వర్ణితమైన మూడు లక్షణములు పూర్ణముగా నున్నట్టిది. షష్ఠాంకమున రాముడు కుశుని కౌగలించుకొని యిట్లనుకొనును-

అంగా దంగాత్సృత ఇవ నిజోదేహజః స్నేహసారః
ప్రాదుర్భూయ స్థిత ఇవ బహిశ్చేతనా ధాతురేవ
సాన్ద్రానందః క్షుభిత హృదయ ప్రస్నదేవేవసృష్టో
గాత్రం శ్లేషే యదమృతరసస్రోతసాసించతీవ.

ఈ పిల్లవాడు నా ప్రత్యంగమున నుండి స్రవించిన ప్రేమసారమా! ఆకృతి దాల్చి యెదురుగా నిల్చిన నా యాత్మయా! నా హృదయమునుండి జాలువారిన ఆనందపు ముద్దయా! వీనిని కౌగలించి అమృతరస స్రోతస్సులో నా దేహము

మునిగినట్లున్నది. పై నుదాహరించిన వేదమంత్రమందలి మూడు లక్షణములు భవభూతి వర్ణనములో నున్నది. సంతానమునం దీ వర్ణన లెంతెంత తక్కువగా నున్న దాంపత్యపు జీవితమునం దంతంతగా ననుభూతి భౌమమగుచుండును. ఎంతెంత యధికముగా నున్న అంతంత దివ్యమగుచుండును. ఆత్మావై పుత్ర నామాసి యన్నది సంతతి స్వచ్ఛతకు పరాకాష్ఠ. రసపర్యంతముగా భోగ మన్నది దంపతుల శీలమునకు పరాకాష్ఠ. అందుకనియే సీత పావిత్ర్యమును, సచ్ఛీలమును మొదటినుండి తుదిదాకి పఱచి చూపించినాడు. 'ఉత్పత్తి పరి పూతాయాః కిమస్యాః పావనాంతరైః తీర్థోదకం చ వహ్నిశ్చ నాన్యత శ్శుద్ధి మర్హతః' అని రాము డనును.

'శిశుర్వా శిష్యావా యదసి మమ తత్తిష్ఠతు తథా
విశుద్ధే రుత్కర్ష స్త్వయి తు మమ భక్తిం ద్రఢయతి'

అని యరుంధతి యనును. నాకు నీవు శిష్యురాలవో, బిడ్డవో యట్లుండనిమ్ము. నీ పావనత్వాధిక్యతచే నీయందు నాకు భక్తి గలుగుచున్నది.

భవభూతి వర్ణించిన దాంపత్య లక్షణము, స్పర్శ లక్షణము, సంతాన లక్షణము నొకదానితో నొకటి యెంత చక్కగా సంవదించుచున్నవో చూడుడు.

మనము నాటక మందుము. నాటక మనగా దృశ్యమని మన యర్థము. ఆంగ్లములో Drama యందురు. అనగా దృశ్య విషయమే. మనము నాటకీయ మందుము. ఆంగ్లమునందు Dramatic అందురు. 'దృశ్య విషయికమైన' యని దాని యర్థము. కాని, కొన్ని కొన్ని సంఘటనలను చూచి మనము చాల Dramatic గా నున్న దందుము. నిజ జీవితములోని సన్నివేశములు కొన్ని Dramaticగా నుండవచ్చు నన్నమాట. ఇచ్చట 'Dramatic' అన్న మాట కర్థమేమి ? ఇదమిద్ధమని యర్థము చెప్పలేము. ఏదో యొక యలౌకికాను భవమును కల్గించు సన్నివేశములను Dramatic గా నున్నవని యనవచ్చును. నాటకీయత యనగా నట్టిదే. మృచ్ఛకటికములో చందనకుడు, వీరకుడు నను నిద్దఱు రాజభటులు వసంతసేన బండిలో నార్యకుడు పోవుచుండగా ఆ బండి నాపి వారిలో వారు కలహించినప్పు డార్యకు డనుకొనును: 'అయం మే పూర్వ మిత్రం అయం మే పూర్వ వైరీ'. వీనికిని నాకును జన్మాంతర మైత్రి. వీనికిని నాకును జన్మాంతర విరోధము. అభిజ్ఞాన శాకుంతలములో హంసపదిక యుపా లంభమును విని రా జావేదనమును పొందును. కారణోన్నేయమున 'రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్ పర్యుత్సుకీ భవతి యత్సుఖతోపి జంతుః

తచ్చేతసా స్మరతి నూన మబోధపూర్వం భావస్థిరాణి జననాంతర సౌహృదాని' యనును. ఉత్తర రామచరిత్రలో రాముడు లవుని జూచి-

'వ్యతిషజతి పదార్థానాంతరః కోపి హేతుః
న ఖలు బహిరుపాధీన్ప్రీత యః సంశ్రయంతే
వికసతి హి పతంగస్యోదయే పుండరీకం
ద్రవతి చ హిమరశ్మౌ వుద్గతే చంద్రకాంతః'

అనును. ఈ మూడు ఘట్టములు నలౌకికమైన యనుభూతిని కల్గించునట్టివే. నన్నయగారి నలచరిత్రమున రాజమాత దమయంతిని దూరమునందు చూచి "యకో్క-మలియందు నా కతి స్నేహంబై యున్న యది. దాని కొనిరమ్మని" దాదితో చెప్పును. ఈ సన్నివేశము లన్నియు తుల్యములే కారణము. నూహించు టలో భేదమున్నది. శూద్రక కాళిదాసులు జన్మాంతర సంబంధమును తడవినారు. కాళిదాసు ఒక మెట్టు పైకిపోయి అట్టి సందర్భములందు యొక వేదన యుట్టిదని చెప్పరానిది యనుభూత మగునన్నాడు. భవభూతి సూత్రము 'కోపి హేతుః' అన్నాడు. పదార్థముల పరస్పరాకర్షణమునకు నిదమిత్థమని చెప్పరాని యాంతర మైనదేదియో హేతువు. బాహిరమైనయుపాధులు హేతువులు కావు. సూర్యు డుదయించిన తామరపూవు వికసించును. చంద్రు డుదయించిన శశికాంతము జాలువారునని యర్థము. కాళిదాసు శ్లోకమున కర్థము రమ్యవస్తువులను చూచి మధుర శబ్దములను విని జనుడు వేదన పొందును. దానికి కారణము జన్మాంతర సంస్కారముల యస్పష్టమైన ఆంతరస్మరణము అని. మఱి భవభూతి 'కోపి హేతుః' అన్నమాట కర్థమేమి ? నన్నయగా రసలు కారణమునే చెప్పలేదు.

అహేతుఃపక్షపాతో య స్తస్యానాస్తి ప్రతిక్రియా
సహిస్నేహాత్మక స్తంతు రంతర్మర్మాణి సీవ్యతి.

హేతువులేని ప్రేమకు తిరుగులేదు. అది ప్రేమద్వారము. హృదయములోని మర్మములను పరస్పరము కలిపి కుట్టును.. 'భూయసా జీవి ధర్మ ఏషః యత్ర రసమయీ కస్యచిత్ క్వచిత్ప్రీతిః, యంత్రలౌకికానాం వ్యవహారస్తారామైత్రికం చక్షూరాగఇతి తమ ప్రతి సంఖ్యేయం ప్రేమాణ మామనంతి'. ఇది బాగుగా జీవిధర్మము. ఒకానొకనికి నొకానొకచోట రసమయమైన ప్రీతిగల్గును. లోకములో దీనినే తారామైత్రికమనియు, చక్షూరాగమనియు నందురు. ఇది ఆ ప్రేమ తిరుగులేనిదని చెప్పును. కాళిదాసు చెప్పిన వేదనకు వ్యాఖ్యానము చెప్పుట యిది. ఆవేదన జీవసంపుటిగతమైన వేదన. జీవుడు పరమేశ్వరునితో తెలిసియో

తెలియకయో నిత్యవిరహ మనుభవించుచున్నాడు. ఇదియే జీవుని వేదన. ఒక్కొక్క సన్నివేశమున వాని చిత్తవృత్తి యంతర్ముఖమై జీవసంపుటియందు మగ్నమగును. ఈశ్వర విరహము ననుభవించును. 'కోపి హేతుః' అనగా యీశ్వరుడే కావుననే భవభూతి 'ఏకోరసః కరుణ ఏవ' యని సిద్ధాంతము చేసినాడు.

ఏకోరసః కరుణఏవ నిమిత్తభేధాత్
భిన్నఃపృధక్ పృధగివాశ్రయతే వివర్తాన్
ఆవర్తబుద్బుద తరంగమయా న్వికారాన్
అంభో యథా సలిలమేవ హి తత్సమస్తం.

కరుణ మొక్కటియే రసము. తక్కిన రసములన్నియు నిమిత్తభేదములను బట్టి దాని వికారరూపములై కన్పించును. సుళ్లు, నురుపులు, తరంగములు మొదలైనవి నీటి వికారములే గదా అని. కావున రసము పేరేదైనను సారమున కరుణమే.

ఉత్తర రామచరితమున రస మేది యన్నవి వాదములు కలవు. కొందరు ధర్మవీర మనియు కొందరు విప్రలంభమనియు కొందరు కరుణ మనియు వివదింతురు. కొందరు కరుణ విప్రలంభమని చెప్పుదురు. విప్రలంభము అయోగ వియోగ భేదములచే రెండు విధములు. వియోగవిప్రలంభము మానప్రవాస కరుణభేధములచే ముప్విధము. ఆనందవర్ధనుడు కరుణభేదము నంగీకరింపలేదు. పలువురాలంకారికులు దీని నంగీకరించిరి. ఇది ప్రవాసము క్రిందకు వచ్చునా, మరణానంతరము పునరుజ్జీవనము క్రిందకువచ్చునా యను వివాదములు లేచినవి. నాయికా నాయకగతమైన ప్రత్యాశ లేదు గావున నిది కరుణమని కొందరిమతము. ప్రత్యాశ లేనప్పుడు స్థాయి విచ్ఛిన్నమగును. శోకము స్థాయియగును. కావున రసాంతర ప్రతిపత్తి ఏర్పడుననిరి. కాని, యిచ్చట స్థాయి విచ్ఛిన్నప్రాయమన వచ్చునుగాని విచ్ఛిన్నమన నక్కలేదు. కావున శోకము వ్యభిచారియేగాని స్థాయి గాదు. రామునికి కల్గినది సీతమరణశంకగాని నిశ్చయముగాదు. అతడు యజ్ఞ నిర్వహణమునకై పెట్టుకొన్న హిరణ్మయ ప్రతికృతి పత్యంతరముగాదు. అది సీతాప్రతికృతి. కావున నిట రత్యుత్సన్నత లేదు.'అత్ర బాష్పదిగ్ధం చక్షుర్వినోద యామి' యని రాముడన్నమాట. కావున నిట రసము ప్రవాస విప్రలంభ మన్నను, కరుణ విప్రలంభమన్నను బాధలేదు. ఎట్లైనను భవభూతి సిద్ధాంత మును బట్టి నిది కరుణ రసమే.

అట్లైన భవభూతి తన సిద్ధాంతమును ఛాయాంకాంతమున ప్రతిపాదింప నేల ? ఉత్తర రామ చరిత్రముననే ప్రతిపాదింప నేల ? అతని దృష్టిలో వీర శృంగారాది సర్వ రసములు కరుణ వికారములే గదా ! మాలతీ మాధవము, మహా వీర చరితము, ఉత్తర రామ చరితము నందలి పంచమాంకము, శృంగార వీర ప్రధానములైనవి కూడ కరుణ రసవ్యంజకము లని చెప్పి యచ్చట నీ సిద్ధాంతమును ప్రతిపాదింపవచ్చును గదా యన్నచో, నిజమే-చర్వణ యందలి యాకార భిన్నత్వమును బట్టి, మాలత్యాదులందు సిద్ధాంత ప్రతిపాదనము చేసిన విడ్డూరముగా కన్పించును. ద్రుతి, దీప్తి, విస్తరము లన్నవి రస ధర్మములు. ద్రుతి లేక దీప్తి విస్తరములుండవు. దీప్తి విస్తరములు ద్రుతి వికారములైనను వాని యందు ద్రుతి స్వరూపము భాసించదు. ఫేనబుద్బుదములు జల వికార ములేయైనను వాని యందు జల స్వభావము భాసించునా ? విప్రలంభమందన్ననో ద్రుతి యధికముగా భాసించును. తరంగములు జలవికారమైనను జల లక్షణము భాసించును గదా ! కావున మూల భూతమైన కరుణ రసమునందువలెనే, అచ్చ మగు రస ధర్మము విప్రలంభమునందు సమానాకారముగా భాసించుటను బట్టి ఛాయాంకమునందే దీనిని ప్రతిపాదించుట నైపుణ్యము. మరియును నుత్తర రామ చరిత్రమునందు భవభూతి కరుణమునే నిబంధించియున్నచో రసాంతరము లన్నియు కరుణ వికారములని నిర్ణయింపనగునా ? విప్రలంభమును నిబంధించి దానిని కరుణ వికారమని చూపుటకు దానిని కరుణ వికారమని ప్రవచింపవలెను. ప్రవచించినచో నది సిద్ధాంత స్తావక మగును. ఛాయాంకమునందు విప్రలంభము గరిష్ఠ స్థాయినందుకొన్నది. కథ యందు కూడ తృతీయాంకము సంవిధానకము. భాస కాళిదాస దిఙ్నాగులు కూడ ఛాయాంకములను నిర్మించిరి. కాని, అగ్ర తాంబూలము భవభూతిదే. వారి రచనలందీ సమస్యను గుఱించి మనసు పట్టించు కొనము. కారణ మేమన అందు విప్రలంభమున కతి నిర్వాహము లేదు. ఉత్తర రామ చరితమునందు విప్రలంభమునకు నిర్వాహ మధికమై యీ సమస్యను తెచ్చి పెట్టెను. ఈ సమస్యను సృష్టించి యచట రసము విప్రలంభమైనను నది కరుణ వికారమే యని భవభూతి నిర్ణయించినాడు. ఇది యిందలి సొగసు. ఛాయాంక నిర్మాణమును జాగరూకముగా పరిశీలించినచో నీవిషయము మన కవగతమగును. ''రామస్యగాత్రమసి దుర్భరగర్భ ఖిన్న సీతా వివాసనపటో కరుణామత స్తే'' యని తనహస్తమును నింధించుకొనును. నిండు చూలాలైన సీతను ప్రవాస

మంపితివి. నీకు దయ యెక్కడిది యని ద్వితీయాంకమున రాము డనును. అట్టి రామునికి ననుభవము నందున్నది కరుణ రసమని తృతీయాంకమునకు పూర్వ మందలి విష్కంభమున చెప్పబడినది.'అనిర్భిన్నో గభీరత్వా దంతర్గూఢ ఘనవ్యథః పుటపాక ప్రతీకాశో రామస్య కరుణోరసః''.ఈ మాటలన్నది మురళ. తృతీయాం కాంతమున అహో సంవిధానకం! ఏకోరసః కరుణ యేవేత్యాదిగా చెప్పినది తమస. తమసామురళల కిరువురకు సీత బ్రదికి యున్నదని తెలియును. సీత తమస వెంటనే యున్నది. కావున తమసామురళలకు నీయంకమునందనుభూతమగు నది మనమనుకొను కరుణ రసమెట్లగును.? 'రామస్య కరుణోరసః' అన్న చోట రస శబ్ద మౌపచారికమని చెప్పక తప్పదు. 'రామస్య' యన సంబంధ షష్ఠిచేత నిది లౌకిక భావమైన శోకమే యగును. ఈ శోకము సీతా వివాసకృతమైనదని ద్వితీయాంకమున రాముని నోటనే మనము వింటిమి. తృతీయాంకమున రాము నికి సీత కన్పించదు. సీతకు మాత్ర మతడు కన్పించును. రామదుఃఖమంతయు, రాముని ప్రేమ లోతు లన్నియు, తత్తత్ స్థలము లందు ప్రకటితములై సీతకు సంతుష్టి కల్గినది. ఈ యంకమునందు రెండు తడవలు రాముడు మూర్ఛిల్లును. సీత స్పర్శ వలన తేరుకొనును. ఈ అంకమంతయు సమ్ముఖమున విరహాను భూతి కానిచో దీనియందలి సంవిధానకత్వమే నిరస్తమగును. సీతారాముల దివ్యప్రేమను, తద్వ్యంజకమైన స్పర్శ సౌకుమార్యమును నీ యంకము వెల్ల డించుచు వానిని వారి విరహమున కుద్దీపకముగా ప్రవర్శించుచున్నది. కావున రతి స్థాయికమైన విప్రలంభమే యిది.

మఱియును దైవ విపర్యయము, విధి విలాసము, ఉపశ్రుతి, నాటకీయత, వీని ప్రభావము మానవ జీవితముపై యెంత బలముగా నుండునో భవభూతి యీ నాటకమునందు చూపించినాడు. సీత పరిశుద్ధి యెఱిగిన రాముడే యామెను త్యజింపవలసి వచ్చుట, భర్తృ ప్రేమనంత యాచికొన్న సీత గంగలో దుము కుట, పరమేశ్వరుడైన రాముడు దుర్భరవ్యధాభిన్నుడగుట-ఇవి దైవ విపర్య యము. గంగా పృధ్వులు సీత నాదుకొనుట, సీతారాము లడవిలో సమావిష్టు లగుట, లవ చంద్రకేతుల యుద్ధము, కుశలవులతో రాముని సమాగమము- ఇవి దైవ విలాసములు. శాంతారుంధతులు సీతకోర్కె యేదైనను తీర్పుమనియు, వసిష్ఠుడు ప్రజానురంజనము ప్రధానమనియు సందేశమంపుట- ఇవి ఘటనాత్మక మైన యుపశ్రుతులు. వీని యన్నింటి యందున్న పరస్పర సంబద్ధతను వ్యాక రించుట నాటకీయత. ఇవిగాక వాగ్రూపమైన యుపశ్రుతి యీ నాటకమునం

దున్నంత మరెచ్చుటనూ లేదు. 'లౌకికానాం హి సాధూనాం అర్థం వాగనువర్తతే. ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోను ధావతి' యని రామునినోట ప్రథమాంకముననే ప్రతిపాదితమైన యీ చిన్ని శ్లోకము నాటకమునందు కొసవరకు అంత ర్వ్యాప్తముగా నున్నది:

'యదివా జానకీమపి ఆరాధనాయ లోకస్య ముంచతో నాస్తిమేవ్యథా'

'సాత్వమంబ స్నుషాయాం సీతాయామరుంధతీవ శివానుధ్యానపరాభవ'

'ప్రత్యాపన్నస్స పునరివమే జానకీ విప్రయోగః. యది పరమసహ్యోస్తు విరహః. దేవ ఉపస్థితః.'

ఇత్యాదులు వాగ్రూపములైన యుపశ్రుతుల కుదాహార్యములుగా నున్నవి. ఇవి యన్నియు భవభూతి మహాప్రతిభాసంపాదితములు.

దీనిని విడిచి యాతని పద్యరచన యున్నది. భావరచన యున్నది. వానిని గుఱించి ప్రస్తరించుట కిది యదను కాదు. అందు కనులకు మిరుమిట్లు గొలుపు గొప్ప మెఱుపులున్నవి. మేఘగర్జనలున్నవి. మధువృష్టి యున్నది. అప్సరో నృత్యములున్నవి. మలయ మారుతమున్నది. మహోర్మి ఘుఘు యున్నది. క్రమ ముగా నుదాహరణములు. ఆయన వాక్కులో దివ్యత్వమున్నది. ఆయన గాఢ శీలి. ఏది చెప్పినను హృదయపు లోతులలో నుండి చెప్పును. సామాన్యముగ నేలమీద నిల్చి చెప్పుచునే యాకసమున కెగిరిపోవును.

జీవత్సుతాత పాదేషు నూతనేదార సంగ్రహే

మాతృభిశ్చింత్య మానానాం తేహినోదివసాగతాః

తండ్రి బ్రతికియున్నాడు. పెండ్లియైన క్రొత్త. అమ్మ అన్నిసౌకర్యములు చూచుచున్నది. ఇంతవరకు నీ మూడు చరణములలో నున్న యాప్యాయత మన యనుభవమునకు వచ్చును. నాల్గవ చరణము 'తేహినో దివసా గతాః' ఆ రోజు లన్నియు గడచిపోయినవి. ఇది యాకసమెత్తు మాట. దానిలో రేఖాప్రాయముగా నున్న విషాదము మన హృదయపు లోతులలో తలచూపును. పట్టుకొన్నచో నీ మాటలోని దివ్యత్వమును పట్టికొందుము. ఇట్టిదే మరియొకటి.

పుత్ర సంక్రాంతలక్ష్మీకై ర్యద్వృద్ధే ష్వాకుభి రధృతం

ధృతం బాల్యే తదార్యేణ పుణ్యమారణ్యకవ్రతం

కొడుకులకు రాజ్య మప్పచెప్పి ముసలితనములో రఘురాజులు ధరించు నట్టి వానప్రస్థ వ్రతమును నీవు బాల్యమునందే ధరించితివి. రాముని గుఱించి

లక్ష్మణుని మాట. 'వృద్ధ' శబ్దముతో 'బాల్య' శబ్దము విపర్యస్తమై కన్నులు చెమ్మగిల్లచేయును.

దిష్ట్యా సోయం మహాబాహు రంజనానందవర్ధనః

యస్యవీర్యేణ కృతినో వయంచ భువనానిచ

సంతోషము. ఇతడు మహాబాహువైన యాంజనేయుడు. ఈయన పరాక్రమముచే మనము ధన్యులమైతిమి. లోకము లన్నియు ధన్యమైనవి. మనమనుట బాగుగనే యున్నది. అంతవరకు మనము తెలిసికొనగలము. 'భువనానిచ' యన్నది భవభూతికి తెలియవలయును.

తస్య ద్వితీయ హరి విక్రమ నిస్తమస్కం

వాయో రిమం పరివహస్య వదంతి మార్గం

అన్నాడు కాళిదాసు. వామనమూర్తి రెండవ యాక్రమణముచే ఆ వాయు స్కంధమునందలి చీకటి తొలగిపోయినదట. ఈ మాట యట్టిది.

యధేచ్ఛం భోగ్యం వో వనమిద మయం మే సదివస

స్సతాం సద్భిస్సఙ్గః కథమపి పుణ్యేన భవతి.

తరుచ్ఛాయా తోయం యదపి తపసోయోగ్యమశనం

ఫలం వా మూలం వా తదపి నపరాధీన మిహవః.

ఆతిథేయపారమ్య మింతకంటె చెప్పుట యెట్లు ? యధేచ్ఛం భోగ్యమని మొదలు పెట్టుటలో యెంత పారవశ్యము ధ్వనించుచున్నది! తాపసుల నిర్మలమైన చిత్తవృత్తిని వారి పరమ సాధుత్వమును విడివిడి మాటలతో వ్యక్తము చేసినాడు మహాకవి. ఇట్టిదే మఱియొకటి:

నీవారౌదన మండ ముష్ణ మధురం సద్యః ప్రసూతప్రియా

పీతా దభ్యధికం తపోవన మృగః పర్యాప్త మాచామతి

గంధేన స్ఫురతా మనాగమసృతాభక్తస్య సర్పిష్మతః

కర్కంధూ ఫలమిశ్ర శాకపచనా మోదః పరిస్తీర్యతే.

నివ్వరిగంజి నప్పుడే ప్రసవించిన తన ప్రియురాలు త్రాగగా మిగిలినదానిని యీ దుప్పి తృప్తిగా త్రాగుచున్నది. నేయి కలిపిన యన్నపు సువాసనతో కూడు కొన్న రేగుపళ్ళ గుజ్జుతో కలిపి వండిన కూర వాసన దట్టమై గుబాళించు చున్నది. ఆ దృశ్యముగాని యీ భోజనము గాని స్వర్గమందలి దేవతలకు కూడ స్పృహణీయములన్నట్లు లేదా యీ వర్ణనము.

ఇహ సమద శకుంతాక్రాంత వానీర వీరు
త్ప్రసవసురభి సీత స్వచ్ఛతోయా వహంతి
ఫలభర పరిణామ శ్యామజంబూనికుంజ
స్ఖలనముఖరభూ రిస్రోతసో నిర్ఝరిణ్యః.

ఇక్కడ మదించిన పక్షులెక్కుటచే వంగిన ప్రబ్బలి మొక్కల పూలచేత సువాసించుచున్న చల్లని నిర్మలమైన నీరుగల యీ సెలయేళ్లు పండ్లతోనిండి నల్లగానున్న నేరేడు పొదలలో దొర్లిపోవుచు మ్రోతపెట్టుచు నిండి ప్రవహించుచున్నవి. ఆ సమాసము, ఆ యక్షర సంయోజనము, ఆ శబ్దముల కూర్పు దృశ్యాభోగమును కన్నులముందు నిల్పుచున్నవి.

గుంజత్కుంజ కుటీర కౌశిక ఘటా ఘూత్కారవత్కీచక
స్తమ్బాడమ్బర మూక మౌకులి కులః క్రౌఞ్చవతోఽయంగిరిః
ఏతస్మిన్ ప్రచలాకినాం ప్రచలతా ముద్వేజితాః కూజితై
రుద్వేల్లన్తి పురాణ రోహిణ తరుస్కన్ధేషు కుమ్భీనసాః

ఈ కొండపేరు క్రౌంచావతము. దీనిపై యివి పొదరిళ్లు. అవి వెదురు పొదలు. ఈ పొదరిళ్ల గుయ్యారములో గుడ్లగూబల యరపులు విని ఆ వెదురు పొదలలోని కాకులు చప్పుడుచేయక దాగికొని యుండును. ఇచటనే నెమళ్లు తిరుగుచుండును. వీని కేకలకు భయపడి ఆ పురాతన వట వృక్షముల పంగలయందు పాములు చుట్టుకొనుచున్నవి.

ఏతేతే కుహరేషు గద్గద నదద్గోదావరీ వారయో
మేఘాలఙ్కృత మౌళినీల శిఖరాః క్షోణీభృతో దక్షిణాః
అన్యోన్య ప్రతిఘాత సంకుల చలత్కల్లోల కోలాహలై
రుత్తాలాస్త ఇమే గంభీరపయసః పుణ్యాస్సరిత సఙ్గమాః

ఈ కొండగుహలందు గోదావరీ నీరములు గద్గద యని రొదపెట్టుచున్నవి. దక్షిణదేశమందలి యీ కొండలు తలపై కప్పిన మొయిళ్లతో నీల శిఖరములు కలవై యొప్పారుచున్నవి. ఇచ్చట నివి పుణ్యములైన నదీ సంగమములు. ఇందు కెరటములు పరస్పరము కొట్టుకొనుటచేత కల్గు ధ్వనులతో పైకి నెత్తుగా నెగురుచున్నవి. ఈ నీరము లిచ్చట మిక్కిలి లోతుగా నుండును.

ఈ రెండు పద్యములు వాక్చిత్రములు. ఉచ్చారణ ధ్వని మాత్రము చేతనే దృశ్య గాంభీర్యమును కన్నులు యెదుట ప్రత్యక్షము చేయగల్గినవి.

భవభూతికున్న శబ్దశక్తి దృశ్యముతో బాటు, వాతావరణమును కూడ, కన్నుల యెదుట నిల్పును. మొదట పద్యమునందు భయానకము రసవదలంకారము. రెండవ పద్యమున ఉపమాధ్వని.

> దోర్దండాంచిత చంద్రశేఖర ధనుర్దండావ భంగోద్యత
> ష్టంకార ధ్వని రార్య వీరచరిత ప్రస్తావనా డిండిమః
> ద్రాక్పర్యస్త కపాల సంపుట మిత బ్రహ్మాండ భాండోదర
> భ్రామ్య త్పిండిత చండి మా కథ మహో నాద్యాపి విశ్రామ్యతి.

శివుని విల్లు విరిచినప్పుడు పుట్టిన టంకార ధ్వనియే అన్నగారి వీర చరిత్రమును ప్రారంభించు వేళ మ్రోగు డిండిమము. అప్పటి ఆ ధ్వని బ్రహ్మాండము నిండి పట్టక దానిని తలక్రిందు చేసి తీవ్రముగా లోపల పిండీభూతమై తిరుగుచు నిప్పటికిని తగ్గుట లేదు. ఈ శ్లోకము మహావీర చరితము లోనిది. వీర రసము పద్యమునందలి ధ్వని. పద్యము నందలి వికటాక్షర బంధము, అర్థముతో నిమిత్తము లేకయే యిచ్చట రస వ్యంజకము. మాలతి యందలి యీ శ్లోకమును చూడుడు:

> పక్ష్మాళీపింగళి మ్నః కణ ఇవతటి తాం యస్యకృత్స్నప్రసూ హారి
> యస్మిన్ బ్రహ్మాండ మీష ద్విఘటిత ముకుళే కాలయజ్వాజు హావ
> అర్చిర్నిష్టప్త చూడా శశి గళిత సుధా సార చూత్కారి గోణం
> తార్తీ యీకం పురారేస్త దవతు మదన ప్లోషణం లోచనం వః.

దేని రెప్ప వెంట్రుకల వరుసల యెఱ్ఱదనములో మెఱపు తీవెల మొత్త మంతయు లేశమునకై పోలదో కాలు డన్న యజమానుడు కొంచెము మూతి విచ్చిన మొగ్గ యగు దేని యందు నీ బ్రహ్మాండమును హోమము చేసెనో, పైకి ప్రసరించు జ్వాలచే బాగుగా క్రాగిన జటా జూటమందలి చంద్రుని నుండి జారుచున్న యమృత సారము పడి చుంయి చుంయిమని ధ్వని చేయుచున్న కోణము గల్గిన దేదియో యట్టి మన్మధ దాహకమైన రుద్రుని మూడవ నేత్రము మిమ్ము కాపాడు గాక.

శ్లోకమునందు అలంకార ముదాత్తము. రచన కూడ యుదాత్తమే. యత్ప్రౌఢిత్వ ముదారతాచవ చ సాం యచ్చార్థతో గౌరవ మన్న మాటకు యోగ్యమైన యుదాహరణ మీ పద్య రచన.

తిరతి కిరతి కించిత్ - మునిజన శిశురేకః - ఆగుంజద్గిరి కుంజ- అయం శైలాఘాత - దర్పేణ కౌతుకవతా - మొదలైన శ్లోకములు వీర రసమునకు

పరమ వ్యంజకములు. రసవ్యంజకత్వము భవభూతిలో శిఖరాయమాణము. శ్లోకములే యన నేల? భవభూతి మాటలు కూడ నట్టివే. ఆయన రసవాక్కు.

'భగవతి తమసే యేతేనావత్యా సంస్మరణేన ప్రస్నుత స్తనీ తయోశ్చ పితు స్సన్నిధానేన క్షణమాత్రం సంసారిణ్యస్మి సంవృత్తా.' ఇట్లు పిల్లలను తలచుకొని నా స్తనములు పాల్గురియుచుండ వారి తండ్రి సమీపమున నిల్చి క్షణ మాత్రము సంసారిణి నైతిని. తృతీయాంకమందలి సీత మాట యిది. ఇది విన్నప్పుడు మనకు ఎచ్చటినుండియో దుఃఖము త్రవ్వుకొని వచ్చును.

సప్తమాంకమున 'నయతు మామాత్మనోఙ్గేషు పాలయమంబా' అని సీత మాట. ఒక్క సీత విషయముననే కాదు, యెవరి మాటలైనను నతిలోకములై రసభావోన్మీకములై యాకసమెత్తున మనకు కన్పించును. విశేష మేమన, నాటక ములో నున్న పాత్రములన్నియు నుదారభావసంపన్నములే. ఉత్తాలములే. అల్పములు దుష్టములైన పాత్ర లిందు మచ్చునకు కూడ లేవు. పాత్రలన్నియు దైవీగుణములతో నిండి హిమాలయ ధవళ శృంగములవలె ప్రకాశించునట్టివే. ఇందలి విష్కంభమునందలి పాత్ర లామాటనుబట్టి మధ్యమ పాత్రలనుకొనవల సినదేగాని శీలముచేత నవియు నుత్తమ పాత్రలే. ఇందలి సంవిధానము, ఇందలి పాత్రలు,నిందలి రచనము,నిందలి భాషయు,నిందలి ప్రత్యక్షరమును జ్యోతిర్మ యము లైనట్టివి. సహృదయ హృదయములను రసప్లావితము చేయునట్టివి. భవభూతి శబ్ద బ్రహ్మవేత్త; ప్రాజ్ఞుడు నగుటయే కాదు- ఆయన పరంజ్యోతి నావిర్భవించుకొన్నవాడు.

> ఆవిర్భూత జ్యోతిషాం బ్రాహ్మణానాం
> యే వ్యాహారాస్తేషుమా సంశయోభూత్
> భద్రా హ్యేషా వాచిలక్ష్మీ ర్నిషక్తా
> నైతేవాచం విప్లుతార్థాం వదంతి.

# నాగానందము

—కొత్తపల్లి ఘనశ్యామలప్రసాదరావు

శ్రీహర్ష ఇత్యవని వర్తిషు పార్థివేషు నామ్నైవ కేవల మజాయత వస్తుతస్తు,
గీర్హర్ష ఏష నిజసంసది యేన రాజ్ఞా సంపూజితః కనకకోటి శతేనబాణః॥

వాగ్దేవియొక్క హర్షము శ్రీహర్ష చక్రవర్తి రూపమున భారతవర్షమున నవత రించినదని సోడ్ఢల కవియొక్క సత్యోక్తి ఇది. వాణియొక్క అపరావతారమని ప్రశంసింపబడి బాణమహాకవిచేత అజరామరముగా కీర్తింపబడిన స్వీయచరిత్ర గల హర్షచక్రవర్తి ధన్యుడు. ఉదాత్తగుణోపేతులైన రాజులెందరున్ననూ, వదాన్యశేఖరులైన వారి వరుసలో ముందుగా లెక్కింపదగినవాడు హర్షుడు. కవి రాజుగా కూడ నీతడు మాన్యుడు. త్యాగముకొఱకే ధనము నార్జించిన చక్రవర్తిగా ఈతడ సామాన్యుడు. ఈతని భవ్యజీవనము, కావ్యభావనము గూడ ఒకే ఆంతరిక సూత్రమును సంతరించుకొనినవి. కాన ఈతని రూపకానుశీలనముతో బాటు జీవిత పరిశీలనము గూడ చేయుట సముచితము.

## శ్రీహర్షుని వ్యక్తిత్వము-జీవితము :

క్రీ॥శ॥ 590 వ సంవత్సరము శ్రీహర్షునకు జన్మనొసఁగి, భారతచరిత్రలో తనకొక శాశ్వత స్థానమును సంపాదించుకొనినది. శ్రీహర్షుని తండ్రి ప్రభాకర వర్ధనుడు. తల్లి యశోవతి. రాజ్యవర్ధనుడీతని యన్న. సోదరి రాజ్యశ్రీ హర్షుని కన్న చిన్నది. ఆమెను గృహవర్మయనురాజు పెండ్లాడెను. తండ్రి మరణా నంతరము రాజ్యవర్ధనుడు రాజుకాగా, అచిరకాలముననే శశాంకుడను గౌడ దేశపు రాజు వానిని జంపెను. అదే సమయమున మాలవరాజు గృహవర్మను జంపి రాజ్యశ్రీని చెఱబట్టెను. కాని యామె ఎట్లో తప్పించుకొని వింధ్యాటవులకు పారిపోయెను. అట్టి క్లిష్ట సమయమున శ్రీహర్షుడు సింహాసన మెక్కి శత్రు సంహారము చేసి, సోదరియైన రాజ్యశ్రీని మృత్యుముఖము నుండి కాపాడి తన యింటనే యుంచి సంరక్షించెను. అటుపిమ్మట కొలది కాలములోనే యాతడు ఉత్తర భారత దేశమునంతనూ జయించి, సనాతన ధర్మమును నిలబెట్టి, క్రీ॥శ॥

606 లో సజ్జనామోదముగా ''హర్షశక'' మనుపేర నొక శకము నారంభింప చేసెను. పిమ్మట భారతభూమినంతనూ ఒకే ఏలుబడి క్రింద నిలుపనెంచి, దక్షిణాపథముపై దండెత్తెను. కానీ క్రీ॥ శ॥ 610 లో దక్షిణాపథమున రెండవ పులకేశియను రాజుచేతిలో యుద్ధమున నోడి వెనుతిరిగిపోయెను. అటుపిమ్మట మరల శ్రీహర్షుడు ఏ ప్రాంతముపైకినీ దండయాత్ర జరుపలేదని చరిత్ర చెప్పు చున్నది. కానీ ప్రతి ఐదు సంవత్సరముల కొకసారి తన కోశాగారమునందలి ధనమునంతనూ యోగ్యులకు దానమొనర్చుచూ, బాణుడు, సోడ్ఢలుడు, మయూరుడు, మాతంగుడు, దివాకరుడు మొదలగు కవుల నాదరించి సత్కరించి, స్వయముగా రత్నావళి, ప్రియదర్శిక, నాగానందమువంటి నాటకములను, సుప్రభాతస్తోత్రము, అష్టమహాశ్రీచైత్య స్తోత్రము వంటి కావ్యములను విరచించి, సారస్వత సమారాధన మొనరించెను.

శ్రీహర్షుడు శివభక్తుడని రత్నావళీ, ప్రియదర్శికా రూపకములనుబట్టి తెలియుచున్నది. కానీ తన జీవన చరమదశయందు బౌద్ధ మతమును స్వీకరించె నని హ్యూయన్ సాంగ్ వంటి విదేశీ బౌద్ధయాత్రికుని రచనములనుబట్టి తెలియు చున్నది. బాణుడు వ్రాసిన హర్ష చరిత్రమునందు గూడ శ్రీహర్షుడు తన చివరి దినములలో బౌద్ధము స్వీకరించినట్లు తెలియుచున్నది. సనాతన ధర్మమును విడ చుటకు, ద్వేషించి వేరొక మార్గము ననుసరించుటకు శ్రీహర్షుని జీవితమున తగిన కారణములున్నట్లు చారిత్రక గ్రంథములలో కానవచ్చుటలేదు. ''ఉపార్జితానాం విత్తానాం త్యాగయేవ హి రక్షణమ్'' అని సూచించు సనాతన ధర్మము ననుసరించి "త్యాగాయ సంభృతార్థానాం" అను కాళిదాసు వాక్యమును చదివి - విశ్వజిద్యాగము చేసి సర్వస్వదానము చేసిన రఘుమహారాజువలె - తన కోశమునంతనూ పదేపదే దానము చేసిన కర్మయోగి వంటి వదాన్యుడు సనాతన ధర్మమును ఏల విడిచెనో తెలియకున్నది. సనాతన ధర్మమెంతటి యుత్కృష్టమైనదైననూ, తన సమకాలీన సమాజమున అనుష్ఠాన వేదాంతమునకు బదులు ప్రవచన పటుత్వమే ప్రబలముగా నున్నదని భావించి, వైదికధర్మములేయైన దయా, అహింస, త్యాగ భావములకు అత్యంత ప్రాధాన్యము నిచ్చిన, జనసామాన్య జీవితమున నూతన ఆశాజ్యోతిగా, తన కాలములో ఉద్యమించిన బౌద్ధముపట్ల ఆకర్షితుడై - అట్టి దానగుణమును ప్రజలలో ప్రచారము చేయుటకు ''నాగానంద నాటకము''ను వ్రాసియుండవచ్చును. కావుననే నాగానంద నాటకమున సనాతన ధార్మిక వ్యవస్థయే సర్వత్ర భూమికగా స్వీకరింపబడినది. కానీ అతిచతురముగా, వ్యంగ్య

ముగా, సనాతన వ్యవస్థలో - తన కవకతవకలుగా తోచిన వానిని అవహేళనము చేయుచూ, వానిని ప్రజలు నిరసించురీతిగా సంఘటనములను కూర్చి, సరసముగా సహృదయులను త్యాగ భావపూర్ణజీవనులుగా కూడ చేయుటకు హర్షుడు ప్రయత్నించెననుట సమంజసము.

శ్లో. అశర మలోల మజిహ్మం త్యాగిన మనురాగిణం విశేషజ్ఞమ్।
యదినాశ్రయతి నరంశ్రీః శ్రీ రేవ హి వంచితా తత్ర॥

అని హర్షుని రచనముగా సుభాషితసంకలనములలో కనుపించు శ్లోకము శ్రీహర్షుని వ్యక్తిత్వమును, సుగుణ సంపదనూ ప్రకటించుచున్నదని భావించవచ్చును.

ఇట్టి హర్ష చక్రవర్తి వేరు - ప్రసిద్ధ రూపకకర్తయైన శ్రీహర్షుడు వేరని వాదించు వారుకూడ సారస్వత ప్రపంచమున కలరు. కానీ అది కేవల మసత్యమని బాణవాణి నిరూపించుచున్నది. అంతేగాదు, భారతదేశమును దర్శించిన వేరొక బౌద్ధ యాత్రికుడు ఇత్సింగ్ - హర్షుని రచనావైదుష్యము కొనియాడినట్లు ''ఇత్సింగ్ యాత్రానుభవము''లను ఆంగ్ల భాషలోని కనువదించిన జె. జెకాకుసు అను విద్వాంసుడు వ్రాసినాడు: "King Siladitya versified the story of the Bodhisathva, Jimutavahana, who surrendered himself in place of a Naga. This version was set to music. He had it performed by a band accompanied by dancing and acting and thus popularised it in times - I-Tsing-A Record of the Buddhist Religion."

—Tr. by. J. Jakakusu.
Chap. XXXII, Page 163-164.

## నాగానందము - ఇతివృత్తము :

శ్రీ హర్షుడు రచించిన రూపకత్రయమున 'నాగానందము' కడు విలక్షణమైన నాటకము. 'రత్నావళి' 'ప్రియదర్శిక'లను నాటికలనవచ్చును. ఈ రెంటియందును ఉదయన చక్రవర్తియే నాయకుడు. రత్నావళి ప్రియదర్శికలను నాయికలతో ఉదయనుని వివాహమే ఇతివృత్తము. రెంటిలోనూ శృంగారమే అంగిరసము. ఈ మూడు రూపకములకునూ ఒక విధముగా మూలకథలన్నియు అతి ప్రాచీన కాలమునుండియూ జన బాహుళ్యములో ప్రచారమునందున్న గాథల నుండి స్వీకరింపబడినవే.

'నాగానంద నాటకము'న ప్రస్తావనలో- "యిందలి కథ. 'విద్యాధర' జాతకము నుండి స్వీకరింపబడిన"దని అక్షరశః హర్షుడే చెప్పియున్నాడు. గౌతమ బుద్ధునిచే, తన పూర్వజన్మలలో చేయబడిన సత్కార్యముల కధనములే జాతక కథలనుట జగత్ప్రసిద్ధము. కానీ లభ్యమగుచున్న జాతక కథలలో విద్యాధర జాతకము అనుపేరు కనబడుటలేదు. అది ఒకప్పుడు ప్రచారమునందుండి, కాల క్రమమున కనుమరుగై యుండవచ్చును.

గుణాఢ్యుడను మహాకవిచే పైశాచీ భాషలో వ్రాయబడిన కొన్ని వందల కథలు క్రీస్తు పూర్వమునందే మనదేశమున జనశ్రుతిలో కలవు. వాని యక్షర రూపము నేటికినీ అలభ్యమే. కానీ అవే కథలు, తదనంతర కాలమున ఇద్దరు మహాకవులచే మరల సంస్కృతమున వ్రాయబడి క్రీ.శ. పదకొండవ శతాబ్దము నుండి ప్రచారములోనికి వచ్చినవి. వాని రెంటి యందునుగూడ 'జీమూతవాహనుడు' అను విద్యాధరుని గాథ భిన్నసందర్భములలో రెండు పర్యాయములుగా చెప్ప బడియున్నది. ఈ రెండు కావ్యములందునూ, తొలుత ఈ జీమూతవాహన కథ సంక్షిప్తముగనూ, రెండవ పర్యాయము సుదీర్ఘముగనూ, చెప్పబడినది. వానిలో 'సోమదేవుడు' వ్రాసిన 'కథాసరిత్సాగరము' కేవల కథాకథనమునకు ప్రాముఖ్యము నిచ్చును. 'క్షేమేంద్రుడు' వ్రాసిన 'బృహత్కథామంజరి' వర్ణనా ధిక్యతతో, కవితా గుణశోభితమై విస్తృతముగా నుండును. శ్రీహర్షుని తదనంత కాలమున రచింపబడిన ఈ రెండు కావ్యముల యందలి కథ హర్షుని నాటక రచనమునకు ఆధారమగుట యసంభవము. కానీ గుణాఢ్యుని కథలనే తాము వ్రాసితిమని వారు చెప్పుకొనుటచేతనూ 'విద్యాధరజాతకము పేరుకుమాత్రమే లభ్యమగుటచేతనూ, పూర్వకవియగు గుణాఢ్య విరచిత కథయే నాగానంద నాటకమునకు ఆధారమై యుండవచ్చునని భావించి, ఆ కథలనే చెప్పిన కథా సరిత్సాగరము' బృహత్కాథామంజరులకథలలో నాగానందనాటక ఇతి వృత్తమునకు గల అధికసామ్యములను పరికించుట సముచితము. అందుకు ముందుగా, నాటక క్రమమున ఇతివృత్తమెట్లు కొనసాగినదో సంక్షిప్తముగా చెప్పుకొనుట యవసరము.

నాందీ శ్లోకములందు గౌతమ బుద్ధుని యాశీస్సుల నర్థించుచూ నారంభింప బడిన యీ నాటక ప్రస్తావనమున మౌలికమైన 'ఇతివృత్త' సూచనముతోబాటు, కవిప్రశంస, కథానాయకుని గుణప్రతిపాదనములుగూడ చేయబడినవి. తెర లేచుసరికి, ఇద్దరు యువకులు రంగ ప్రవేశము చేతురు. వారిలో నొకడు

జీమూతవాహనుడను పేరుగల విద్యాధర యువరాజు, రండవవాడాతని మిత్రము. ఆత్రేయు డాతని పేరు. వారిరువురి సంభాషణములనుబట్టి జీమూతవాహనుడు భౌతిక సుఖములందనాసక్తుడని, పితృసేవా పరాయణుడై, రాజ్యమునుగూడ విడచి వనమున కొచ్చినవాడని, జ్ఞాతులతని రాజ్యమును కబళింపదగు ప్రమాదమున్న దనీ, అయిననూ వానప్రస్థమునకు వచ్చిన తల్లి దండ్రులకు తగిన వసతిని వెతు కుటయే ఆతని ప్రస్తుత లక్ష్యమని, రాజ్య సుఖచింత ఆతనికి లేదని మనకు తెలియచేయబడును.

అట్టి సమయమున, సమీపస్థమగు గౌరీదేవళము నుండి ఒక గీతము వినిపింపగా, వారిరువురునూ అటుపోయి అందు వీణాగానము చేయుచున్న కథానాయికను, ఆమె చెలికత్తెను చూతురు. అచటి స్త్రీల సంభాషణమును బట్టి నాయికపేరు మలయవతియని-ఆమె తనకు తగిన వరుని కాంక్షించి, గౌరీదేవిని తీవ్రమైన నిష్ఠతో సేవించుచుండెననీ, ఆమెభక్తికిమెచ్చి గౌరీదేవి, ఆమెకు గంధర్వ చక్రవర్తి భర్తకాగలదని కలలోచెప్పినదనీ మనకు తెలియును. చాటున నుండి ఈ సంభాషణమును వినుచున్న నాయకుడు, తన మిత్రుని ప్రోత్సాహమున ఎదుటకు రాగా, నాయికా నాయకుల పరస్పర ప్రథమవీక్షణ మున, వారి అన్యోన్యానురాగమునకు బీజావాపము జరుగును. పరస్పర మర్యాదా వాక్యములు పూర్తియగు సరికి, ఒక తాపసి రంగమున ప్రవేశించి, నాయికను తన యింటి కేగుమని సూచించగా, ఆమె అతి కష్టముపై యచట నుండి వెడలి పోవుట, నాయకుడు, ఆతని చెలికాడును, తమ దైనందిన కృత్యములకై తరలి పోవుటతో ప్రథమాంకమున తెరప్రాలును.

ద్వితీయాంకమున తెరలేచు సరికి, నాయిక, ఆమె చెలియును రంగమున ప్రవేశింతురు. నాయిక యొక్క విరహవ్యథ, అందులకై ఆమెచెలి చేయు ఉపశమన పరిచర్యలు కొనసాగును. అనంతరము. వారు ఒక పొదరింట ప్రవే శింతురు. పిమ్మట విరహాతురుడైన నాయకుడు, అతని చెలికాడు ఆ పొదరింటి దరికే వత్తురు. వారి రాకను చూచి నాయిక, ఆమె చెలి, కనుమరుగున కేగెదరు. నాయకుడు తన మనసు హరించిన స్త్రీమూర్తి రూపమును పొదరింటిలోని శిలా ఫలకమున చిత్రించును. ఆ స్త్రీ తానే యని ఎరుగని నాయిక, పరిపరి విధముల వ్యథపడుట జరుగుచుండగా, మిత్రావసువను పేరుగల నాయికసోదరుడట కరుదెంచును. అతడు తన సోదరిని నాయకునకిచ్చి వివాహము చేయవలెనను కోర్కెను వెలిబుచ్చును. అది విని నాయిక ఆనందించుచుండగా, తన ప్రియు

రాలునూ, మిత్రావసువుచే ప్రతిపాదింపబడిన యువతియునూ ఒక్కరే యని ఎరుగని నాయకుడు, ఆ వివాహ ప్రతిపాదనమును తిరస్కరించును. ఆ విషయమున పెద్దలను సంప్రదించుట మంచిదని ఆత్రేయుడు చెప్పిన మాటపై-నాయిక యన్న వెడలిపోగా, నిరాశకులోనైన నాయిక, ఆత్మహత్యా ప్రయత్నమున, తన్నిరోధమునకై చెలి త్వరపడు సమయమున, నాయికానాయకుల సమాగమము, పరస్పరానురాగములను ఎరుంగుట, జరుగును. పిమ్మట నొక పరిచారిక వచ్చి నాయికా నాయకుల వివాహము పెద్దల అనుమతితో, ఆ రాత్రికే జరుప నిశ్చయింపబడినదని చెప్పుటతో మంగళా స్నానములకై వారెల్లరూ తరలి పోవుటతో ద్వితీయాంకము ముగియును.

తృతీయాంక ప్రారంభమున విట, చేటీ, విదూషకుల శృంగారముల వేడుకల ప్రదర్శనమున, వైవాహికోత్సవములలో జనసామాన్యమున నుండు అలవాట్లు కొన్ని ప్రకటింపబడును, పిమ్మట నాయికా నాయకులు, చేటే విదుషకులు ప్రవేశింతురు. నాయికా నాయకుల సరస సల్లాపముల నడుమ వారికేకాంతమును సమకూర్పవలెనను ఇచ్ఛతో చేటి విదూషకుని కవ్వించి, దూరముగా తీసికొనిపోవును. స్వల్పకాలికమైన నాయికా నాయకుల ఏకాంతమును, నాయికా సోదరుడగు మిత్రావసువు భంగమొనర్చుచూ రంగప్రవేశముచేసి, జ్ఞాతులచే నాయకుని రాజ్యమునకు కలిగిన విపత్తును వివరించును. అయిననూ, ఎట్టి ఆందోళనము చెందక, నాయకుడు, భౌతిక రాజ్య సుఖములపట్ల తన యనాసక్తతను వెలిబుచ్చి, పరోపకారార్థము స్వశరీరమునైన త్యాగము చేయుటకు తాను ఉద్యుక్తుడనని చెప్పి-రాజ్యవాంఛను విడచివేసినట్లు ప్రకటించుటతో తృతీయాంకమున తెర వ్రాలును.

చతుర్థాంకమున - సముద్రతీరమున వ్యాహ్యాళికై వచ్చిన జీమూతవాహన, మిత్రావసువులు ప్రవేశింతురు. అచట పర్వతమువంటి ఎముకల గుట్టలను చూచిన నాయకుడవి యేమని ప్రశ్నింపగా, అవి నిత్యమూ అచట గరుత్మంతుడు చంపి భక్షించుచున్న సర్పముల బొమికలని మిత్రావసువు చెప్పును. అట్టిచో సర్పములను రక్షించువారెవ్వరునూలేరా యని జీమూతవాహనుడు వితర్కించు సమయమున, తనతండ్రినుండి పిలుపురాగా, నాయకుని ఒంటిగా రంగమున విడచి, మిత్రావసువు వెడలిపోవును. పిమ్మట ఒకస్త్రీ ఆర్తనాదము అచట వినిపించును. ఆ దినమున గరుడునకు బలి

కావలసిన తన కుమారుని కష్టమునకు విలపించుచున్న ఒక నాగమాత కుమారునితో రంగమున ప్రవేశించును. ఆ తల్లీకొడుకుల సంభాషణమునువిని, జాలిపడి నాయకుడు వానిస్థానమున తాను బలిదానముకాగోరును. కానీ ఆ యువకుడు అంగీకరింపడు. శంఖచూడుడను ఆ నాగకుమారునకు, జీమూతవాహనునకు నడుమ జరిగిన సంభాషణమునుబట్టి జీమూతవాహనుని దయాహృదయము, దృఢనిశ్చయములు ప్రకటితమగును. గరుడునిరాక ఆలస్యమగుటచే, ఈ లోపున తుదిసారిగా దైవదర్శనము చేసివత్తునని శంఖచూడుడు రంగస్థలమును విడచిపోవుటచే నాయకుడు ఒంటరిగానుండగా, గరుడుడు వచ్చి నాయకునే శంఖచూడునిగా భావించి తన గోళ్ళతో తన్నుకొని పోయి, ముంచువుతో పొడుచుకొని మాంస భక్షణ మొనర్చును. ఈ సందర్భమున ఆకసమున దేవదుందుభులు మ్రోగుచుండగా, పుష్పవృష్టి కురియుచుండగా, చతుర్థాంకము పరిసమాప్తమగును.

పంచమాంకమున తెరలేచుసరికి నాయకునితండ్రియగు జీమూతకేతువు, తల్లీ, భార్యయగు మలయవతులు రంగప్రవేశముచేతురు. నాయకుని రాక ఆలశ్యమైనందుకు పరిపరివిధముల వారు చింతించుచుండగా రక్తమాంససిక్తమైన ఒకశిరోభూషణము ఆకాశమునుండి వారి పాదములకడ పడును. అవి నాయకునిదేయని వారు గుర్తించి కలవరపడుచుండగా, నాగ కుమారుడగు శంఖచూడుడు గరుడుని వెదకికొనుచూ వచ్చును. ఆతనినోటినుండి తమ కుమారునిదే శిరోమణియని యెరింగి, పుత్రమరణదుఃఖమున ఆత్మాహుతి చేసికొనుటకై ఆతని తల్లిదండ్రులు, భార్యయు నిశ్చయించుకొందురు. ఈ లోపున గరుడుని చేరిన శంఖచూడుడు, ఆహార గ్రహణమున జరిగిన పొరబాటును సూచింపగా, గరుడుడు తన పొరపాటునకు చింతించి ఆత్మహత్య చేసికొననెంచును. పశ్చాత్తాపముపడి యికపై జీవహింస చేయకుండుమని జీమూతవాహనునిచే ఆదేశింపబడిన గరుడుడు స్వర్గమునుండి అమృతమును తెచ్చి, చచ్చిన నాగులను బ్రతికించుట, నాయకుని తల్లిదండ్రులు అచటకుచేరి ఖండిత శరీరుడై చనిపోవుచున్న కుమారుని చూచుచూ విలపించుచుండగా, నాయకుని మరణము-నాయిక ప్రార్థింపగా గౌరిదేవి అనుగ్రహించి నాయకుని బ్రతికించుట జరుగును. చివరకు గౌరీ కృపవలన తన రాజ్యమును తాను పొంది జీమూతవాహనుడు సుఖముగానుండుట- నాగులకు ఆనందప్రదముగా

గరుడుడు జీవహింస మానుట - జరిగిన పిదప భరతవాక్యముతో పంచ మాంకము సుఖాంతమగును.

ఇట్లు నాటక కథ - మొదటి రెండు అంకములలో ఒక రోజుననూ, మూడవ అంకమున మరునాడును. కొలది దినముల పిదప ఒకేరోజున నాలుగు ఐదు అంకములలోను నడచును. మలయపర్వత సానువులయందు - అనగా ఒకే స్థలమున జరుగును. ఆ విధముగా నాటకీయప్రయోగ శిల్ప విజయమున కవసరమైన స్థలము, కాలము, సంఘటనలకు సంబంధించిన, క్రమసమ న్వయము ఇందు చక్కగా పాటింపబడినదని చెప్పవచ్చును.

## నాగానందము : పూర్వులు - చేర్పులు :

గుణాఢ్యుడుచెప్పిన కథయని, కథాసరిత్సాగరము, బృహత్కథామంజ రులలో - మొదటి ఘట్టమున సంక్షిప్తముగా చెప్పబడిన, జీమూతవాహనుని కథ కును - పైన వివరించిన నాగానంద నాటకేతివృత్తమునకు మూలకథలో పోలిక చాల కలదు. ఆ గ్రంథములలో రెండవ ఘట్టమున చెప్పబడిన జీమూతవాహన కథలో, సంక్షిప్తగాథలో లేనివి- నాగానందమున నున్నవి యగు కొన్నిఘట్టములు కలవు. కావున ఆ కవులు గుణాఢ్యుని సంక్షిప్త కథనమును ముందుగా చెప్పి, హర్షనాగానందము ననుసరించి విస్తృత కథలలో విశేషములనుచేర్చియుందురని కొందరు విమర్శకు లూహించుచున్నారు. గుణాఢ్యరచితగాథకును, నాగానందము నకు గల ముఖ్య వ్యత్యాసములు రెండు మూడు యిచట సూచింపబడును. గుణాఢ్యగాథలో వనమునకు వచ్చిన జీమూతవాహనుని కలసి, మిత్రావసువు తన సహోదరినిచ్చి పెండ్లి చేతునని చెప్పును. దీనిని స్వీకరించి పెండ్లికి భూమికగా రెండంకముల నాటకమును వివాహమైన పిదప నాయికా నాయకుల నిగ్రహయుక్తమైన దాంపత్యమును ప్రముఖముగా ప్రదర్శించుచూ తృతీయాంక మును శ్రీహర్షుడే క్రొత్తగా కల్పించెను. అట్లే, గుణాఢ్యకథ చివరిలో నాయకుని తల్లిదండ్రులు-భార్య గరుత్మంతుని దగ్గరకు వచ్చుటలేదు. కానీ పంచమాంక మున వీరినందరనూ ప్రవేశపెట్టుట శ్రీహర్షుని నూతన కల్పనమే - గుణాఢ్యుని గాథలో కథాంతమున గరుడుడు జీమూతవాహనునకు వర మిచ్చినట్లున్నది. దానిని శ్రీహర్షుడు తన నాటకమున విడచివేసినాడు. ఇట్టి ముఖ్యమైన పరివర్తన ములను శ్రీహర్షు డేల చేసెనో ఆలోచింతము. హర్షుడు వ్రాయదలచినది నాట కము. ఉపదేశింపదలచినది త్యాగమయ జీవన విధానము. దానికి సంక్షిప్తముగా

జీమూతవాహనుడు నాగులకై ప్రాణమర్పించిన ఘట్టమునే రచించిన చాలదు. ఒకవేళ చాలినంతగా, తీవ్రముగా అట్టి హృదయావర్జక సంఘటనమును రచించి ననూ - అంతటి ప్రగాఢ కష్టగాథను - ప్రేక్షకులు ఉల్లాసముగా చూడజాలరు. కాబట్టి నాటకమున కవసరమైన ఐదు అంకములను పెంచి రచించెను. ఏ బాధ్య తలు లేని వ్యక్తి చేయగల్గిన త్యాగము వంటిది కాదు హర్షుడు చెప్పవలసినది. అందుకని తన నాటకనాయకుడు, యువకుడు, ఇంద్రియ నిగ్రహము కలిగిన వాడు, పితృసేవాపరాయణుడు, ప్రజానురంజనముగా పరిపాలన చేయగలిగిన వాడు. అన్నిటికన్న ముఖ్యము - మానవ సహజమైన ప్రేమానురాగములతో గృహస్థాశ్రమమున ప్రవేశించినవాడు-గృహస్థుగా కేవలము సాంసారిక సుఖము లకు, లాలసకు లోనుకానివాడు-అయిననూ-తామరాకుపై నీటిబొట్టువలె వ్యామో హములేక పరోపకారమునకై సర్వస్వార్పణ చేయగలవాడు అని నిరూపించుటకే మొదటి మూడు అంకముల నాటకమును హర్షుడు పెంచినాడు. అట్లే నాయకుడు చేసిన త్యాగము ఎంతటి ఉత్కృష్టమైనదో నిరూపించుటకుగాను పంచమాంకమున అతని బంధువుల ప్రవేశపెట్టి - వారాతనికై ఎట్లు తపించినదీ చూపినాడు. గరుడుడు పరమిచ్చినట్లు చెప్పినచో, నాయకునికన్న గరుడుడు ఉన్నతుడైన ట్లగుపించవచ్చును. కాబట్టి గరుడుడే జీమూతవాహనునకు వందన మొనర్చి, అతని ఆజ్ఞానుసారమున నడచినట్లు మార్చి చెప్పినాడు హర్షుడు. నాటక రచయి తగా యిట్టి మార్పులను చేయుటలో శ్రీహర్షుని నైపుణ్యము నిరూపితము. అట్లే గరుత్మంతుడు ఒకరికి బదులు వేరొకరిని భక్షించినట్లున్న మూలకథకు, హర్షుడు జోడించిన రక్తవస్త్రధారణ వృత్తాంతము అతని నాటక రచనా నైపుణ్యమున కొక మచ్చుతునక. పెండ్లియైన పిదప - అల్లునకు దీక్షావస్త్రము లిచ్చు సదా చారమును యిందు ప్రవేశబెట్టి-తద్రూపమున రక్తవస్త్రములను నాయకున కంద జేసిన తీరు ముదావహము. ఆ వస్త్రములను ధరించి జీమూతవాహనుడు వధ్య శిలపై పరుండిన కారణమున, గరుడుడు పొరబాటున నాగునికి బదులు జీమూత వాహనుని గొనిపోయెను. ఇట్టి కల్పన హర్షుని సమయజ్ఞతకు గుర్తు.

## నాగానందమునందలి విలక్షణత :-

ఈ నాటక ప్రస్తావనమునందు "అపూర్వ వస్తు రచనాలంకృతమ్" అని హర్షుడు ప్రకటించినాడు. అయిన, ఇందలి అపూర్వత ఎట్టిది? ఇది ఆలోచింప దగిన ప్రశ్న. చారిత్రకముగా చూచినచో యిందలి వస్తువు అపూర్వమనదగినదా?

కానేరదు. హర్ష చక్రవర్తి తన వృద్ధాప్యమున బౌద్ధమతమును స్వీకరించినట్లు తెలియుచున్నది. కాబట్టి ఈ నాటక ప్రారంభమున బుద్ధనుతి, తదనంతరమున జాతకకథా ప్రసంగము కలదు గాన, బౌద్ధధర్మ ప్రతిపాదనమే ఇందలి అపూర్వతయని కొందరి వాదము. "అహింసా పరమోధర్మః" అని చెప్పుట- ఈ దేశమున అపూర్వవిషయముగాదు. సనాతనవైదిక ధర్మమునగూడ, అహింస దయా, దానగుణముల మహత్త్యము బహుధా ప్రతిపాదితమేగాన- కేవల బౌద్ధ ధర్మ ప్రతిపాదనమే యిందలి ''అపూర్వత'' కానేరదు. వస్తువును బట్టి చూచి నచో ఇది కవికపోల కవిత్వముగాదు. సనాతనమో, బౌద్ధమో, ఏదియైననూ ఒక ప్రాచీన జనశ్రుతిలోని కథయే నాటకముగా మలచబడినది. కాన కథలో అపూర్వత లేదు. రసదృష్టిని పరికించిననూ యిందు 'అపూర్వత' కనిపించదు. మొదటి మూడు అంకములలోనూ నాయికా నాయకుల అనురాగ కథనమున శృంగారము, నాలుగైదు అంకములలో నాయకుని దయా, ఉత్సాహముల ప్రతిపాదనమున దయావీరములు నిబంధింపబడినవి. ఇందు పరస్పర విరుద్ధము లైన 'రతి' 'త్యాగ' భావనముల మేళనము అపూర్వమనిపించినచో- ఈ రెంటినీ సమన్వయపరచుటలో హర్షుడు విఫలుడైనాడని కొందరు విమర్శించుచున్నారు. గదా! అట్లుగాక హర్షుడు రసవిరోధ పరిహారమున విజయమునందిననూ పరస్పర విరుద్ధ రసముల సమ్మేళనము చాల కావ్యములలో ఇతఃపూర్వమున్నదే కాన, అది 'అపూర్వ'మనిపించుకొనదు. అయినచో ఇందలి 'అపూర్వత' ఎట్టిది? నాటకమున సర్వత్ర సృష్టింపబడిన వాతావరణము సర్వధా సనాతన ధర్మ ప్రతిపాదకము. కాన యిందు వాచకము సర్వధా సనాతనము. కాని వ్యంగ్యము మాత్రము బౌద్ధధర్మము యొక్క ఉత్కృష్టత. ఇంద్రియ నిగ్రహము, భౌతిక సుఖ నిరసనము, చతురాశ్రమముల ప్రామాణికానుష్ఠానము, ఆదర్శ గార్హస్థ్య జీవనముల ప్రతిపాదించుచునే, అవి ఆత్మోన్నతికి నిరుపయోగములైనట్లునూ, కేవల అహింసా, త్యాగములు మాత్రమే అన్నిటి కన్న మిన్నయనియూ వ్యంగ్య ముగా నుపదేశించుట యిందలి "అపూర్వత". నాటకమునందలి అపూర్వత యిదియే యని నిర్ధారించుటకు నాటకనామమొక ఉపపత్తి కాగలదు. ఇది నాగుల కానందము కల్పించిన అపూర్వకథా వస్తువు. సనాతన ధర్మప్రతిపాదక మైన మహాభారతమున మాతృప్రచోదనమున అసత్యమునకు పాల్పడిన నాగు లను - దైవీగుణ సంపత్తుగల గరుడుడు శిక్షించుట వర్ణింపబడినది. మోస మున వినతను దాసిగాచేసి బాధించిన దౌష్ట్యమునకు ప్రతీకలుగా నాగులు,

వానిని శిక్షించు దైవశక్తికిప్రతీకగా గరుత్మంతుడునూ సృష్టింపబడిరని భావించినచో అది పాతకథ. గరుడుని క్షమాభిక్ష సూచించి అపూర్వముగా ఈ నాటకమున నాగుల కానందము కలుగచేయబడినది.

కర్మానుష్ఠాన వాంఛతో తమతమ ఆశ్రమ ధర్మములను నిర్వర్తించు చున్న వివిధవ్యక్తులనడుమ జీవించుచూ, ధన్యుడనైతిననుకొనక, ఆర్తుల యానందముకై స్వీయ సహధర్మచారిణిని, తల్లిదండ్రులను గూడ విడిచి, శరీర త్యాగము చేయుటయే ఉత్తమమని ప్రతిపాదించుటయే ఈ నాటకమునందలి అపూర్వత. ఈ నా ప్రతిపాదనమును సోపపత్తికముగా వివరింతును.

ఈ నాటకమున నాందీ శ్లోకములలో బుద్ధుని స్తుతితోపాటు, ఆర్షమైన సన్యాసాశ్రమము సూచితము, ప్రథమాంకమున నాయకుని తల్లిదండ్రుల జీవన ప్రకారకథనమున వానప్రస్థమువర్ణితము. నాయకుని ది బ్రహ్మచర్యము. తదనంతర ద్వితీయ తృతీయాంకములందు గార్హస్థ్య స్వీకరణము ప్రతిపాదితము. చతుర్థ పంచమాంకములలో ఆశ్రమధర్మ నిర్వహణము పేరున సంబద్ధులై, రాగవ్యామోహములకు లోనైన కుటుంబసభ్యుల నడుమ నున్ననూ, అందరి అనురాగమును త్రెంచుకొని పరోపకారమునకై శరీరత్యాగమొనర్చిన వాడు నాయకుడు.

ప్రస్తావనమునందే గార్హస్థ్యము నటీసూత్రధారుల సంభాషణమున ప్రతిపాదింపబడినది. "కుటుంబ భారోద్వహనయోగ్య ఇదానీం త్వమితి" అన్న నటి మాటలు ఈ విషయమునే సూచించును. సూత్రధారుని తల్లిదండ్రులు-నాటకమునందలి నాయకుని తల్లిదండ్రులు వానప్రస్థమునకు పోయిరట-ఎందుకు? 'నిర్వృతి' కొఱకని నాయకుడని ఈ క్రిందివాక్యము బట్టి తెలియుచున్నది: "మన్యే భవిష్యతీహ వసతామస్మాకం పరా నిర్వృతిః"-పితరుల వానప్రస్థమున కనువైన వనభూమిని వెదకిన పిదప, నాయకుడు మిత్రునితో పలికిన వాక్య మిది. అట్టి వానప్రస్థమున చేరిన నైష్ఠికులైన పెద్దలు, వైదిక ధర్మానుష్ఠాతలు. ఆ ఆశ్రమప్రదేశమంతయూ, వేదనాదతరంగితము, "ముదిత మునిజన ప్రవిచార్యమాణ సందిగ్ధవేదవాక్య విస్తర"మై యజ్ఞార్థము సమకూర్చుకొనబడిన సమిధలతో, హోమ సుగంధముతో పరివ్యాప్తమైన ఆశ్రమమది. అదే ప్రాంత మున నిరంతరమూ జరుగు అకారణ జీవహింస- ఆ వనవాసులకు ఏ విధమైన మనఃక్లేశమునూ కలిగింపలేదనునట్లు-నాటకమునందలి నాలుగు ఐదు అంకము

లలో వ్యంగ్యముగా సూచితమగుచున్నది. నాటకమునందలి ఇతర వ్యక్తు లందరికీ గూడ అచట జరుగు జీవహింస (నాగవధ), వారివారి స్వభావములను బట్టి భయమునో, నిర్లిప్తతనో, నిస్సహాయతనో వ్యక్తము చేసినదేగాని, ఆర్త త్రాణమునకై, పరోపకారమునకై ప్రాణత్యాగ మొనర్చుటకు వారినెవ్వరినీ సిద్ధ పరుపలేదు.

''జిహ్వాసహస్ర ద్వితయస్య మధ్యే నైకాపి కిం తాదృగభూ ద్రసజ్ఞా।
ఏషోఽహి రక్షార్థమహిద్విషేఽద్య దత్తోమయాత్మేతి యయాబ్రవీతి॥''
(IV-5)

''నాగులను కాపాడుటకు నేనాత్మాహుతి యగుదునని చెప్పెడి నాలుక ఒక్కటి కూడ లేదా?'' యని వేయినాలుకల ఆదిశేషుని గురించి ఈ నాటకమున నాయకుడు పల్కిన పలుకులు నాటకమున ఏ ఇతరవ్యక్తికినీ అట్టి ఆలోచనము కలుగలేదని పరోక్షముగా చెప్పుటకే యనిపించుచున్నది. మిత్రావసువు 'నాగ హనన వృత్తాంతము' కేవలము నిర్లిప్తముగా చెప్పెను. ఆతని తల్లిదండ్రులు దివిజవంశ్యులయ్యునూ, పట్టించుకొనక, నాగవధా వృత్తాంతము విని ఆ ప్రదేశము ప్రమాదభరితమని భయమును మాత్రమే వ్యక్తము చేసిరి. వానప్రస్థమున నున్న నాయకుని తండ్రి నాగవధవార్తను విని తమ కుమారుడు చేసిన త్యాగము నభి నందించుటకు బదులు కుతర్కమును ప్రారంభించి:

''కిం రక్ష్యా బహవః కిమేక ఇతి తే జాతాఽన చింతా కథమ్।
తార్క్ష్యాత్ త్రాతు మహిం స్వజీవిత పరిత్యాగ ంత్వయా కుర్వతా యేనాత్మా పితరౌ వధూరితి హతం నిశ్శేషమేతత్కులమ్'' (V-20) ''ఇది యేమి? ఒక పామును కాపాడుటకు తల్లిని తండ్రిని భార్యను వంశమునంతనూ చంపుకొనునట్టి ఆత్మబలిదాన మొసర్చితివి'' అనును. మోక్షార్థియై- గృహస్థాశ్రమము వీడి వానప్రస్థమున చేరిన నైష్ఠికునకు, కుమారుడొనర్చిన బలిదానము ఎంత బాధ కలిగించినదో, అట్టిదే నాగుల బాధ కూడ యని అనిపించలేదని- కవి వ్యంగ్యముగా సూచించినాడు. నాయికకు, తన భర్త క్షేమము తప్ప అన్యము పట్టలేదు. గౌరీదేవిని ప్రార్థించి భర్తృ ప్రాణములను మరల తెచ్చుకొన గలిగిన యామెకు నిత్యమూ అన్యాయముగా హత్య చేయబడుచున్న నాగుల విషయమే పట్టలేదు. వీరందరునూ సనాతన ధర్మమునకు అనుయాయులే. ఇట్టి పరిస్థితిలో నాయకు డగు జీమూతవాహనుడు పరమోత్కృష్ట బౌద్ధధర్మములైన దయా, త్యాగము

లను లక్ష్యముగా చేసికొని, అన్ని బంధములను త్రెంచుకొని అమాయకులగు నాగుల కొరకు తానాహుతియైనాడు. తద్ద్వారమున నాగులకు అత్యంతానందము కల్గించినాడు. ఇదియే 'నాగానందము.' ఇట్టి విషయప్రతిపాదనమే ఈ నాటకము నందలి 'అపూర్వత' యన వచ్చును. ఇట్లు బౌద్ధము యొక్క ఉత్కృష్టతను ప్రతిపాదించుచునే ఆదర్శ సనాతన గార్హస్థ్యము గురించి గూడ సముచితముగనే హర్షుడు రచనము గావించినాడు. నాయకుడు బ్రహ్మచారిగా పితృసేవా పరాయణుడై యుండుట- ఇంద్రియ నిగ్రహము కలిగి, అన్య స్త్రీల విషయమున శీలవంతుడై నడచుకొనుట, పెద్దల యనుమతితోనే వివాహమున కంగీకరించుట, వివాహానంతరము గూడ కేవల శారీరక సౌఖ్యములకు విలాసములకు ప్రాముఖ్య మీయకుండుట, పరోపకారమే జీవన పరమావధిగా జీవించుట వంటి గుణములను నాయకునియందు ప్రతిపాదించుటచే ఆదర్శ గృహస్థ జీవితమిందు చక్కగా చూపబడినదనవచ్చును. శంఖచూడునిబదులుగా తాను వధ్యశిల చేరదలచి నప్పుడు, దైవవశమున తన అత్తవారి యింటి నుండి రక్త వస్త్రములు కానుకగా రాగా- అవి తన తక్షణ కర్తవ్యమునకు ఉపయోగించుట కనుగొని ''సఫలీ భూతో మే మలయవత్యా పాణిగ్రహః'' అని మలయవతితో తన వివాహము సఫలమైనదనుట - 'సర్వోపకారక్షమమాశ్రమం' అని గృహస్థాశ్రమమును ప్రశంసించు ఆర్ష వాక్యమును జ్ఞప్తికి తెచ్చును.

ఆదర్శ గార్హస్థ్యమును శ్రీహర్షుడు ప్రతిపాదింపదలచినాడని మనము నిర్ధారించుటకు గాను తృతీయాంకమునందలి విట చేటీ విదూషకుల వృత్తాంతము, తదనంతరమున రాజబంధువుల పెండ్లి వేడుకలప్రసంగమును తోడ్పడును. పెండ్లి యనగానే విచ్చలవిడిగా, ఇంద్రియసుఖములలో మునుగుట త్రాగుట, స్వేచ్ఛగా ఉద్యానముల విహరించుటయను భావము ఆనాటి జనులలో కలదని ఈ దృశ్యములు సూచించును. దీనితో పోల్చినప్పుడు తృతీయాంకముననే నాయికా నాయకులు ఉద్యాన వనవిహారమును, అందు వారియొక్క ఆదర్శమయ వ్యవహారమును గుర్తించినచో శ్రీహర్షుడు దేనిని నిరసించెనో, దేనిని ప్రశంసాపూర్వకముగా చూపించెనో కూడ అవగతమగును. నాటక ప్రస్తావనమున సూచింపబడిన గృహస్థ జీవితమే నాటకాంతమున కూడ - ''మోదన్తాం సతతం చ బాన్ధవ సుహృద్గోష్ఠీ ప్రమోదా ప్రజా'' బంధుమిత్రులతో సద్గోష్ఠులలో ప్రజలు జీవింతురు గాక-యను- సుఖశాంతుల కాలవాలమైన గృహస్థ జీవితమే సూచింపబడినది. నాటకము పొడవునను ఆదర్శ గృహిణిగా మలయవతి చిత్రింప

బడినది. ఆమె పాతివ్రత్య మహిమచేతనే-ఆమె ఉపాస్యదేవత గౌరి - నాయకుని బ్రతికించినది. అట్లు కానిచో నాగులను బ్రతికించినట్లే గరుడుడే జీమూతవాహనుని గూడ బ్రతికించెనని చెప్పవచ్చును. అట్లుగాక గౌరీ యనుగ్రహమును ప్రవేశ పెట్టుట గార్హస్థ్య జీవనము యొక్క ఉత్కృష్టతను ప్రతిపాదించుటకే అనుకొన వచ్చును.

## నాగానందము-రస మీమాంస :

త్యాగభావ సమలంకృతమైన ఆదర్శగార్హస్థ్యముపాధేయమని సామాజికుల కుపదేశించుటకుకాంతాసమ్మితమైన సాధనమగు నాటకమున ప్రధానముగా వీరరసమే నిబంధింపబడినదనుట నిర్వివాదాంశము. లోక ప్రసిద్ధమగు జీమూతవాహనుని జీవితగాథ దయారసభరితమని లాక్షణికులందరిచే నంగీకృతము. రసము అనుభవైకవేద్యము గదా! అయినను, ఆస్వాదయోగ్యములైన ఏయే యంశముల సమ్మేళనమున ఈ దయావీరము యీ నాటకమున నిబంధింపబడినదో వివరించుట రసమీమాంసకు భూమిక కాగలదు.

ఈ నాటకమున అంగిరసము కరుణమనువారు కూడ కొందరు గలరు. అట్లే శాంతమును స్థాపింప యత్నించువారు కూడ గలరు. కానీ ప్రయత్న పూర్వకముగా నాయకుడు ఆదర్శ జీవితమును గడుపుటకు చూపు నుత్సాహమే ఇందు ప్రతి పదమున నగుపించుటచేతనూ, అందుననూ తోటి ప్రాణుల కొరకు స్వశరీరమునైన త్యాగము చేయుటకు నాయకుని హృదయ మెల్లప్పుడూ దయాద్రమై యుండిన కారణముననూ యిందు 'దయావీరమే' అంగిరసమని ప్రామాణిక విమర్శకులు ప్రకటించుట సర్వామోదకరము, సముచితము అగుచున్నది.

ఈ నాటకమున మొదటి మూడు అంకములలోనూ, నాయికా నాయకుల పరస్పర అనురాగము, విరహము, వివాహములు చిత్రింపబడుటచే యిందు శృంగార రసము నిబంధింపబడినదనియూ, చివరి రెండు అంకములలో నాయక మరణము సూచింపబడుటచేత ఇష్టజన వియోగజన్యమైన దుఃఖము స్థాయిగా గల కరుణము రసమనియు - మొదటి అంకమున గూడ కరుణము యొక్క ఛాయలు కలవు గాన యిందు కరుణమే అంగిరసమను వారు చెప్పుదురు. కానీ నాటకమును దర్శించుసమయమున సహృదయునకు సత్వోద్రేకమును, చిత్త విస్తారమును క్రమముగా కలిగించు భావము ఏది? ఏ స్థాయీభావము పునఃపునః ప్రబోధితమై హృదయమెల్ల తానుగా నిండి, అలౌకికముగా నెదిగి పరిపక్వమై

అవధుల నధిగమించి ఆనందముగా పరిణమించునో పరిశీలించనిదే రసనిర్ణయము సమగ్రము కాదు. అట్టి భావపరిణామ క్రమమును పరికింతము.

ప్రథమాంకమున నాయిక, విదూషకుల తొలి సంభాషణమున - నాయకుడైన జీమూతవాహనుడు పితృసేవాపేక్షతో రాజ్యమును గూడ త్యజించి వచ్చినాడని వార్త వినినవెంటనే - నాయకుని యొక్క త్యాగభావము సహృదయ క్షేత్రమున బీజరూపమున ప్రవేశించినది. నాయకుడట్లేల చేసెనో యను వితర్కము సహృదయునకు కలుగకమున్నే విదూషకుడు ఆ విషయమును వేరొక రీతిగా ప్రస్తావించగా, ''న్యాయ్యేవర్త్మని యోజితాః ప్రకృతయః'' (I-7) అను శ్లోకమున - నా రాజ్యమందలి ప్రజోద్యోగులను న్యాయమార్గమున నియమించితిని, సజ్జనులకు సుస్థితి కల్పించితిని, బంధువులకు నాతో సమానముగా సుఖమును పెంపొందించితిని, రాజ్యమును సురక్షిత మొనర్చితిని. అంతేగాదు, అర్థిజనులకై సర్వకామోదమైన 'కల్పవృక్షమును గూడ దాన మొనర్చితిని' అని నాయకుడు చెప్పుటను వినగానే ఆతడు సర్వసంగపరిత్యాగి కాడు కానీ, లౌకిక ప్రపంచమున సద్ధర్మాచరణ నిష్ఠుడైన యువకుడని తెలియును. వెంటనే ఆతని భౌతిక సుఖత్యాగము సహృదయుని హృదయ క్షేత్రమున మరింత సుముఖతను పొందును. రాజ్యమునే గాదు, దివ్యమైన కల్పవృక్షమునే తాగ్యము చేసినవాడతడని అభినందించు తరుణముననే- ''స్వశరీరప్రభృతి పదార్థమేవ సర్వం మయా పరికల్ప్యతే'' అని నాయకుని మాట వినిపించును. రాజ్యము శత్రుగతమగునప్పుడు గూడ, నాయకుడు స్వార్థమునెంచక, ఇతరులకొరకే తన శరీరము గూడ నర్పింపనెంచుచున్నాడను విషయము సహృదమునకు ప్రకటితమగును. కానీ మరుక్షణముననే ఈ మాటలు డాంబికములు కావుగదా!! అను సంశయము కూడ అతనికి గలుగును. వెనువెంటనే అది నాయకుని ప్రతిజ్ఞా వాక్య మనుభావము స్ఫురించి అందలి సత్యాసత్యముల నెరుంగుటకు సహృదయుని మనస్సు ఆరాటపడును. ఈ భావ్యార్థసూచనతో ప్రతిక్షణము సహృదయుని హృదయము నాయకుని త్యాగగుణము యొక్క పరిణతిని దర్శించుటకై యుత్సుకత చూపును. మలయ వనప్రదేశ మందలి తపోవనముల ప్రశాంతతను నాయకుడు ప్రశంసించుచూ, ''వాసోర్థం దయయేవ నాతిపృథవః కృత్తాస్తరూణాం త్వచో'' (I-10) (చెట్ల బెరళ్ళు వస్త్రధారణము నిమిత్తమై కొలది కొలదిగా మాత్రమే వలిచివేయబడినవి. యిందుకు కారణము చెట్లకు వ్యథగలుగునేమోయని భావించు మునుల దయయే కారణము''అను భావముగలవాక్యమును నాయకుని నోటినుండి వినినంతనేసహృద

యునకు-నాయకుని సహజ దయా స్వభావముగూడ తెలిసి ఆతని దయావిశేషము పట్ల మనస్సు మరింత ఆకృష్టమగును. ఇట్టి స్థితిలో - ఒక పాట వినవచ్చుట, నాయకునితోబాటు సహృదయుడు గూడ ఆకర్షితుడగుట జరుగును. అచట నాయకుని యందు అనురాగ బీజములు నెలకొనుటను పరికించిన సహృదయునకు, నాయకుని తొల్లింటి ప్రతిజ్ఞకు, ప్రస్తుత ప్రవర్తనమునకు విప్రతిపత్తి 'క్షణ'కాలము భాసించును. సహృదయుని మనస్సులోని భావమును బహిర్గతమొనర్చుచూ, విదూషకుడు "చిరస్య ఖావత్కాలస్య పతితః ఖల్వేష గోచరే మన్మధస్య"(ఎట్టకేలకు ఈతడు కాముని కంటబడినాడు) అని పలుకును. అచట నుండి ప్రథమాంకము పూర్తియగువరకూ నాయికా నాయకుల పరస్పర వీక్షణములు అనురాగ సూచకములుగా నిబంధింపబడి, ఎంతటి గుణవంతుడైననూ, త్యాగ దయా భావములు గలిగిన వాడైననూ, కాముని బాణమునకు బానిసయేగదా యనిపించి, నాయకుని అనురాగ మేమగునో యను భావము ప్రధానమై,సహృదయుడు నాటక పరిశీలనా నిమగ్నుడగును. తాత్కాలికముగా నాయకుని త్యాగనిష్ఠ నిద్రాణమైనట్లు, సహృదయమున దయాభావవిలసనము మరుగుపడును. ఇట్లు నాయకుని ప్రేమకథలో నిమగ్నమయిన సహృదయునకు ద్వితీయాంకమంతయూ నాయికా నాయకుల పరస్పర విరహవ్యథను ప్రతిబింబించు వర్ణనముల ద్వారా ఆకృష్టమై యుండగా విదూషకుడు "భో వయస్య! కుత్ర ఖలు గతం తే తద్ధీరత్వం" (మిత్రమా-తొల్లిటి నీ ధీరత్వమేమైనది?") అని ప్రశ్నించుటను వినినంతనే సహృదయునకు, నాటకారంభమున సూచితమైన నాయకుని త్యాగనిష్ఠ యందలి ఉత్సాహము మరల నొకసారి స్మృతిపథమున మెదలును. అప్పుడు తాను ఎంతటి స్థైర్యముతో దినములను గడపినదీ నాయకుడు "నీతాః కింననిశాః శంశాంకధవలాః"(II-3) అను శ్లోకమున ప్రకటించును, కానీ 'నన్వధీర ఏవాస్మి' యని తన బేలతనమును కూడ వ్యక్తము చేయును. ఆపైన వివాహప్రసంగము రాగా అందు నాయకుని దృఢానురాగము, పెద్దల మాటపట్ల ఆతని గౌరవముప్యక్తమగును. ఇవిచూచి నపుడు నాయకుని ప్రణయముగూడ, ధృతితోగూడినదే గాని, కేవలము ఇంద్రియలోలుపత కాదని సహృదయున కనిపించును. ప్రియురాలిని ఆత్మహత్య నుండి నివారించుటకై ఆమె చేతిని పట్టుకొనిన నాయకుడు, "చేయి విడువుమ"ని ఆమె కోరగా,

''కంఠేహార లతాయోగ్యే యేనపాశః త్వయార్పితః !

గృహీతః సాపరాధోఽయం సకథం ముచ్యతేకరం." (II-12) (హార యోగ్యమైన మెడకు (అనురాగ) పాశముగా పరిణమించిన ఈ నీ హస్తమును-ఎట్లు విడచి పుచ్చెదను) అని పలుకుటను వినినంతనే నాయకుని రాగాధిక్యము గుర్తించిన సహృదయుడు, తృతీయాంకమున ఉద్యాన వనమున ఏకాంతమున చేరిన వేళల-

''యేతన్ముఖంప్రియాయాః శశినం క్షిప్త్వా కపోలయోః కాన్త్యా!

తాపానురక్తమధునా కమలంధ్రువ మీహతే జేతుమ్.'' (III - 10)

(ప్రియురాలి ముఖము కపోలకాంతిచే చంద్రుని ధిక్కరించి, ఇప్పుడు అనురాగ రాగమున సూర్యతాపానురక్తయగు కమలమును జయింప గోరుచున్నది) అని పలుకుచూ,

"స్మిత పుష్పోద్గమోఽయం తే దృశ్యతేఽధర పల్లవే।

ఫలం త్వన్యత్ర ముగ్ధాక్షి చక్షుషోర్మమ పశ్యత !" (III-12)

(ఎఱ్ఱని చిగురుటాకులనెడి పెదవులనడుమనుండి నీచిరునవ్వను పుష్పముదయించుచున్నది. కానీ దాని ఫలము, మాత్రము వేరొకచోట అనగా అది నా కళ్ళలో నున్నది) అను పలుకులు ఈ నాటకము నందలి అమలిన శృంగారమును ప్రస్ఫుటము చేయును. కావుననే, నాటకము నందెక్కడను నాయికా నాయకుల సంభోగ శృంగారము, సంయోగము వర్ణితము కాలేదు. వారి వివాహము ధర్మబద్ధముగా జరిగినది. సహధర్మచారులుగనే వారు వివాహ బంధమున కలసి జీవింతురు అను విషయముగూడ సహృదయునకు స్పష్ట మగును. ఆ విధముగా శృంగారమందు రసస్థితికి పరిణమించక, ఈషదూనముగ నిలచినను రుచిరముగానుండి, సహృదయుని రంజింప చేయును. అట్లు యిందు శృంగారము అంగరసమైనది. ఇది నాయకుని నిగ్రహమును, ధర్మనిష్ఠను గూడ సూచించుచూ, అంగిరసమగు దయావీరమునకు దోహదకారిగానే యున్నది. త్యాగి, దయాహృదయుడు, ఇంద్రియనిగ్రహము గలవాడును, అనురాగియై గృహస్థాశ్రమమున ప్రవేశించిన వాడునైన నాయకుడు తృతీయాంక మనుసరికి సహృదయుని మనోనేత్రమునకు ప్రత్యక్షమగును. అట్టివాడు చతుర్థాంక ప్రారంభమునుండియూ భిన్నముగా నగుపించును. అత్తవారింట క్రొత్త

పెండ్లాముతో కులాసాగా నుండదగిన దినమునలో విహారమునకై సముద్రతీర మేగిన నాయకునకు-

శ్లో. "శయ్యా శాద్వల మాసనం, శుచిశిలా సద్మ ద్రుమాణామధః
శీతం నిర్ఝరవారి పానమశనం కందాః సహాయామృగాః ।
ఇత్య ప్రార్థిత లభ్య సర్వావిభవే దోషోయ మే కో వనే
దుష్ప్రాపార్థిని యత్పరార్థఘటనావస్యైః వృథాస్థీయతే॥" (IV-2)

పచ్చిక బయళ్ళ పానుపు, స్వచ్ఛమైన శిలాసనము, చెట్లనీడనివాసము, సెలయేళ్ళ చల్లని జలపానము, కందమూలముల ఆహారము, అడవియందు వైభవ సర్వస్వములుగా భాసించినవి. ఇతరుల కోర్కెను దీర్చి జీవితమును ధన్యమొనర్చు కొనునట్టి యవకాశమును కల్పించు, యాచకులు మాత్రమిచ్చట లేక పోవుట ఒక్కటియే అచటి లోపమని తలంపు వచ్చును-ఆతని పట్ల ప్రథమాంకమున నేర్పడి, ద్వితీయ, తృతీయాంకములలో కొద్దిగా మరుగుపడిన సద్భావనమును మరల సహృదయుని హృదయమున నుద్బుద్ధము చేయును. అంతేగాదు, యాచకులు లేరుగదాయను నాయకుని తలంపు ఆతని త్యాగ భావమునకు మరల ప్రాణము పోసి సహృదయ హృదయముననున్న తొల్లిటి బీజమును మొలకెత్తించును. ఇటనుండి అది చిలువలుపలవలై ఎదిగి ఫలవంతమై రసానందకముగా ఈ నాటకమున పరిణమించును.

నాయకుడు తన ఎదుటనున్న ఎముకల గుట్టలను గుర్తించి గరుడ కృతమైన నాగసంహారమును గురించి వినునప్పుడు ఆతని జాలిగుండె ప్రతి పదముననూ ప్రకటితమగును.

నాగులన్నియు ఒకేసారి చనిపోవునని శంకించిన నాగరాజు వాసుకి ముందుగా గరుత్మంతునితో మాట్లాడినాడని మిత్రావసువనగానే, "కిం మాం ప్రథమం భక్షయేతి"-ఏమీ! ముందుగా నన్ను భక్షింపుమని (నాగరాజనినాడా?) యని ప్రశ్నించి, లేదని విని "వేయితలలలోనూ వెరసి రెండువేల నాల్కలు గల ఆదిశేషుని నాలుకలలో- నాగుల రక్షించుటకై ఇదిగో నా దేహ మిత్తునని ముందుకువచ్చి చెప్పగల నాలుక ఒక్కటి కూడ లేదా!" యనినప్పుడునూ,

జిహ్వా సహస్రద్వితయస్య మధ్యే నైకాపి కిం తాదృగభూద్రసజ్ఞా।
ఏషోఽహి రక్షార్థ మహిద్విషేఽద్య దత్తో మయాత్మేతి యయా బ్రవీతి
(IV-5)

సర్వాశుచి నిధానస్య కృతఘ్నస్య వినాశినః
శరీర కస్యాపి కృతేమూఢాః పాపాని కుర్వతే (IV-7) (సర్వకలుష నిలయమై, కృతఘ్నమై. నశ్వరమైన విలువలేని ఈ శరీరముకొరకు మూర్ఖులు పాపములు చేతురుగదా-'') ఈ నాగుల కష్టమునకు అంతమే లేదా? వీరిలో ఒకరినైన, నా ఆత్మార్పణము ద్వారా రక్షింపగలనా?'' అను దయార్ద్రభావములు నాయకుని ముఖతః వినిన సహృదయునకు, ప్రథమాంకమున ప్రభవించిన స్థాయీ భావము- నాయకుని నవీన ఉత్సాహ వాక్యములచే మరల మేల్కొల్పబడి రసోన్ముఖమై నిలచును. బలిపశువుగా నచటకు పంపబడిన శంఖచూడునితో తల్లి యొక్క సంభాషణము, వారియొక్క దుఃఖము, సహృదయ హృదయమును జాలివానజల్లుతో ఆర్ద్రమొనర్చును. అట్టి ఆర్ద్రమైన హృదయమున నాయకుడు ''చంచుర్నైవ ఖగాధిపస్య హృదయం వజ్రేణ మన్యే కృతం''- (గరుడుని ముక్కే కాక, హృదయమే వజ్రముతో నిర్మింపబడినట్లున్నదని) బాహ్యముగా ప్రకటించును. ఆ సమయముననే శంఖచూడుడు-

యై రత్యంత దయా పరైర్న విహితా వన్ధ్యార్థినాం ప్రార్థనా
యైఃకారుణ్య పరిగ్రహాన్న గణితః స్వార్థః పరార్థం ప్రతి।
యే నిత్యం పరదుఃఖదుఃఖిత ధియస్తే సాధవోఽస్తంగతాః
మతః సంహార బాష్పవేగమధునా కన్యాగ్రతో రుద్యతే? (IV-10)

''యాచకుల కోర్కె ఏ పరమదయా హృదయులచే వృథా చేయబడలేదో- కరుణతో నిండిన కారణమున- ఇతరుల కొరకు చేయుపనిలో ఎవరిచే స్వార్థము లెక్కింపబడదో, ఎవరు ప్రతి నిత్యము తోటివారి కష్టమును చూచి తాము దుఃఖింతురో, అట్టి సజ్జనులు నేడు నశించిపోయిరి. అమ్మా- ఇంక ఎవరి యెదుట నీ ఏడుపు ? ఇక ఆపివేయుము'' అనుటను వినగానే నాయకునిహృదయము ద్రవించిపోయినది. అంతేగాదు, ''నీవు నా కొక్కడవే పుత్త్రుడవను కారణమున వాసుకి నిన్నేల విడిచి పుచ్చలేదు. జాలిమాలిన ఓ మృత్యువా!- లోకులనందరనూ విడచి, నా కుమారునే గ్రహింపవచ్చితివా?'' అని ఎలుగెత్తి ఏడ్చుచున్న ముదుసలి స్త్రీ ఆక్రందనము, నాయకునిలోని దయావీరమును ప్రబోధన మొనర్చును. ''ఇట్టి దుఃఖితుని, మృత్యుముఖమున నున్న వానిని రక్షించుట కుపయోగించనిచో ఈ నా దేహముండి ప్రయోజనమేమి?'' అని నాయకుడు వితర్కించుకొని, పరోపకారార్థము ఆత్మాహుతికి నిశ్చయించి ''నేను రక్షింతు'' ననుచూ వెంటనే ముందున కేగును.

అనుక్షణము మృత్యురూపముగా గరుడుని రాకనే శంకించుచున్న వృద్ధస్త్రీ జీమూతవాహనునిగూడ అచట గరుడునిగా భావించి భయపడును. "నా కుమారుని బదులు నన్ను భక్షింపుము-నన్నే నాగరాజు నీకాహారముగా పంపెను" అని ఆమె పలుకుటను వినినప్పుడు- "ఇట్టి హృదయవిదారకమైన ఆక్రందనము వినినచో కఠిన హృదయుడైన గరుత్మంతుడుకూడ దయామయుడు కాగలడు" అని నాయకుడు పలుకును. అది వినిన సహృదయుడు దయార్ద్రహృదయుడుగా యనుభూతిని పొందుటలో నాశ్చర్యముండదు. నాయకుడు తానే గరుడునికొరకు ఆహారమగుదునని పలికినప్పుడు శంఖచూడుడు "అహో జగద్విపరీతమస్య మహాసత్వస్యచేతః"

విశ్వామిత్రః శ్వమాంసం శ్వపచఇవ పురాభక్షయద్యన్నిమిత్తం
నాడీజంఘో నిజఘ్నే కృత తదుపకృతి ర్యత్కృతే గౌతమేన।
పుత్రోఽయం కశ్యపస్య ప్రతిదినమురగానత్తి తార్క్ష్యో యదర్థం
ప్రాణాం స్తానేష సాధు తృణమివ కృపయా యః పరార్థం జహాతి॥

(IV-15)

(ఏ ప్రాణములను నిలుపుకొనుటకొఱకు పూర్వము విశ్వామిత్రుడు కుక్క మాంసము తినెనో-ఏ ప్రాణముకొరకు గౌతముడను బ్రాహ్మణునిచేత తన కుప కార మొనర్చిన నాడీజంఘుడే చంపబడెనో, ఏ ప్రాణము కొరకు కశ్యపబ్రహ్మ కుమారుడైన గరుడుడు నిత్యమూ నాగులను భక్షించుచుండెనో-అట్టి ప్రాణము లను దయాహృదయముచే ఈ సజ్జనుడు యితరులకొఱకు త్యాగము చేయు చున్నాడు) ఆహా! ఈతని మనస్సు లోకవిరుద్ధముగా నగుపించుచున్నది." యనుట ప్రాకరణికమైన దయావీరమును మరొక మెట్టెక్కించి పరిణతి దిశకు పరువెట్టించుట సహజము.

"జాయన్తే చ మ్రియన్తే చ మాదృశాః క్షుద్ర జన్తవః
పరార్థం బద్ధకక్ష్యాణాం త్వాదృశాముద్భవః కుతః" (IV-16)

(మావంటి నీచప్రాణులు పుట్టుట గిట్టుట జరుగుచూనే యుండును. ఇతరుల హితముకొరకు నడుము బిగించిన మీవంటి వారెచటనుందురు?" అను శంఖ చూడుని వాక్యమును "న మే చిరాల్లబ్ధావసరస్యాస్య పరార్థ సంపాదన మనోరథ స్యాన్తరాయం కర్తు మర్హసి" (ఇతరుల కొరకు స్వాత్మార్పణము చేయుట కవ కాశము చాలకాలమునకు దొరికినది - దీనికాలశ్యమును కలిగింపకుము) అను

నాయక వాక్యములు దయావీరమున కుద్దీపనములు గదా! అట్లే చతుర్థాంకమున ప్రతిపదము గుండెలున్న వానిని కరిగించివేయునవే. "నా కొఱకు విచారింపకుము. నా మరణమును చూచిన పిదప నా తల్లి భరించలేక మరణించును. ఆమెను మృత్యువు నుండి కాపాడు నుపాయ మాలోచింపుము" అని శంఖచూడుడు కోరును.

"నీవు మరణించిన మరణించి, నీవు బ్రతికిన బ్రతికెడి నీ తల్లి ప్రాణములను కాపాడదలచినచో నా ప్రాణముల నడ్డువేసికొని-నీ ప్రాణముల కాపాడు కొనుము" అని ఉత్సాహమున నాయకుడు ముందునకు వచ్చును.

ఈ సందర్భమున నచటి శ్మశానము హృదయవిదారకముగా వర్ణింపబడినది. "ప్రతి దినము ఇచట భక్షింపబడుచున్న నాగులయొక్క మాంస ఖండములు- గరుడుని ముక్కునుండి జారి పడినవి భక్షించుటకు అత్యాశతో- రెక్కలు పరుచుకొని ఆకాశమును చీకట్లతో క్రమ్ముకొని వచ్చుచున్న గ్రద్దల గుంపులు, రక్త ప్రవాహములలో మురిగిపోయిన మాంసఖండముల దుర్వాసనతో నిండిన ఈ ప్రదేశమున సంచరించు నక్కలు ఎడతెగనిరోదనములు చేయుచున్నవి." "ఎడతెగని సర్పాహారమును ఆనంద ప్రదముగా అనుదినము గరుడునకు సమకూర్చుచున్న ఈ శ్మశానము. తెల్లని ఎముకల ప్రోవులతోనిండి రుద్రుని శరీరమువలె నున్నది." యిట్టి భావముల నందించు శ్మశాన వర్ణనము భయంకరముగా నుండగా, కంచుకి అనూహ్యముగా నందించిన రక్త వస్త్రముల కప్పుకొని, ఇతరులకొరకు తన ప్రాణములను సమర్పించుటకై వధ్య శిలపై శయనించిన నాయకుడు-

"నతథా సుఖయతి మన్యే మలయవతీ మలయ చందన రసార్ద్రా।
అభివాంఛితార్థ సిద్ధ్యై వధ్యశిలే య యథా శ్లిష్టా." (IV-23)

(నా చిరకాల వాంఛను దీర్చబోవుచున్న ఈ శిలా స్పర్శా సుఖము, మలయవతీ చందన చర్చిత దేహస్పర్శా సుఖముసకన్న మిన్నగా నున్నదని) ముందుగా భార్యను స్మరించును. నాయకుని ఆ మాటను వినినప్పుడు-తొలి మూడంకముల లోనూ ఏయే శృంగార రస స్ఫోరక భావములు సహృదయుల మనసున ప్రవేశించినవో అవి యన్నియూ- నాయకుని నూతనోత్సాహ ప్రవాహమున మునిగిపోవును. మరుక్షణముననే-

"శయితేన మాతురంకే విశ్రబ్ధం శైశవే న యత్ప్రాప్తమ్।
లబ్ధం సుఖం మయాస్యా వధ్య శిలా యాస్త దుత్సంగే." (IV-24)

"ఈనాటి, ఈ వ్యధ శిలా తలమున శయనించుటలో నాకు కలిగిన సుఖాను భూతి వంటి దానిని శైశవమున తల్లి ఒడిలో నొదిగి శయనించి నప్పుడు గూడ పొందలేకపోయితిని" అని భావించెడి నాయకుని పలుకులతో నాటకారంభమున, పితృసేవాపరాయణుడైన నాయకుని చూచిన తొలి దశలో అతనిపట్ల కలిగిన సద్భావము మరల సహృదయుని హృదయమున నుద్దీప్తమై - పితృ సేవకన్న-భార్యాప్రేమకన్న-ఇతర సౌఖ్యములకన్న-పరోపకారమే మిన్నయని-అందుకై ప్రాణములనైన త్యజించుట నాయకుని సహజ స్వభావమేగాని-డాంబిక వచనము కాదను తలంపు స్థిరపడి, నాయకుని హృదయాంబుధిలోని దయా తరంగములలో సహృదయుని భావ విహంగ మోలలాడును. పిమ్మట భయంకరముగా గరుడుడు వచ్చి నాయకుని గోళ్ళతో తన్నుకొని పోయినప్పుడు సహృదయుని హృదయం డము ''మర్మ వేదన''కులోనై, కరగి దయా సముద్రమున లీనమై,తాదాత్మ్యమై-భావనాకాశము వర్షించు పూలవానలో-మంగళ దుందుభుల ప్రోతలలో అలౌకిక రసానందపు టంచులు దాటును.

''నాగానాం రక్షితా భాతి గురురేష యధామమ ।
తధా సర్పాశనాకాంక్షాం వ్యక్తమద్యాపనేష్యతి IV-29

''ఈనాడు తన శరీర దానముచేత యితర నాగులనురక్షించిన ఈ'నాగుడు'బరువుగా నున్నాడు-కాన తప్పకవీడు నాగులపట్ల నాకుగలఆకలిని ఈరోజునయింకతీర్చివేయ గలడు" అని గరుడుడు పల్కిన చివరి శ్లోకమును చతుర్థాంకమున వినినప్పుడు. నాయకుని దయావీరము సార్థకము, ప్రయోజన సంపాదకము అను తలంపు క్షణ కాలమున మెరసి-సహృదయుని రసానందమునకు పరిపూర్ణతను సంతరిం చును. ఈ విధముగా చతుర్థాంకము ఈ నాటకమునందలి రసనిష్యంది. ఆలోచన మనస్సునకు చెందినది. ఆనందనము హృదయమునకు చెందినది. ఆలోచనముడిగి, ఆనందమున లీనమైనప్పుడే రససిద్ధి. ''నాగులకై శరీర దాన మొనర్చిన నాయకు డేమైనాడు అను ప్రశ్నార్థకమైన ఆలోచన ముడుగనిదే అతడు ప్రదర్శించిన 'దయావీరము' ఆలోచనకెక్కునేగాని అనుభూతికి చిక్కదు. కాన వ్యంగ్యముగా చతుర్థాంకాంత శ్లోకమున దానిని సూచించి - ఆనందపరాకాష్ఠకు చేర్చి-దానిని స్థాయి రూపమున నిలబెట్టుటకో యనునట్లు పంచమాంకమున హర్షుడు ప్రయత్నించినాడు. పంచమాంకమున 'ఇష్టజనవష్ట కారణమున, ఆప్తుల హృదయములందు రగిలేడిదుఃఖము క్రమక్రమముగా ప్రతిపాదింపబడినది.'' అన్ని సుఖములను అనుభవించి, కీర్తినిపొంది - రాజ్య

మున స్థైర్యము పొంది, తపోనిష్ఠలో బహు కాలము గడిపి, ప్రశంసార్హుడైన పుత్రుని-సత్కులజయైన కోడలిని గలిగిన నా జీవితము...యొక్క కృతార్థత యిక మృత్యువు..." అని ఏదియో భావించుచున్న నాయకుని తండ్రి పలుకుల నర్ధోక్తిలోనే, అపుచూ, "జీమూతవాహనునియొక్క (మరణము చేతనే)..." అను ప్రతీహారి పలుకులతో యిందలి కరుణమున కంకురార్పణము జరిగినది. రక్తసిక్తమైన జీమూతవాహనుని శిరోరత్నము ఆతని తల్లిదండ్రుల పాదముల చెంత పడినప్పుడు-యిందలి కరుణము మరొకమెట్టెక్కినది. పుత్రమరణ వార్తను విని, తొల్లిటి యాతని సచ్చరితమును వారుస్మరించినప్పుడెల్ల ఈ అంకము నందలి 'కరుణము' క్రమపరిణతి నందుచూ ముందుకు సాగినది.

"చూడామణిం చరణయోర్మమ పాతయతా త్వయా !

లోకాంతర గతేనాపి నోఝ్ఝితో వినయక్రమః (V-II) (శిరోరత్నమును మా పాదముల చెంత పడవేయుట ద్వారా, మృతినొందిగూడ నీవు మా పట్ల వినయమును ప్రదర్శించితివి) అని - నాయకుని వియోగము సహింపలేక అందరునూ ఆత్మహత్యకుద్యుక్తులౌట కరుణమునకిందు పరాకాష్ఠ-కానీ మరుక్షణము ననే - మరణ యత్నము నుండి వెనుదిరిగి- "న ఖల్వేవ మనిశ్చిత్యైవ యుక్తం సాహసమనుష్ఠాతుం విచిత్రాణి విధివిలసితాని" అను శంఖచూడుని వాక్యములతో, అంతవరకూ పెంపొందింపబడిన 'కరుణము' అద్భుతోన్ముఖమై ఆశను చిగురింపచేసి విశ్రాంతమైనది. ఆపైన పంచమాంకమున అన్నియునూ ఆశ్చర్య జనకములైన సంఘటనములే - అద్భుతరసము-తదుద్దీపక విభావాదులు వీర రస సహచరులగుట సహజమే గదా ।

అటుపిమ్మట—

స్వశరీరము ఖండితమై తినివేయబడుచున్ననూ నాయకుని యందు తత్కృతమైన వ్యథగాని, విచారముగాని కనిపింపకపోవుటచే గరుడున కాశ్చర్యమైనది.

> గ్లాని ర్నాధిక పీయమాన రుధిరస్యాప్యస్తి ధైర్యోదధే-
> ర్మాంసోత్కర్షణజా రుజోఽపి వహతః ప్రీత్యాప్రసన్నంముఖమ్ ।
> గాత్రం యన్నవిలుప్తమేష పులకస్తత్ర స్ఫుటో లక్ష్యతే
> దృష్టిర్మయ్యుపకారిణీవ నిపతత్యస్యాపకారిణ్యపి ॥ (V-14)

ఈ వర్ణనము గరుత్మంతుని ఆశ్చర్యపరిచాయకము. ఈ ఆశ్చర్యమును నాయకుని ఈ క్రింది పలుకు పెంపొందించి, పర్యవసానముగా నాయకుని దయావీరునిగా చిత్రించినది.

శిరాముఖైః స్యందత ఏవరక్తా మద్యాపి దేహేమమ మాంసమస్తి ।
తృప్తిం న పశ్యామి చ తే మహాత్మన్ కిం భక్షణాత్త్వం విరతో గరుత్మన్॥
(V-15)

అర్ధభక్షితుడైన నాయకుడు "యింకనూ నా శరీరమున మాంసమున్నది - తినవేమి?" యని గరుడు నడుగుట. గరుడునకు-ప్రేక్షకుడైన సహృదయునకు గూడ అతీవాద్భుతమై తోచుట సహజము. అందుకనే-

ఆపర్జితం మయాచంచ్వా హృదయాత్తవ త్తపశోణితమ్
ధైర్యేణానేన హృతంత్వయా హృదయమేవ మే ॥ (V-16)

"నీ గుండెలనుండి రక్తమును నేను త్రాగితిని కానీ ఈ నీ ధైర్యము నా హృదయమునే హరించినదను" గరుడోక్తి వినినప్పుడు సహృదయుడు, తన హృదయగతమునే మరల వినుట సహజము గదా! తదనంతరము శంఖచూడుడు వచ్చి నిజము చెప్పగా, గరుడుని ఆశ్చర్యము పెరిగి, తాను చేసిన పొరబాటునకు-మహాపాతకమునకు అగ్నిప్రవేశమే ప్రాయశ్చిత్తమని యెంచునట్లొనర్చినది. నాయకుని దుర్గతికి విలపించుచూ వచ్చిన తల్లిదండ్రులకు, గరుత్మంతునిచే వందనము చేయబడుచున్న నాయకుని కనుగొన ఆశ్చర్యానందములు కలిగినవి. కానీ అర్ధభక్షితుడైన నాయకుడు తల్లిదండ్రుల కభివాదము చేయుటకు గూడ నశక్తుడై పడియుండెను. అతని శరీరస్థితిని చూచి విలపించుచున్న తల్లితో 'అంబ! పరమార్థత' ...

మేదోఽస్థి మాంసమజ్జా సకృత్త్యంఘాతేఽస్మిం స్త్వచావృతే ।
శరీరేఖలు కా శోభా సదా బీభత్సదర్శనే (V-23)

(శరీరము అస్థిమాంసత్వగాదుల సమ్మేళనరూపమే కదా! దీనికి అందమేమి) యయనగా వినిన గరుడుడు, సిగ్గువీడి పాప నివృత్తికి మార్గమడుగును. అప్పుడు నాయకుడు చెప్పిన వాక్యమే ఈ నాటకమున నుపదేశము.

## నాగానందము - ఉపదేశము :

"నిత్యం ప్రాణాభిఘాతాత్ప్రతి విరమ కురు ప్రాకృతస్యానుతాపం
యత్నాత్పుణ్య ప్రవాహం సముపచిను, దిశన్ సర్వసత్త్వేష్వభీతిమ్ ।

మగ్నం యే నాత్రనైనః ఫలతిపరిణతం ప్రాణిహింసా సముత్థం
దుర్గాధే వారిపూరే లవణఫలమివక్షిప్త మన్తర్హ్రదస్య. (V-24)

"ఇకనుండి ప్రాణిహింసను విడువుము. చేసిన దానికి పశ్చాత్తాపము నొందుము. సర్వజీవ రక్షను ప్రకటించి, తదాచరణమున పుణ్యము సంపాదించు కొనుము. యిట్లు కష్టపడి నీవు సమకూర్చుకొనిన పుణ్య సముద్రమున, నీవు లోగడ చేసిన హింసాజనితమైన పాపము-ఒక ఉప్పురాయివలె కరగపోవుగాక!" ఈ ఉపదేశమును విని గరుడుడు "ఇంతవరకూ అజ్ఞానమనెడి నిద్రలో పడియున్న నేను నీచే మేల్కొల్పబడితిని. ఇకనుండి ఎట్టి జీవహింసను చేయను" అని వాగ్దానము చేయును. దీనితో ఈ నాటకమున కవి చెప్పవలసిన విషయము పూర్తి అయినది. ఇట్టి ఉపదేశమున ఆలంబముగా నిలచిన నాయకుని భవితవ్యమేమియను ప్రశ్న మాత్రము సహృదయుని ఎదుట మిగిలియున్నది. శరీరము క్షతమైనప్పుడు భౌతికముగా భరింపరాని బాధపడుట సహజము. కాని యింతవరకునూ నాయకుని యందు అట్టి ఛాయలుకూడ లేవు. ఇది లోక విరుద్ధము. ఇట్టి లోకవిరుద్ధములను ప్రదర్శించినచో సామాజికులకు విశ్వాసము కలుగదు. పైగా ఇది అసంభవ మనిపించును. వెంటనే అట్టి ధర్మాచరణమునకు ప్రచోదనము పోవును. కాన ఇట్టి విప్రతిపత్తిని తొలగించుట నాటకాంతమున సూచితమైనది. ఇంతవరకూ మరణ వ్యధను లోలోమునే యనుభవించుచున్న నాయకుడు ఆ బాధను వ్యక్త మొనర్చుచూ:

గాత్రాణ్యమూని నవహన్తి సచేతనత్వం
శ్రోత్రం స్ఫుటాక్షర వదాం నశృణోతి వాచం ।
కష్టం నిమీలితమిదం సహసైవచక్షు
ర్హా తాతయాన్తి వివశస్య మమాసవోఽమీ.॥ (V-29)

(ఈ నా అవయవములు చైతన్యమును కోల్పోవుచున్నవి. చెవులు సరిగా అక్షరములను వినలేకున్నవి. నా కళ్ళు మూతబడిపోయినవి. స్పృహను కోల్పోవు చున్న నా ప్రాణములు నన్ను వదలిపోవు చున్నవి" అనును.) ఇంతటి బాధ యింతకు ముందేమైన ? ఇది సామాజికుని ప్రశ్న. "పరార్థ సంపాదన రసాపేక్షేపా దేతావతీం వేలాం నవేదితాః సంప్రతితు మాం బాధితు మారబ్ధా మర్మచ్ఛేదినో్ వేదనాః" – (యితరుల కుపకారము చేయవలెననెడి అభిలాషా తీవ్రతలో యింతవరకూ లెక్కకురాని బాధలు యిప్పుడు నన్ను బాధించుట కారం

భించినవి) అనెడి నాయక వాక్యము ఆతని దయావీరమునకు స్థాయియైన ఆతని భవ్యోత్సాహ రహస్యమును బహిర్గత మొనర్చినది. ఇది తెలిసిన తర్వాత సామాజికులకు తాము గూడ అట్టి యత్నము చేయవచ్చుననియు, కష్ట సహిష్ణుత నలవరుచుకొనవచ్చుననియూ విశ్వాస మేర్పడుట కవకాశము కలిగినది. ఇంతలో నాయకుడు మరణించినాడు. వెంటనే ఆతని తండ్రి దుఃఖించుచూ ఒక ప్రశ్నార్థక వాక్యము పలికినాడు:

> నిరాధారం ధైర్యం కమివ శరణం యాతువినయః
> క్షమః శాన్తిం ఓఢుం క ఇహ విరతా దానపరతా ।
> హతం సత్యం సత్యం వ్రజతు చ కృపా క్వాద్య కృపణా
> జగజ్జాతం శూన్యం త్వయి తనయ లోకాన్తరగతే. (V-30)

"ఇక ధైర్యమున కాలంబము పోయినది. వినయమింక నెవరి నాశ్రయించును? క్షమాగుణమును అనుష్ఠించువాడీ జగమున నింక యెవ్వడున్నాడు? దానబుద్ధి ఇంక అస్తమించినది. నిజముగా సత్యము నశించినది. ఇంక దయాగుణము ఎవరి నాశ్రయించి మనగల్గును? ఓ కుమార! నీవు మరణించి పరలోకమున కేగగా, ఈ ప్రపంచము శూన్యమైపోయినది–" ఇది నాయకుని తండ్రి విలాపవాక్యము. కానీ మీలో ఈ గుణముల నుపాసించి, నిలబెట్టగల వాడెవ్వడూ? అని - భావోద్వేగమున నాటకము దర్శించు సమయమున, సామాజికులకు, కవి విసిరిన సవాలువంటి ప్రశ్న యిది - "నేను లేనా? నేను మాత్రము వీనికై ఆలంబము కాలేనా? వీని నుపాసించలేనా యని" ఒక్క ప్రేక్షక హృదయము అరాటపడిననూ నాటక రచనా ప్రయోజనము సంపూర్ణముగా ఫలించినట్లే. కనీసము అట్టి దశలో ఒక ఆలోచనా బీజము ప్రేక్షకుల హృదయమున నాటుకొనిననూ చాలు, కవి కృషి సార్థకమగును. అట్టి ప్రచోదనమునకు సబలకముగా దేవదేవియగు గౌరీముఖతః ఈ క్రింది శ్లోకమును గూడ పంచమాంకమున చివర నాయకుని బ్రతికించు సమయమున కవి చేర్చినాడు:

> "నిజేన జీవితేనాపి జగతాముపకారిణః ।
> పరితుష్టాస్మి తేవత్స జీవ జీమూతవాహన ! (V-33)

"స్వీయ ప్రాణమునైన యొసగి లోకోపకారము చేయుటచే నీ పట్ల నేను సంతృప్తి నందితిని. ఓ జీమూతవాహనా! నీవు మరల బ్రతుకుదువుగాక" అని గౌరి పలికిన పలుకులు. 'పరోపకారార్థమిదం శరీరం' అను నిష్ఠతో బ్రతుకువారు భగవదను

గ్రహమునకు పాత్రులై ఈ భూమిని చిరంజీవులుగా నుండుగాక యను యాకాంక్ష గూడ వ్యక్తమైనది.

పిమ్మట ఈ క్రింది భరత వాక్యముతో ఈ నాటకము పరిసమాప్తమగును:

వృష్టిం హృష్టశిఖండి తాండవకృతే ముంచంతు కాలేఽమ్బుదాః
కుర్వన్తు ప్రతిరూఢ సన్తత హరిచ్ఛస్యోత్తరీయాం క్షితిమ్!
చిన్వానాః సుకృతాని వీతవిపదో నిర్మత్సరైర్మానసై
ర్మోదన్తాం సంతతం చ బాంధవ సుహృద్గోష్ఠీ ప్రమోదాః జనాః!(V-39)

"నెమళ్ళ కానందము కలిగించు రీతిగా తగిన కాలమున మేఘములు వర్షించుగాక. ఎడతెగక పండిన పంటలతో ఈ భూమి సతతము హరితభరితముగా నుండునట్లు వర్షములు చేయుగాత. పరస్పర విద్వేషములను విడచి, ఆపదలు తొలగి, సత్ప్రవర్తనమున సమకూడెడి పుణ్య సంచయమును చేసికొనుచూ, బంధుమిత్రుల సహజీవనమున లభించు సౌఖ్యములను సతతము అనుభవించుచూ ప్రజలందరూ సుఖముగా జీవింతురు గాక!" ఇది నాయక ముఖమున కవి పలికించిన భరత వాక్యము. శ్రీహర్షుడు మత వైషమ్యాలు రాకుండ పరిపాలించెననుటకు - ఈ భరతవాక్యము నందలి "నిర్మత్సరైర్మానసైః" అను విశేషణము సూచకము.

కానీ వ్యంగ్యముగా బౌద్ధ ధర్మముయొక్క ఉత్కృష్టతను హర్షుడు దీనిలో ప్రతిపాదించు సమయమున చాల తెలివిగా సనాతన ధర్మమును, దేవతలను, ఋషులను గూడ చులకన చేసిన స్థానములు యీ నాటకమున చాల గలవు. నాటకమున సృష్టింపబడిన వాతావరణము వైదికమేగాని నిందితము గూడ వైదిక ధర్మమే అనుటకు ఈ క్రింది ఉదాహరణములను చూచిన చాలును: కుక్క మాంసము తినిన విశ్వామిత్రుని కథ, గౌతముడను భ్రష్ట బ్రాహ్మణుడు తన కుపకారమొనర్చిన నాడీజంఘుడను కొంగనే చంపుకు తినిన కథ- కశ్యప బ్రహ్మపుత్రుడై అకారణముగ నాగులను చంపుచున్నాడు గరుడుడు అను విషయముల ప్రతివేదనము ఇట్టిదే. నాడీజంఘుని కథలో—గౌతముడు నాడీ జంఘుని చంపగా, కోపించిన రాక్షసుడు గౌతముని చంపివేయును. అప్పుడు వానిని ఇంద్రుడు బ్రతికించినట్లు ఆ కథలో నున్నది. తప్పు చేసిన భ్రష్ట బ్రాహ్మణుని వైదిక దేవతయైన ఇంద్రుడు బ్రతికించినట్లు బౌద్ధగాథలలో చేర్పబడుట- ఇంద్ర దేవతను అవహేళనమునకే యనుట స్పష్టము. దానిని హర్షుడిందు ప్రతిపాదించి - బౌద్ధము యొక్క శ్రేష్ఠతను పరోక్షముగా వర్ణించెను. అట్లే శ్మశాన

వర్ణనమున, ఉరగభూషణుడైన వినాయకుని, సర్వనాశకుడైన రుద్రుని-భయంకర దైవశక్తులుగా శ్లేషతో వర్ణించినాడు. అట్లే- "తాను చేయు హింసకు స్వర్గమున దేవతలు సంతసించి, పూలవానను కురిపించి, ఆనంద దుందుభులు మ్రోగించుచున్నారని- " గరుడుని ముఖమున పలికించుటగూడ యిట్టిదే. ఇట్టివే చాల చోట్ల నర్మగర్భముగా, చతురతతో ఈ నాటకమున ప్రతిపాదితములైనవి. సర్వవ్యాపకమైన, సత్యమైన, సనాతన ధర్మమున అహింస, దయ, దానములు క్రొత్తవికావు. యజ్ఞ భావనమే త్యాగ జీవనము. కాన శ్రీహర్షుడు ప్రతిపాదించిన బౌద్ధుల త్యాగజీవనము - 'త్యాగేనైకౌనమృతత్వమానసుః' వంటి యుపనిషత్ప్రతిపాదిత ఉపదేశమే అయినందున - సహృదయులు. నాగానందమును దర్శించి ఆనందము నందుటలో విప్రతిపత్తి ఏనాడును ఏ విధముగనూ కలుగలేదు. భారతగాధలో-అమృత పానమునకు నోచుకొనని కాద్రవేయులకు- శ్రీహర్షుడు నాగానందమున అమృత వర్షము కురిపించుట - సమాశయ సూచకముగా సహృదయులంగీకరించుటకు సనాతన ధర్మమున విరుద్ధముగాదు. కావుననే బౌద్ధము ప్రతిపాదించిన అహింస, దయా, త్యాగ భావములు సనాతన ధర్మములోని భాగములే! కావుననే నేడు బౌద్ధము సనాతనధర్మ స్రవంతిలో లీనమైపోయినది. దయాభావమువంటి విశ్వజనీన విషయ ప్రతిపాదకమైన నాగానందము వంటి ప్రచారనాటకము నాటక శిల్పమున, రస నిబంధనమున అది సాధించిన విజయము మేరకే, సార్వకాలికమై సాహిత్య రంగమున తన సముచిత స్థానమును నిలబెట్టుకొనినది. కాన బౌద్ధమా? సనాతనమా? అను ప్రశ్న ఈ నాటకమున నేడుదయించదు.

## సంస్కృత నాటకములలో 'నాగానందము' :—

సంస్కృతనాటక సాహిత్యమున నాగానందము ఒక విశిష్ట స్థానమును సంపాదించుకొనిన దనవచ్చును. ఇతర సంస్కృత నాటకములతో పోల్చి చూచినప్పుడు ఈ నాటకమున అనేక ప్రాచీన నాటకముల ఛాయలు కొట్టవచ్చినట్లగుపించును. అట్లే దీని ఛాయలు గూడ తదనంతర కాలపు నాటకములలో అచ్చటచ్చట నగుపించును. ఇది సహజ పరిణామమే గాని, దోషముగా చెప్పుట తగదు. నాగానందమున నాయకునకు కుడికన్నదరుట వర్ణితము. అది క్రియాలాభ సూచకము. అది 'శాకున్తలము' నందు నాయకుని కుడిభుజ మదరుటను మనకు జ్ఞప్తి చేయును, నాయిక చెలికత్తె నాయకునకు స్వాగతము చెప్పుట

'నాగానందము'న గలదు. 'శాకున్తలము'న గూడ యిట్లే వర్ణితము. నాయిక చిత్రపటమును నాయకుడు చిత్రించుట 'నాగానందము'నను 'శాకున్తలము'నందు గూడ కలదు. తపోవన వర్ణనము ఈ రెండు నాటకములందునూ బింబ ప్రతి బింబములట్లు సాగినవి. అట్లే 'నాగానందము'న నాయిక గౌరీదేవి సముక్షమున దీక్షానిష్ఠయై వీణను వాయించుట 'కాదంబరి కావ్యము'లోని మహాశ్వేతవర్ణనమును పోలియున్నది. 'నాగానందము' నందలి 'విటుని' పాత్ర, 'మృచ్ఛకటికము'లోని శకారుని పాత్రను తలపింపచేయుచున్నది. తపోవన వర్ణనము-'నాగానంద', 'కాదంబరి'లలో సమముగా నున్నది.

అట్లే హర్షుని 'నాగానంద' ఛాయలు యితర నాటకములలో గూడ కనిపించును. కరుణరస నిష్యందిగా 'ఉత్తర రామచరితము'ను వ్రాయు సమయమున 'నాగానందము' భవభూతి మనసున నిలచియున్నదని భావింపవచ్చును. "ఏసం విదైర్విలసితైరతి బోధిసత్త్వైః" అను 'మాలతీమాధవము' నందలి వాక్యము దీనినే సూచించును. 'నాగానందము' నందలి శ్మశాన వర్ణనము, 'మాలతీ మాధవము' నందలి శ్మశాన వర్ణనమునకు ప్రాతిపదిక యనిపించును. 'నాగానంద' తృతీయాంకమున విదూషకుడు కోపమున నాయకుని విడచి వెడలి పోవుట-'కర్పూరమంజరి 'నాటకము నందలి విదూషకుని చేష్టకు భూమిక యను కొనవచ్చును. ఇట్లు నాటక ఘట్టముల సారూప్యతయేగాక, వాక్యములలోనూ భావములలో గూడ పరస్పర సంవాదము అనేక నాటకములతో 'నాగానందము' నకు గలదు.

"గృధ్రైరాబద్ధపక్ష ద్వితయ విధుతిభిర్బద్ధసాన్ద్రాన్ధకారే" (IV-74) అను నాగానంద వాక్యము 'ముద్రారాక్షస నాటకము' నందలి "గృధ్రైరాబద్ధ చక్రం వియతివిచలితైర్దీర్ఘ నిష్కంప పక్షైర్ధూమైర్ధ్వస్తార్కభాసాం సఘన మివ దిశాం మండలం దర్శయన్తః" (III-28) అను వాక్యమును పోలియున్నది.

అట్లే "దక్షిణం స్పన్దతే చక్షుః ఫలకాంక్షనమే క్వచిత్"-(నాగానంద I-9) అను వాక్యమునకు భూమిక"మనోరథాయనాశంసే కిం బాహోస్పంద సేవృథా"-(శాకున్తలమ్ VII-13) లో కనిపించును. అదే విధముగా "ఏతే...నిశ్చల ముఖ నిఃసరద్ధర దలితదర్భకవలాః సమున్నమితదత్తైక కర్ణాః సుఖసంమీలిత లోచనాః ఆకర్ణయన్త యివహారిణా లక్ష్యన్తే" - (నాగానందము I) అను వాక్యము "విశ్వాసోపగమాదభిన్నగతయః శబ్దం సహన్తే మృగాః" (శాకున్తలమ్ I-13)" అను వాక్యమును తలపింపచేయును.

"అహోనుఖలు ముదిత మునిజన ప్రవిచార్యమాణ సందిగ్ధ వేదవాక్య విస్తరస్య- వఠద్భహు వటుజన చ్ఛిద్య మానార్ద్రార్ద్ర సమిధ స్తాపస కుమారికా పూర్యమాణ బాల వృక్షాల వాలస్య ప్రశాన్త రమణీయతా తపోవనస్స" (నాగానందం-I) అను వాక్యము - ఈ క్రింది 'కాదంబరీకావ్య' వాక్యమును పోలి యున్నది. "అనవరత శ్రవణ గృహీత వషట్కార వాచాల శుకకులం ... ఆశ్రమం...వ్యాఖ్యాస్యమాన యజ్ఞవిద్యం-ఆలోచ్యమాన ధర్మశాస్త్రం,....... విచార్యమాణ సకల ధర్మశాస్త్రం...అపూర్య మాణ విట పాలవాలకం-ఆశ్రమా" (కాదంబరి-కాలే ప్రతి పుట-70-71) ఈ రెంటిలోనూ తపోవన వర్ణనమున పరస్పర సామ్యము ప్రతి విశేషణమునను గోచరించుట గమనార్హము.

అట్లే- "కిమత్ర యుష్మాకం తపోవన ఈదృశ్య ఆచారో యథాగతో అతిధి ర్వవచన మాత్రేణాపి న సంభావ్యతే
యుక్తం భణతి బ్రాహ్మణః ఉచితః ఖలు తేఽతిధి జనసత్కారః"
(నాగానంద-I)

"సఖినయుక్త మకృత సత్కార మతిధి విశేషం ఉఝిత్వాశ్రమవాసినో జనస్య స్వచ్ఛన్ద తోగన్తుమ్" (శాకున్తలమ్-I)

ఈ రెండు నాటకముల సంభాషణముల సారూప్యము స్పష్టము గదా!

అటులనే "...పిబన్తః పర్యాప్తం సహ సహచరీభిర్మధురసం
సమన్తా దాపానోత్సవ మనుభవన్తి మధుపాః (నాగానంద-III-7)
మధు ద్విరేఫః కుసుమైకపాత్రే పపౌ ప్రియాం స్వా మనువర్తమాన
(కుమార సంభవ III-36)

అను ఈ శ్లోకములలో-తుమ్మెదల జంటలు ఏకముగా మధువు నాస్వాదించుట వర్ణితము.

తృతీయాంకమున నాయకుడు, నాయిక ముఖ సౌందర్యమును వర్ణించిన ఈ క్రింది శ్లోకమున-

శ్లో. దినకర కరామృష్టం బిభ్ర ద్యుతిం పరిపాటలాం
దశన కిరణైః సంసర్పద్భిః స్ఫుటీకృత కేసరమ్,
అయిముఖ మిదం ముగ్ధే సత్యం సమం కమలేన తే
మధు మధుకరః కిం వైతస్మి న్నిబన్న విభావ్యతే.

(నాగానంద III-13)

ముఖపద్మము పద్మముతోనూ, చిరునగవులు కేసరములతోనూ పోల్చి-అధర మధువు నానుటకు-మధుప సంరంభము గూర్చి యిందు వర్ణితమైనది. ఇది కాళిదాసు వ్రాసిన ఈ క్రింది శ్లోకమునకు ఛాయ యనుటలో సందియ మక్కర లేదుగదా:

స్మయమాన మాయతాక్ష్యాః కించిదభి వ్యక్త దశనశోభి ముఖమ్.
అసమగ్ర లక్ష్య కేసర ముచ్ఛ్వ సదివ పంకజమ్ దృష్టమ్.
(మాళవికాగ్ని మిత్రమ్ II-31)

'నాగనందము'లోని భరత వాక్యమునకు-'మృచ్ఛకటిక'. 'మాలతీ మాధవముల' లోని భరతవాక్య శ్లోకములోని పంక్తులకు బహుధా సామ్యమున్నదనుటకు ఈ వాక్యములు చూచిన చాలును:

భవతు వసుమతీ సర్వ సంపన్న సస్యా పర్జన్యః కాలవర్షీ-
(మృచ్ఛకటికమ్)
మోదన్తాం ఘనబంధు బాన్ధవ సుహృద్గోష్ఠీ ప్రమోదాః ప్రజాః
(మాలతీ మాధవమ్)

## నాగానందము-కవితా వైభవము

'నాగానందము'న శ్రీహర్షుని వర్ణనానైపుణ్యము గూడ ప్రస్ఫుటముగా నిరూపించుటకు ఈ క్రింది ఉదాహరణములు సమర్థము లనవచ్చును. శ్రీహర్షుడు మలయపర్వతమును ఈ క్రింది విధముగా వర్ణించును:

మాద్యత్కుంజర గండభిత్తి కషణైర్భగ్నస్రవచ్చందనః
క్రన్దత్కందర గహ్వరే జలనిధే రాస్ఫాలితోవీచిభిః
పాదాలక్తక రక్తమౌక్తికశిలః సిద్ధాంగనానాం గతై
ర్దృష్టోఽయం మలయాచలః కిమపి మే చేతః కరోత్యుత్సుకమ్. (I-8)

తా॥ మదించిన యేనుగుల విశాలములైన గండస్థలముల ఒరిపిడిచే నేర్పడిన గాట్లనుండి రసమును స్రవించుచున్న గంధపు చెట్లతోనూ, విరుచుకుబడి లోనికి చొచ్చుకొనిపోవుచున్న సముద్రతరంగముల ధ్వనులచే ప్రతిధ్వనించుచున్న లోతైన గుహలతోనూ, ఇటు నటు సంచరించుచున్న సిద్ధ స్త్రీల కాలి పారాణి స్పర్శచే నెఱ్ఱబడిన ముత్యముల శిలలతోనూ, ఈ మలయ పర్వతము దర్శనమాత్రముననే నా మనస్సున నుత్సుకత రేకెత్తించుచున్నది.

ఈ క్రింది శ్లోకమున తపోవనము వర్ణితము. దీనికిని 'శాకున్తలము'లోని తపోవన వర్ణనమునకునూ పోలికలు కనుపించును.

శ్లో. వాసోర్థం దయయేవ నాతిపృథవః కృత్తాస్తరూణాం త్వచో
భగ్నానేక జరత్కమండలు నభః స్వచ్ఛం పయోనైర్ఝరమ్
దృశ్యన్తే త్రుటితోజ్ఝితాశ్చ వటుభిర్మౌంజ్యః క్వచిన్మేఖలా
నిత్యాకర్ణనయా శుకేన చ పదం సామ్నామిదం పఠ్యతే. (I-10)

''వృక్షముల పట్ల దయచేతనువలే, చెట్ల బెరళ్ళు వస్త్రార్థమై కొలదిగా మాత్రమే ఊడదీయబడినవి. ఆకాశమువలే స్వచ్ఛమైన సెలయేటి ప్రవాహము తనలో ఎన్నియో పగిలిన కుండలను కలిగియున్నది. అప్పుడే త్రుంచి వేడుకగా బాలురచే విసరివేయబడిన ముంజగడ్డిపరకలు అందందు బొత్తులు పడిఉన్నవి. ప్రతి దినమునూ వినుచున్న కారణమున ఇచట చిలుకచే సామవేదము పఠింపబడుచున్నది.''

ఈ క్రింది ఉద్యాన వర్ణము శ్రీహర్షుని కవితా నైపుణ్యమున కొక ఉదాహరణము :

నిష్యంద శ్చన్దనానాం శిశిరయతి లతామంటపే కుట్టిమాం తాన్
ఆశుత్రా ధారాగృహాణాం ధ్వనిమనుతనుతే తాండవం నీలకంఠః
యన్త్రోన్ముక్తశ్చ వేగాచ్చలతి విటపినాం పూరయన్నాలవాలా
నాపాతోత్పీడ హేలాహత కుసుమరజః పింజరో యంజలౌఘః (III-7)

తా॥ చందన వృక్షములనుండి స్రవించు రసము పూపొదరిండ్లలో నిర్మితమైన కాలిబాటల యంచులకు చల్లదనమును సమకూర్చుచున్నది. ధారా గృహములనుండి పడుచున్న నీటిధారల సంగీత నాదములను విని తదనుగుణముగా నెమళ్ళు నాట్యమాడుచున్నవి. నీటిని పైకితోడు యంత్రములనుండి వెలికి ప్రవహించుచున్న నీటి ప్రవాహము - జలపాతవేగమున కదలింపబడిన పువ్వులనుండి రాలిన పుప్పొడులచే పచ్చనై విలాసముగా, వేగముగా పరుగులు పెట్టి చెట్ల కుదుళ్ళను నీటితో నింపుచున్నది.

ఈ క్రింది శ్లోకమున, నడిమింటి ఎండ తీవ్రతకు గురియైన ఏనుగును శ్రీహర్షుడు వర్ణించిన తీరు కడు సముచితము :-

శ్లో॥ తాపాత్తత్క్షణ దృష్ట చన్దన రసాపాండూ కపోలౌ వహన్
సంసక్తైర్నిజ కర్ణతాలపవనైః సంవీజ్యమానాననః ।
సంప్రత్యేష విశేష సిక్త హృదయో హస్తోత్క్షిప్తైః సీకరైః
గ్లాయచ్ఛల్లక దుఃస్సహమివ దశాం ధత్తే గజానాంపతిః ॥ (I-20)

''ఎండవేడిమిని భరించలేక, తాపోపశమమునకై గంధపు చెట్ల నొరసికొని రాపిడి పెట్టగా, ఆ వృక్షముల నుండి స్రవించిన గంధపు రసము పులుముకొనిన గండస్థలముల నిండ తెల్లని వర్ణము గలిగి, విశాలములైన చెవి తమ్ములచే విసరబడిన గాలిచే, నూరట కలిగించబడుచున్న ముఖమును గలిగి, తన తొండముతో విరజిమ్మబడిన నీటిచే తడసిన వక్షస్థలమును కల్గి, ఎండిపోవుచున్న నల్ల వృక్షము యొక్క దయనీయమైన స్థితిని పోలియున్నదీ ఏనుగు.''

ఈ క్రింది శ్లోకమున నాయికా సౌందర్యమును శ్రీహర్షుడు వర్ణించిన తీరు కడు సుందరము:

శ్లో॥ ఖేదాయ స్తనభార ఏవకిముతే మధ్యస్య హారోవరః
తామ్యత్యూరుయుగం నితంబభరత ! కాంచ్యానయాకింపునః ।
శక్తిః పాదయుగస్య నోరుయుగలం వోఢుం కుతో నూపురే
స్వాంగైరేవ విభూషితాసి వహసి, క్లేశాయ కిం మండనమ్॥ (III-6)

తా॥ నీ స్తన భారమే నీ నడుమును బాధించుటకు చాలి యుండగా, మరల వేరొక కంఠహారము నేలధరింతువు? నీ యూరు ద్వయము నీ నితంబభారమును మోయలేక బాధింపబడుచుండగా మరల బంగారు వడ్డాణమేల ధరింతువు? నీ పాద ద్వయమునకు నీ యూరువుల భారమును మోయు నోపిక లేనప్పుడు-అందెల భారము నధికముగా సమకూర్చుకొంటివేల? సహజములైన అవయవముల చేతనే నీవు అలంకరింపబడితివి కదా ! యింక యితర ఆభరణములను ధరించు కష్టము నేల వహించితివి?" అట్లే— క్రొత్త పెండ్లి కూతురు ముఖమున ప్రియుని సమక్షమున వ్యక్తమగు సిగ్గు దొంతరలు శ్రీహర్షుడిట్లు వర్ణించినాడు :-

దృష్టా దృష్టిమధోదదాతి, కురుతే నాలాపమా భాషితా
శయ్యాయాం పరివృత్య తిష్ఠతి బలాదాలింగితా వేపతే ॥
నిర్యాన్తీషు సఖీషు వాస భవనాన్నిర్గన్తు మే వేహతే
జాతావామతయైవ మేఽద్య సుతరాం ప్రీత్యైనవోఢా ప్రియా॥ (III-4)

చూపులతో చూపులు కలిపినపుడు, సిగ్గుతో తన చూపులు క్రిందకు దించుకొనును. పిలచినపుడు బదులు పలుకదు. తల్పగతమైనప్పుడు నాకు వెనుదిరిగి ముఖము దాచుకొని పరుండును. బలవంతముగా కౌగలించుకొనబడినప్పుడు గడగడ వణకును. గది నుండి ఆమె చెలియలు వదలిపోయినచో వారితోబాటు తాను గూడ

వెడలిపోగోరును. యిట్టి చిలిపి చేష్టలు చేయుచున్ననూ, నా నూతన వధువు నాకు మరింత ప్రియతమ యగుచున్నది.

శృంగార వర్ణనమున లలితముగా సాగిన హర్షుని రచన గరుడుని వర్ణనమున రసోచితమై ఓజోపూర్ణమై యుండును.

శ్లో॥ పక్షోక్షిప్తాంబునాథః పటుతర పతన ప్రేర్యమాణైః సమీరై
ర్నేత్రార్చిః ప్లోషమూర్చా విధుర వినిపతత్సానల ద్వాదశార్కః।
చంచ్వా సంచూర్ణ్య శక్రాశని ధనద గదా ప్రేతలోకేశదండా-
నాజౌ నిర్జిత్య దేవాన్ క్షణమమృత మయీం వృష్టి మభ్యుత్సృజామి॥
(V-31)

తా. నా రెక్కల వేగమున సముద్రజలమును చెదరగొట్టి- నా కనులు విరజిమ్ము నిప్పుచే ద్వాదశాదిత్యులను అగ్నిదేవుని మూర్ఛలో ముంచి, నా ముక్కు యొక్క దెబ్బచే, ఇంద్రుని వజ్రాయుధమును, కుబేరుని గదను, యమ దండమును పిండిగా గొట్టి- అట్లు క్షణములో దేవతల నెల్ల యుద్ధమున ఓడించి- యిందు అమృత వర్షమును వీరందరిపై కురిపింతును." ఈ శ్లోకము గరుడుని పరాక్రమౌద్ధత్యమును ప్రతిపదమున ప్రకటించుచున్నది గదా.

శ్లో. జ్వాలాభంగై స్త్రిలోకే గ్రసన రసల సత్కాల జిహ్వాగ్ర కల్పైః
సర్పద్భిః సప్తహస్తై స్తృణమివ కబలీకర్తుమీశే సముద్రాన్
స్వైరే వోత్పాత వాత ప్రసర పటుతరైర్ధుక్షితే వక్షవాతై
రస్మిన్కల్పావసాన జ్వలన భయకరే బాడబాగ్నే పతామి॥

విజృంభించిన తుఫాను గాలి కన్నా తీవ్రతరమైన నా రెక్కల గాలిచే రగిలింపబడిన ఈ బడబాగ్నియందు పడి మరణింతును. మూడు లోకములను గ్రసించుటకు ఉరకలు వేయుచున్న కాలాగ్ని జ్వాలాజిహ్వలతో ప్రజ్వరిల్లు ఈ బడబాగ్నిలో పడెదను. తన సప్త జిహ్వలను అన్ని దిక్కులకు ప్రసరించి, సముద్రముల నన్నింటినీ ఒక ఎండు గడ్డిపోచవలె భస్మము చేయజాలిన ఈ బడబాగ్నిలో పడనెంతును. కల్పాంత అగ్ని వచ్చెనేమో యని లోకములకు భయమును కలిగించు నీబడబాగ్నిలో పడి నేను ఆత్మాహుతి చేసుకొందును.

## ముగింపు :-

నాటక రచయితలలో శ్రీహర్షుని దొక ప్రత్యేక స్థానము. కథ క్రొత్తది కాకున్ననూ, నాటకముగా దానిని మలచుటలో అతని ప్రతిభ వ్యక్తమగును.

కవిగా శ్రీహర్షుని స్థానము సమున్నతమని చెప్పక తప్పదు. ''శ్రీహర్షో నిపుణః కవిః'' అని స్వయముగా నాతడే చెప్పుకొనిన మాట ఆత్మవిశ్వాస పూర్ణమైన సత్యమేగాని- డాంబికము కాదు. ఈతనిని భావుకతలో భాస కాళిదాసులతో పోల్చ నక్కరలేదు కానీ, సందర్భోచితమైన, సరసమైన భాషను సహృదయ రంజకముగా నాత డుపయోగించుటలో చతురుడని చెప్పక తప్పదు. శబ్దాలంకారములు, మాటల గారడీలు ఆతని రచనము నగుపించవు. ఈ వ్యాసమునకు భరత వాక్యముగా శ్రీహర్షుని గూర్చి జయదేవ మహాకవి చెప్పిన శ్లోకము నుల్లేఖించి శ్రీహర్ష రాజకవికి అక్షర నీరాజనమిచ్చి, సహృదయులకు హృదయానంద ప్రదమగు నాగానంద నాటకానుశీలమును ముగింతును.

యస్యాశ్చోర శ్చికురనికరః, కర్ణపూరో మయూరో,
భాసో హాసః కవికులగురుః కాళిదాసోవిలాసః।
హర్షో హర్షో హృదయవసతిః పంచ బాణస్తు బాణః
కేషాం నైషా కథయ కవితా కామినీ కౌతుకాయ॥

ఓం తత్ సత్

# ముద్రా రాక్షసం

**అవధానము చంద్రశేఖరశర్మ**

## నామ నిర్వచనము

ముద్ర యనఁగా మొహరు వేయు నుంగరము. దానిని సాధనము చేసి కొని చాణక్యుఁడు నందుల మంత్రియగు రాక్షసుని లోఁబఱచుకొని, చంద్రగుప్తునకు మంత్రిగాఁ గుదిరించి మౌర్యరాజ్యమును సుస్థిరముగాఁ జేసిన కథ యీ నాటకములోని యితివృత్తము. అందువలన దీనికి ముద్రారాక్షసమను పేరు పెట్టఁబడినది.

## సాధారణ పరిచయము - విశిష్టత

ముద్రా రాక్షసము సంస్కృతము నందలి యేకైక రాజకీయ నాటకము. ఆ భాష యందలి నాటకములన్నింటిలోను దీనిది యొక విలక్షణమైన, విశిష్టమైన స్థానము. ఇతివృత్తములో, రసపోషణములో, సంవిధాన కౌశలములో, పాత్ర చిత్రణములో నిదియొక క్రొత్తఁదనమును సమగ్రముగా నింపుకొన్నది. ఇందలి యితివృత్తము తక్కిన వానిలోవలె పురాణ ప్రసిద్ధముగాదు; మఱి చారిత్రకము. ఇందలి ప్రధాన రసము వీరము. కాని యది లాక్షణికులు వింగడించిన దాన దయా యుద్ధాది భేదములలోఁ జేరదు. కత్తి నెత్తని యుద్ధము, శత్రువును చంపని విజయము నిందు ఆశ్చర్యకరముగా కూర్పఁబడినవి. శత్రువిజయమునకు యుద్ధము గాక రాజనీతి ప్రయోగము సాధనముగా అసాధారణమైన మెలఁకువతోను నైపుణ్యముతోను నిర్వహింపఁబడినది.

సంవిధానకౌశములో నొక్క మృచ్ఛకటికము తప్ప దీనికి సాటి రాఁగలిగిన నాటకము లేదు. కథ చాణక్య చంద్రగుప్తులకు సంబంధించినది యగుటచే నాయవకాశమును దీసికొని మహాకవి దీనికి చాణక్యుని యర్థశాస్త్రముతో నిపుణతమముగా సంబంధమును కలిపినాఁడు. అర్థశాస్త్రములో శాస్త్రకారునిగా గుర్తించిన చాణక్యుని నిందు తత్ప్రయోక్తగా దర్శింతుము.

ఇందలి పాత్రములు వైవిధ్యమును నిలుపుకొనుచునే కర్తవ్యమునెడ నేకోన్ముఖములై సముద్రమునకు పరువులెత్తు నదీ ప్రవాహములవలె నిలుపును అలపును నెఱుఁగక చైతన్య పూర్ణములై సాఁగును. ఇంత క్రొత్తఁదనమును సంతరించుకొన్నను నిది లాక్షణికుల నాటక లక్షణములకు విపులతమమగు నుదాహరణముగా నిలుచుట విశేషము.

ముందేమి జరుగునో యను నుత్కంఠను పెంచుచు సహృదయ హృదయములకు నాహ్లాదమును గలిగించు నీ నాటకము రంగ ప్రయోగ యోగ్యములైన సంస్కృత నాటకములలో నొకటియేగాదు; మేటి కూడ.

## కవి - కాలాదికము

ఈ నాటకము నందలి ప్రస్తావనవలన కవిని గూర్చి కొన్ని వివరములు తెలియుచున్నవి. కవి పేరు విశాఖదత్తుఁడు. పేరును బట్టియే దత్త వంశీయుఁడని గ్రహింతుము. ఈతని తాత వటేశ్వరదత్తుఁ డొక సామంతుఁడు. తండ్రి భాస్కరదత్తుఁడు మహారాజ పదము నందినవాఁడు. సామంత మహారాజ పదవులు రెండును మఱియొక గొప్ప రాజునకు లోఁబడినవే. సంవత్సరమునకు లక్షనుండి మూఁడులక్షల కర్షముల వఱకు రాజభాగము నందువాఁడు సామంతుఁడనియు, ఇరువదికి మించి యేఁబది లక్షల కర్షముల వఱకు రాజ భాగము నందువాఁడు మహారాజనియు శుక్రనీతి తెలుపుచున్నది. నాటక రచనా కాలమునకు తండ్రి యధికారము నెఱపుచుండుటవలనఁ గాఁబోలును కవి తన రాజకీయ పదవిని పేరుకొనలేదు. రాజకార్యములలో తండ్రికి తోడుపడుచు తాను ప్రధానముగా సారస్వత వ్యాసంగమున సాములు దీరుచుండెనని యూహింప వచ్చును.

తాము ఏ పెద్ద రాజునకు లోఁబడినవారో విశాఖదత్తుఁడు తెలుపలేదు. తెలిపియుండినచో నీతని కాలమును నిర్ణయించుట సుకరమై యుండెడిది. ఈ నాటకము చివరనున్న భరతవాక్య మొక్కటి కాల నిర్ణయమునకు సాధనము కాఁదగినది యున్నది. కాని దానిలో "పార్థివోఽవంతివర్మా", ''పార్థివశ్చంద్రగుప్తః'' అను ప్రధానములైన పాఠ భేదములు కాన వచ్చుట చేత నీ విషయములో విమర్శకులలో నేకాభిప్రాయము కుదుర లేదు. ఇందు పేర్కొనఁబడిన రాజు మ్లేచ్ఛుల దండయాత్ర నుండి భారత భూమి నుద్ధరించినవాఁడని నుతింపఁబడినాఁడు. ఆచార్య ధ్రువ పండితులు

"అవంతి వర్మా" యను పాఠమును గ్రహించినారు. ఈ యవంతి వర్మ స్థానే శ్వరము నేలిన ప్రభాకర వర్ధనునకు సమకాలికుఁడు. ఆతని సోదరి యగు రాజశ్రీని పెండ్లి యాడిన గ్రహ వర్మకు తండ్రి. ప్రభాకర వర్ధనునితో బాటు అతఁడును మ్లేచ్ఛుల (హూణుల) దండయాత్రలను త్రిప్పి కొట్టినవాఁడు, కావున భరత వాక్యములోని వర్ణనము సరిపోవును అని సమన్వయించి విశాఖఁ దత్తుఁడును ఆ కాలము (క్రీ.శ. 550-600) అనఁగా నాఱవ శతాబ్దము నుత్త రార్థము వాఁడని వారు సిద్ధాంతము చేసినారు. హిర్లిబ్రాండ్, స్పేయర్ మున్నగు వారు 'చంద్రగుప్తః' అను పాఠమును గ్రహించి వాయవ్య భారతమున హూణు లను ఢీకొన్న రెండవ చంద్రగుప్తుఁడు ఇందు పేర్కొనఁబడినాఁడనియు, అందువలన విశాఖ దత్తుఁడు నాలవ శతాబ్దము (క్రీ. శ. 375-413) చివరి వాఁడనియు తలఁచినారు. సుప్రసిద్ధ చరిత్ర పరిశోధకుఁడు వి.ఎ. స్మిత్తు ఈ యభిప్రాయమును బలపఱచినాఁడు. ఇంతకంటె నిర్ధారకములగు ప్రమాణ ములు దొరకునంత వఱకును రెండు సిద్ధాంతములును ఊహాధారములే అని తలంపవలసి యుండును.

ఈతఁడు ప్రస్తావనలో వరి పంటను, వర్ల దంపకమును ప్రస్తావించుట చేత వంగ దేశీయుఁడై యుండునని శారదారంజనులు అభిప్రాయపడినారు.

విశాఖదత్తుఁడు చాణక్యుని యర్థ శాస్త్రమునందు నిష్ణాతుఁడని యీ రచనమును బట్టియే తెలియును. నాట్య శాస్త్రమునను అట్లే. అటనట జ్యోతి శ్శాస్త్రమును, పంచమాంకములోని యొక శ్లోకమున తర్కశాస్త్ర పరిభాషను నుపయోగించుట చేత ఆ రెండు శాస్త్రములందుఁ గూడ పాండిత్యము కలవాఁడని యెఱుకపడును.

'దేవీ చంద్రగుప్తము' అను నాటకమును, రామాయణ కథగల మఱి యొక నాటకమును ఈ కవి రచించినట్లు లక్షణ గ్రంథములలోని యొకటి రెండు దాహరణములనుబట్టి తెలియుచున్నది. కాని ఆ గ్రంథములు ఇప్పుడు కానరావు.

## కథామూలము

ఈ నాటకమునందలి కథకు నిర్దిష్టమగు మూలము లేదు. చాణక్యుఁడు నందులను నాశముచేసి వారి రాజ్యమున చంద్రగుప్తుని ప్రతిష్ఠించినాఁడను నంత వఱకే మనకు చరిత్రనుండి తెలియును. భాగవతాది పురాణములలోను నింత

మాత్రమే యున్నది. దశరూపక మను నాటక లక్షణ గ్రంథములో వ్యాఖ్యాత దీనికి బృహత్కథ మూలమనినాఁడు. బృహత్కథ పైశాచిక భాషలోనిది యెన్నఁడో నశించినది. దాని సంగ్రహమగు సంస్కృత బృహత్కథామంజరిలో నందులు చాణక్యుని నవమానించిన విషయము మాత్రమే ఎక్కువగా నున్నది. కాఁగా మన కవి కొంత చరిత్రను, కొంత జన పరంపరలో ప్రచారములో నున్న కథను గ్రహించి, కొంత తన ప్రతిభతో కల్పించి నాటక కథను సిద్ధము చేసి నట్లు తోఁచును.

## పూర్వ కథ

మంత్రి ప్రతిమంత్రుల పన్నాగములపై పన్నాగములుగా సాఁగిన యీ నాటకమునందలి కథ మరి యే నాటకమునందును లేనంత చిక్కగా చిక్కుగా నున్నది. నాటకములో ప్రత్యక్షముగా నున్న కథా భాగమునే గాక ఆయా పాత్రముల సంభాషణాదులలో సూచింపఁబడిన పూర్వకథను గూడ నూహించు కొని సమన్వయము చేసికొనిననేగాని సమగ్రమగు నవగాహనము కుదురదు. అందువలన దానిని ముందుగా తెలిసికొందము.

పూర్వము సర్వార్థసిద్ధి యను రాజు పాటలీపుత్రము (దీనికి కుసుమపుర మనియు బేరు) రాజధానిగా మగధ రాజ్యమును పాలించుచుండెను. ఆతనికి ఇరువురు భార్యలు. ఒకతె క్షత్రియ వంశీయురాలు. ఆమె కుమారులు తొమ్మిది మంది. వారు నవ నందులను పేరుతో ప్రసిద్ధులై, గొప్ప బలవంతులై యుండిరి. రెండవ భార్య శూద్రవంశమునకు చెందినది. ఆమె పేరు ముర. ఆమె కుమారుఁడు చంద్రగుప్తుఁడు. తల్లిపేరును బట్టి మౌర్యుఁడనియుఁ బిలువఁబడు చుండెను. (ముర కుమారుఁడు మౌర్యుఁడు; ఆతని కుమారుఁడు చంద్రగుప్తుఁడు అని కొందఱ మతము.) చంద్రగుప్తుఁడు నందులకంటె చిన్నవాఁడు. రాజ లక్షణములు గలిగి వినయ వివేకములు శౌర్యము ఔదార్యము మొదలగు నుత్తమ గుణములతో నితఁడు ప్రజానురాగమునకుఁ బాత్రుఁడై యుండెను.

సర్వార్థసిద్ధి తన ముసలితనములో రాజ్యభారమును నందులపై నుంచి తాను విశ్రాంతిఁ దీసికొనెను. మహాబలశాలురగు నందులు నీతిచాతుర్యమును పరాక్రమమును గల వక్రనాసాదులగు మంత్రుల సాహాయ్యముతో శత్రువుల నెల్ల నణఁచివైచి, ఉత్తరమున హిమాలయము నుండి దక్షిణమున సముద్రతీరము వఱకును గల రాజ్యమును పరిపాలించుచుండిరి, వారి భాండాగారమున తొంబది

వందల కోట్ల ధనరాసులు మూలుగుచుండెను. అధికారము చేతను నైశ్వర్యము చేతను మదమెక్కిన నందులు కులము తక్కువవాఁడను తిరస్కారముతోను ప్రజానురాగమును పెంపొందించుకొనుచున్నాఁడను నసూయతోను చంద్రగుప్తుని లోలోపల ద్వేషించుచు నప్రధానమగు పదవిలో భోజనశాలకు అధికారిగా నియమించి సమయము చూచి సమయింపవలయునను తలఁపుతో నుండిరి. చంద్రగుప్తుడు దీనినంతయు కనిపెట్టుచునే యుండెను.

ఇట్లుండఁగా ఒకనాఁడొక బ్రాహ్మణ బ్రహ్మచారి భోజనమునకై నందుల భోజనశాలకు వచ్చి అచట నుత్తమ బ్రాహ్మణునకై యేర్పాటు చేయఁబడియున్న యగ్రపీఠమునఁ గూర్చుండెను. అతఁడు సామాన్యుఁడు గాఁడు; వేద వేదాంగములను, ప్రత్యేకముగ రాజనీతిని శుక్రాచార్యుల దండనీతిశాస్త్రమును సమగ్రముగ నేర్చినవాఁడు; మహామేధావి; కోపస్వభావుఁడు. పేరు విష్ణుగుప్తుఁడు; చణకుని కుమారుఁడు గావున చాణక్యుఁడని ప్రసిద్ధి నందినవాఁడు. గర్వోన్మత్తులగు నందులు అతనిని సామాన్యునిగాఁ దలఁచి యగ్రాసనమునుండి క్రిందికి నీడ్చిరి. ఆ యవమానముతో కన్నుల నిప్పులు గ్రక్కుచు నా బ్రాహ్మణుఁడు భోజనశాల నడుమ నిలిచి చేతితో తన సిగముడిని విప్పి ''గర్వాంధులై నన్నిట్లవమానించిన యీ నందుల నందఱను సమూలముగా నాశనముచేసిగాని నా యీ సిగను ముడివేసికొన''నని ఘోరమైన ప్రతిజ్ఞను చేసి తత్క్షణమే అచటినుండి నగరమును దాఁటిపోయెను.

ఇది యంతయును జూచుచున్న చంద్రగుప్తుఁడు ప్రజ్ఞాశాలి యగుటచే ''ఈ బ్రాహ్మణుఁడు అన్నంత పనిని సాధింపఁజాలినవాఁడే'' అని తలఁచి తానును నగరమునుండి రహస్యముగా తప్పించుకొనిపోయి చాణక్యుని శరణువేడి, తనకు నందులవలనఁ గలుగు నుపద్రవమును విన్నవించుకొనెను. చాణక్యుఁడును ఆతని వినయ వివేకాదులకు సంతోషించినవాఁడై 'నిన్ను నందుల రాజ్యమునఁ బ్రతిష్ఠింతు' నని మాటయిచ్చి, అతనిని తన యాశ్రయమున నుంచుకొని నందుల నున్మూలించుటకై ప్రయత్నములు చేయసాఁగెను.

చాణక్యునకు నిందుశర్మ యను సహాధ్యాయి యుండెను. ఆతఁడు జ్యోతిశ్శాస్త్రమును నేర్చినవాఁడు. అభిచారిక ప్రయోగములలో నందెవేసిన చేయి. చాణక్యుఁడు తన తొలి ప్రయత్నములోనే ఆతనిని బిలిచి ''నీవు క్షపణక వేషముతో జీవసిద్ధి యను పేరుతో నందుల మంత్రులందఱితోను స్నేహమును నటించుచు ప్రత్యేకముగ రాక్షసునకు విశ్వాసపాత్రుఁడవై యెప్పటి కప్పుడు

వేగు నడపుచుండు" మని ప్రార్థించెను. అతఁడును అట్లే వర్తింపుచు రాక్షసునకు మిక్కిలి సన్నిహితుఁడై యుండెను.

ఆ పిమ్మటఁ జాణక్యుఁడు చంద్రగుప్తునితోఁ గూడ పాటలీపుత్రమునకు దాదాఁపు నూరామడల దూరములో నున్న కొండ రాజ్యమునకు రాజగు పర్వత కుని యొద్దకుఁ బోయెను. ఆతనితో తాము నందులపై జరపనున్న దండయాత్రకు తోడుపడిన యెడల నందుల రాజ్యములో సగము నీకు పంచియిత్తుమని యొప్పం దము చేసికొని మహాబలుఁడగు నాతని సాయమును సంపాదించెను. తన బుద్ధిబల ముతో శకులు, యవనులు, కిరాతులు మొదలగు కొండజాతుల సైన్యముల నెల్ల సమకూర్చుకొనెను. ఇట్లు సన్నద్ధుఁడై యపారములగు నాసైన్యములతో దండెత్తి వచ్చి పాటలీపుత్రమును నలువైపుల ముట్టడించెను. నందులును యుద్ధమునకుఁ దలపడిరి. ఆ మహా యుద్ధములో రాక్షసుఁడు అంతటను తానే కనుపట్టుచు వీర విహారము గావించెను. కాని తుదకు జయలక్ష్మి చంద్రగుప్తునే వరించెను. నందు లందఱును నిహతులైరి. రాక్షసుని బల పౌరుషములు ఫలింపకపోయెను.

వృద్ధుఁడగు సర్వార్థసిద్ధి అసంఖ్యాకములగు నా శత్రు సైన్యములను గెలుచుట సాధ్యము గాదని తలఁచియు, చిరకాలపు ముట్టడిచే పురజనులకు గలుగు బాధలను సహింపలేకయు సొరంగపు మార్గమున రాజధానిని దాఁటి తపోవనము నకుఁ బోయెను. ఆతఁడు గూడ తొలఁగిపోవుటవలన నంద సైన్యముల యుద్ధ ప్రయత్నములు చల్లపడెను. రాజధాని చంద్రగుప్తుని వశమయ్యెను. కాని పౌరు లందఱును నందులపై ననురాగముతో నుందురని యనుమానించి చాణక్యుఁడు చంద్రగుప్తుని వెంటనే నగరములో ప్రవేశింపనీయలేదు. నగరము వెలుపల స్కంధావారములోనే కొంత కాలము నివసింపఁజేసెను.

రాక్షసుని స్వామిభక్తి యపారము. ఎట్లైనను నంద రాజ్యమును పునరుద్ధరించి స్వామి ఋణము తీర్చుకొనుటకు విశ్వ ప్రయత్నములు చేయ సాఁగెను. నగరములో గూఢముగా దాఁగియుండి చంద్రగుప్తుని నుండి పర్వత కుని వేఱుపఱచుటకు లోలోపల మంతనములు సాఁగించెను. సమయము చూచి చంద్రగుప్తుని అంత మొందించుటకు నెన్నియో మాయోపాయములు పన్ను చుండెను. జీవ సిద్ధిచే నభిచార ప్రయోగమున విషకన్యను సిద్ధము చేయించి దానిని చంద్రగుప్తునకుఁ గానుకగాఁ బంపెను; దానిని గూడి యతఁడు చచ్చు నని, తన మిత్రుఁడగు దారువర్మయను శిల్పిని పిలిచి "నీవు రాజభవనము ప్రధాన ద్వారమును యంత్ర గోపురముతో నలంకరించి, చంద్రగుప్తుఁడు భవన ప్రవే

శము చేయునప్పుడు దాని నాతనిపైఁ బడఁద్రోసి చంపు"మని నియమించెను. చంద్రగుప్తుని మావటివా డగు బదరికుని, రాజు పడకటింటి యధికారి యగు ప్రమోదకుని లంచము లిచ్చి లోఁబఱచుకొనెను. కొందఱు వీరభటులను రాజ భవనపుఁబడకటింటి గోడలలోని సొరంగములలో దాఁగియుండి చంద్రగుప్తుఁడు నిద్రించునప్పుడాతని జంపునట్లు ఏర్పాటు చేసెను. ఆస్థాన వైద్యుఁడగు నభయ దత్తుని రసాయనౌషధములో విషము కలిపి చంద్ర గుప్తున కిచ్చునట్లు కుది రించుకొనెను. తన పక్షము వారి నందఱను చెదరకుండఁ జేపట్టి యుంచుకొను టకు తనకు నత్యంత విశ్వాస పాత్రుఁడును ప్రాయసకాఁడును నగు శకటదాసు నపారమగు ధనరాశి నప్పగించి నియమించెను. తరువాత శత్రు సైనికులు నగ రములో చంద్రగుప్తుని విజయమును చాటించుటకు రాగా వారిని తరిమికొట్టి, దానివలన తాను నగరములో దాఁగియున్న సంగతి బయటపడి అపాయము కలుగునను శంకతోను, వెలుపలికి పోయి సహాయ సంపదను సమకూర్చుకొని వచ్చి మరల నందరాజ్యమును స్థాపింతునను తలఁపుతోను తన భార్యాపుత్త్రిలను ప్రాణమిత్రుఁడగు చందనదాసు నింట భద్రముగా దాఁచియుంచి తాను రహస్య మార్గమున రాజధానిని వదలిపోయెను.

మహామేధావి యగు చాణక్యుఁడు రాక్షసుని ప్రతిచలనము మీఁదను కన్నుంచి చంద్రగుప్త రక్షణమున జాగరూకుఁడై యుండెను. చంద్రగుప్తునికై రాక్షసుఁడు కానుకగా నంపిన విషకన్యను జీవసిద్ధి మూలమున గుట్టు తెలిసికొని పర్వతకునకు కానుక పెట్టగా, అతఁడు దానిని ననుభవించి రాత్రికి రాత్రియే మృతుఁడయ్యెను. తరువాత తనకాప్తుఁడు సేనాపతి తమ్ముఁడు నగు భాగురాయ ణుని బిలిచి ''నీవు పర్వతకుని కుమారుఁ డగు మలకేతువుతో 'నీ తండ్రిని చాణక్యుఁడే చంపించినాఁడు; ఇక్కడనే యున్నచో నీకును అపాయము తప్పదు' అని యేకాంతమున భయపెట్టి పరారి చేయించుకొనిపోయి సమయము వచ్చు నంతవఱకును కొంతకాలము నీవును అచటనే యుండుము'' అని నియోగింపఁగా అతఁడును అట్లు గావించెను. నిజరాజ్యము చేరిన మలయకేతువు భాగురాయణుని తన ప్రాణ రక్షకుఁడని విశ్వాసముతో మంత్రిగా నియమించుకొనెను. ఇచట చాణక్యుఁడు "మాకు ఆప్తుఁడను పగతో రాక్షసుఁడు విషకన్యను ప్రయోగించి పర్వతకుని చంపినాఁడని'' ప్రకటించి జనులలో ప్రచారము చేయించెను.

ఇట్లు రాక్షసుని ప్రయోగమును రాక్షసునకే త్రిప్పికొట్టి చాణక్యుఁడు రాక్షసునితో లాలూచీ పడుచున్న పర్వతకుని అంతమొందించుట, వాని కుమా

రుని దూరముగా తఱిమి వేయుట, రాక్షసునిపై నిందమోఁపుట అను పెక్కు ప్రయోజనములను సాధించుకొనెను. తనపై నిందకు నవకాశము లేకుండుటకు పర్వతకుని తమ్ముఁడగు వైరోచకుని "మీ యన్నకు చెప్పిన సగము రాజ్యమును నీ కిత్తు" మని చెప్పి నమ్మించి తమ యొద్దనే నిలుపుకొనెను.

కొన్ని దినముల తరువాత చాణక్యుఁ డొకనాఁడు "ఈ నాఁటి యర్ధరాత్రమున చంద్రగుప్తుఁడు రాజభవన ప్రవేశము చేయు" నని ప్రకటించెను. తరువాత వైరోచకుని చంద్రగుప్తునితోఁ బాటు సింహాసనముపైఁ గూర్చుండఁబెట్టి సగము రాజ్యమును పంచియిచ్చెను. ఆ పిమ్మట వైరోచకుని సర్వాభరణములతో నలంకరించి, చంద్రగుప్తుని యేనుఁగుపై నెక్కించి, చంద్రగుప్తుని ననుసరించు రాజులను వెంటనంపి రాజభవన ప్రవేశము చేయఁబంపెను. ప్రధాన ద్వారము నొద్ద ననుయాయులు నిలిచినంతట నొంటరియగు వైరోచకుని- చంద్రగుప్తుఁడను భ్రమతో - చంపుటకు మావటిఁడు అంకుశమునొరలో దాఁచినకత్తిని దూసెను. దారువర్మ యంత్ర గోపురమును పడద్రోయుటకు సిద్ధపడెను. మావటివాఁడు అంకుశము నొరను తాఁకఁగనే యేనుఁగు తటాలున నడకను మార్చెను. దానివలన దారువర్మ త్రోసిన యంత్ర గోపురము మావటిపైఁ బడఁగా వాఁడు చచ్చెను. ప్రాణములపై నాశవదలిన దారువర్మ యంత్రమున కమర్చిన మేకుతో వైరోచకుని పొడిచి చంపెను. అక్కడనున్న జనులు దారువర్మను కొట్టిచంపిరి. ఇట్లు రాక్షసుని యీ ప్రయోగములు గూడ నిష్ప్రయోజనములై చాణక్యునకే అనుకూలించెను.

చాణక్యుని మెలఁకువ యింకను నిశితమయ్యెను. శయనాధికారియగు ప్రమోదకుఁడు తన యోగ్యతకు మించి ధనమును వ్యయించుచుండఁగా కనిపెట్టి నీ కింత ధన మెక్కడిది? అని ప్రశ్నించి తబ్బిబ్బుగా జవాబులు చెప్పినంతట వానిని నిగ్రహించెను. రాజశయన గృహమును ముందుగా తాను పరిశీలించి యొక గోడ బొరకలోనుండి చీమలబారు మెదుకు చిదపలను తెచ్చుచుండఁగాఁ జూచి, లోపల నెవరో మనుష్యులు దాఁగియున్నారని పసివట్టి ఆ యింటిని కాల్పింపఁగా లోపలివారు లోపలనే మరణించిరి. ఆస్థాన వైద్యుఁడు విష చూర్ణమును గలిపిన రసాయనమును చంద్రగుప్తునకీయఁగా దానిని బంగారు గిన్నెలో నుంచి, గిన్నెరంగు మాఱుటను చూచి అది విషపుమందని కనిపట్టి దానిని వైద్యునకే బలవంతముగఁ ద్రాపఁగా నాతఁ డస్తమించెను. ఈ విధముగా చేసి చాణక్యుఁడు చంద్రగుప్తుని రక్షించెను.

రాక్షసుని స్వామిభక్తిని ప్రజ్ఞాపాటవమును జూచి చాణక్యున కాతనిపై మిక్కిలి గౌరవము కలిగెను. మొదటి నుండియు చాణక్యునకు రాక్షసునిపై ప్రత్యేక దృష్టియే. అందులకే జీవసిద్ధిని ఆతనితో నేస్తము చేయించుట. "తన రాజు లందఱను నశించినను వారి ఋణము తీర్చుకొందునని యీతఁడింకను మాపై కత్తిగట్టుచున్నాఁడే! ఎంత స్వామిభక్తి! ఈతని ప్రజ్ఞయు పరాక్రమమును గూడ సామాన్యములు గావు; ప్రజలకును నీతనిపై నంతులేని విశ్వాసము. ఇతనిని లోబఱచుకొను నంతవఱకును చంద్రగుప్తుని రాచఱికమునకు కుదురుపాటుండదు కాని, యితఁడు సులువుగా లోఁబడఁడు. నందవంశమును పూర్తిగా లేకుండఁ జేయవలెను. మఱియెక్కడను నాశ్రయము లేకుండఁ జేయవలెను. ఇఱుకునఁ బెట్టి యెట్లైనను లోఁబఱచుకొనవలెను. చంద్రగుప్తునకు మంత్రిత్వమును వహించునట్లు ఒప్పింపవలెను." ఇట్లు ఆలోచించి చాణక్యుఁడు నందవంశము వాఁడగు సర్వార్థసిద్ధిని తపోవనములో నున్నవానిని అచటనే చంపించెను. రాక్షసునితో లోలోపల మంతనము లాడుచున్న పర్వతకుని కథ ముందే ముగిసి యుండెను. రాక్షసుఁడింకను తన ప్రయత్నమును విరమింపక మలయకేతువు నాశ్రయించి తమపై దండెత్తనున్నాఁడను వార్త చాణక్యునకు తెలియవచ్చెను. మలయకేతువునకు రాక్షసునిపై నపనమ్మకము కలిగించి రాక్షసుని నిరాశ్రయుని జేయుటకు చాణక్యుఁడు యత్నింపసాఁగెను.

ఇది పూర్వకథ; నాటకము నారంభమునందలి ప్రస్తావనలో నటీసూత్రధారుల సంభాషణలో చంద్రగ్రహణమును గూర్చిన ప్రసంగము వచ్చును. ఆ సందర్భమున సూత్రధారుఁడు నటితో "కేతువుతోఁ గూడిన క్రూరగ్రహము చంద్రుని క్రమ్మివేయనుండుట నిజమే. కాని అది జరుగనీయకుండ బుధుని సంబంధ మాతనిని కాపాడుచున్నది" అని పలుకును. వారప్పుడు కథలోని పాటలీపుత్రమువారుగా మాఱియుందురు. కావున సూత్రధారుని మాటలలో రాక్షసుఁడు మలయకేతువుతోఁగూడి చంద్రగుప్తునిపై దండయాత్ర చేయనున్నాఁడను భావమును గ్రహించి, "ఎవఁడురా నేనుండఁగనే చంద్రగుప్తుని నాక్రమించువాఁడు?" అని పలుకుచు చాణక్యపాత్రము రంగమున ప్రవేశించును. ఇది నాటక మర్యాద. ఇటనుండి నాటక కథ యారంభమగును.

## నాటకీయ కథాసంగ్రహము

ప్రథమాంకమున కథారంగము చాణక్యుని కుటీరము. చాణక్యుఁడు సుదీర్ఘముగా తలపోసికొన్న స్వగతములో తనకు నందులు చేసిన యవమాన

మును, ఆ మీదట తాను ప్రతిజ్ఞ చేసి, నందుల నందఱను నాశము చేసి చంద్ర గుప్తుని రాజ్యమునఁ బ్రతిష్ఠించుటను ప్రస్తావించును. ఆ తరువాత నందుల మంత్రి యగు రాక్షసుని స్వామి భక్తిని, ప్రజ్ఞా పౌరుషములను ప్రశంసించి, యెట్లైనను నాతని లోఁబఱచుకొని చంద్రగుప్తుని కడ మంత్రిత్వమునకు నొప్పించినఁ గాని మౌర్య రాజ్యము స్థిరపడదను నిశ్చయమును, దానికై యింతకుముందే తాను చేసిన ప్రయత్నమును ప్రకటించును.

అంతలో పురజనులలో చంద్రగుప్తుఁడు సరిపడని వారిని కనిపెట్టుటకు మాఱు వేసములతో చాణక్యుఁడు పంపిన పలువురు చారులలో నిపుణకుఁడను వాఁడు ఆతని యొద్దకు వచ్చును. అతఁడు తాను మాఱువేసముతో యమ పటమును ప్రదర్శించుచు నిల్లుల్లు తిరుగుచు చంద్రగుప్తుడన్నఁ గిట్టని వారిని ముగ్గురిని గుర్తించితినని తెలుపును. "వారిలో మొదటివాఁడు జీవసిద్ధి యను బౌద్ధ సన్యాసి; రాక్షసుఁడు ప్రయోగించిన విషకన్యతో పర్వతకుని చంపిన వాఁడు. రెండవవాఁడు రాక్షసుని వ్రాయసకాఁడగు శకటదాసు; అతఁడు రాజ ద్రోహమునకు అనుచరులను ప్రేరేపించుచున్నాఁడు. మూఁడవ వాఁడు రత్నాల సెట్టి చందన దాసుఁడు; అతని యింటిలో రాక్షసుఁడు తన యాలు బిడ్డలను దాఁచిపోయినాఁడు" అని వివరించి, చందనదాసు నింటి యొద్ద తనకు దొరికిన యుంగరమును- రాక్షసుని పేరు చెక్కియున్న దానిని- చాణక్యున కప్పగించెను. రాక్షసుఁడే తన చేతికి చిక్కినట్లు సంతోషించి చాణక్యుడు నిపుణకుని ప్రశం సించి పంపివేయును.

ఆ పిమ్మట చాణక్యుఁడు రాక్షసుఁడు వ్రాసినట్లొక జాబును కల్పింపఁ దలఁచెను. దానితో రాక్షసుని జయింపవనలెని పన్నుగడను ఆలోచించుచుండఁగా చంద్రగుప్తుని యొద్దనుండి ప్రతీహరి వచ్చి "మహారాజులవారు 'పర్వతకులకు ఉత్తరక్రియలు చేయుదు' మనియు, "ఆయన ధరించిన యాభరణములను బ్రాహ్మణులకు దానముచేయఁ దలఁచి'తి మనియు విన్నవించుచున్నా'' రని తెలుపును. అందులకు చాణక్యుఁడు ''తగిన బ్రాహ్మణులను మేము పంపుదుము; వారికిదానముచేయు"మని చంద్రగుప్తునకు చెప్పి పంపి తనవారగు బ్రాహ్మణులతో వానిని దానము పట్టించి తెప్పించుకొనెను. తరువాత జాబును గూర్చిన పథకమును కుదుర్చుకొనెను. తాను ముందుగనే శకటదాసునితో కపటమైత్రిని జేయించిన సిద్ధార్థకుఁడను రాజపురుషుని బంపి ఆ జాబును శకటదాసుని చేతనే యూరు పేరులు లేకుండ వ్రాయించి తెప్పించుకొని దానిమీఁద రాక్షసుని యుంగరముతో

ముద్ర వేయించును. తరువాత నా జాబును నుంగరమునుగూడ సిద్ధార్థకుని చేతికి నిచ్చి "సమయము వచ్చినప్పుడు ఇట్లు చేయు"మని రహస్యముగా కర్తవ్యమును దెలుపును.

ఆ మీఁదట అపరాధమును ప్రకటించి జీవసిద్ధిని నగరమునుండి వెడలఁ గొట్టను, అట్లే శకటదాసును కొఱుతవేయను చాణక్యుఁ డధికారుల కాజ్ఞాపించును. కాని "వధ్యస్థానమునుండి శకటదాసును తప్పించి తీసికొనిపోయి రాక్షసుని యొద్దఁ జేర్పు" మనియు, "రాక్షసుఁడిచ్చు బహుమానమును గ్రహించి కొంతకాల మచటనే రాక్షసుని సేవించుచు నుండు" మనియు సిద్ధార్థకునకు నేకాంతముగా నుపదేశించును. "అట్లే చేయుదు"నని సిద్ధార్థకుఁడు వెడలిపోవును.

అనంతరము చాణక్యుఁడు చందనదాసును పిలిపించి రాక్షసుని గృహ జనము నప్పగింపుమని నయభయముల నడుగును. మిత్రవత్సలుఁడగు చందన దాసుఁడు దానికి నంగీకరింపకపోఁగా చాణక్యుఁడు కోపించి మరణదండన విధింపఁబడునని బెదిరించి తాత్కాలికముగా నాతని సకుటుంబముగ ఖైదుచేయ నాజ్ఞాపించును. ఇంతటి మిత్రుని గాపాడుకొనుటకైనను రాక్షసుఁడు తనకు లోఁబడి తీఱునని నిశ్చయించుకొనును.

ఇంతలో శిష్యుఁడు పరువెత్తుకొని వచ్చి సిద్ధార్థకుఁడు శకటదాసును వధ్యస్థానమునుండి తప్పించి తీసికొని పరారియైనాఁడని తెలుపును. వారిని తఱుముకొనిపోయి పట్టుకొనుఁడని భద్రభటాదులగు సైనికాధికారులకుఁ జెప్పు మనఁగా శిష్యుఁడు పోయి తిరిగివచ్చి వారందఱును ముందుగనే పరారి యయి పోయిరని విన్నవించును. అందఱును ముందుగనే వేసికొన్న తన పన్నుగడ ప్రకారము మలయకేతుని సైన్యములో చేరుటకుపోయినవారే కావున చాణక్యుఁడు లోలోపల సంతోషించుచు పైకి మాత్రము "ఎంతదూరము పోవుదురు? నేనిప్పుడే ఆ దుర్మార్గులను బట్టి తెత్తునులే" అని పలుకును.

రెండవ యంకమున కథారంగము మలయకేతువు రాజధానిలో రాక్షసుని విడిది. మలయకేతువు కడఁ జేరిన రాక్షసుఁడు తన విడిదిలో నందుల వంశ నాశమును గూర్చి శోకించుచు వారిపగను దీర్చుటకై తాను జేసిన ప్రయత్నములను గూర్చి తలపోయుచు నుండఁగా కంచుకి వచ్చి మలయ కేతువు బహుమానముగాఁబంపిన యాభరణము నాతని కలంకరించి పోవును. తరువాత పాములవాని వేషముతో కుసుమపుర వృత్తాంతములను తెలిసి

కొని వచ్చిన విరాధగుప్తుఁడను చారుఁడు ఏకాంతమున రాక్షసుని దర్శించును. అతఁడు రాక్షసుఁడు రాజధానిని దాఁటి వచ్చినది మొదలు అచటనేమేమి జరిగిన దియు, రాక్షసుని పన్నుగడ లన్నియు నెట్లు విఫలములైనదియు వివరించి, జీవ సిద్ధి నగరబహిష్కారమును, శకట దాసుని మరణశిక్షను, చందనదాసుని సకుటుబంముగ ఖైదు చేయుటయును గూడ విన్నవించును. ఆ పరిణామములకై రాక్షసుఁడు వగచుచుండఁగా శకటదాసుఁడు సిద్ధార్థకునితోఁ గూడ నచటికి వచ్చి వారిని ఆశ్చర్యపఱచును. సిద్ధార్థకుఁడు తన్ను మృత్యు ముఖమునుండి తప్పిం చినాఁడని శకటదాసుఁడు చెప్పఁగా రాక్షసుఁడు మిక్కిలిసంతోషముతో తానప్పుడు ధరించియున్న హారమును- తనకు మలయకేతువు బహుమతిగా పంపిన దానిని- సిద్ధార్థకునకు పారితోషికముగా నిచ్చును. సిద్ధార్థకుఁడు దానిని గ్రహించి "యిప్పటికి దీనిని తమ యొద్దనే దాఁచి యుంచుఁ"డని ప్రార్థించి, దాని నొక పెట్టెలో పెట్టి, తన యొద్దనున్న రాక్షసుని యుంగరముతో పెట్టెమీఁద ముద్రవైచి యిచ్చును. శకటదాసుఁడు దానిని చూచి "ఈ యుంగరము అమాత్యులవారిది" అని చెప్పఁగా సిద్ధార్థకుఁడు తన కిది రాజధానిలో చందన దాసుని యింటియొద్ద దొరికినదని చెప్పి దానిని రాక్షసునకే యర్పించెను. రాక్షసుఁడు దానిని అధికారముద్రగా నీ యొద్ద నుంచుకొనుమని శకటదాసున కిచ్చి వారిని పంపెను.

తరువాత కొంతసేపునకు శకటదాసు "ఆభరణములు మూఁడు అమ్మ కమునకు వచ్చినవి; కొనుమందురా?" అని సేవకునితో రాక్షసునకు చెప్పి పంపి యాతని యంగీకారముతో వానిని కొనును. ఆ పిమ్మట "చాణక్య చంద్ర గుప్తులకు లోలోపల సరిపడుచున్నట్లులే" దని విరాధగుప్తుఁడు తెలుపఁగా రాక్షసుడు ఆ విభేదమును పెంచుచు తగిన సమయమున చంద్రగుప్తుని పొగడ వలసినదిగా వైతాళికునకుఁజెప్పుమని సందేశించి యాతనిఁ బంపివైచును.

మూఁడవయంకమున కథారంగము పాటలీ పుత్రమున రాజ సభా ప్రాసా దము. చంద్రగుప్తుఁడు నగరమున కౌముదీ మహోత్సవమును జరుపునట్లు ఆజ్ఞాపింపఁగా చాణక్యుఁడు దానిని నిషేధించును. అది కారణముగా మాటపై మాట పెరుగును. చంద్రగుప్తుడు "రాక్షసుఁడే మీకన్న గొప్పవాఁడు" అనును. "అట్లయిన ఈ ఖడ్గమును ఆతనికే యిమ్ము" అని కోపముతో చాణ క్యుఁడు తన మంత్రి చిహ్నమగు ఖడ్గమును వదలిపోవును. చంద్రగుప్తుఁడు తాను స్వతంత్రముగా-చాణక్యునితో సంబంధము లేకుండ - వ్యవహరింతునని ప్రక

టించును. చంద్రగుప్తుఁడు తనలో 'ఈ తగవుసంతయును చాణక్యుల వారి యుపదేశమునను సరించియే నడపితిని; అయినను ఈ గురుతిరస్కారము నా మనస్సునకు ఎంతయో బాధను కలిగించుచున్నది' అనుకొనును. చాణక్యుఁడు 'ఈ తగవే రాక్షస మలయకేతువుల భేదమునకు తప్పనిసరిగా కారణమగును' అని తలంచును.

నాలుగవ యంకమున కథారంగము రాక్షసుని విడిది. రాక్షసుఁడు శకట దాసునితోఁ గూడ కార్యాలోచనము చేయుచుండఁగా కుసుమపురమునుండి కరభకుఁడను చారుఁడు వచ్చి యాతని దర్శించును. అంతలో మలయకేతువు రాక్షసుని పరామర్శించుటకై భాగురాయణునితోఁగూడ బయలుదేరును. త్రోవలో మలయకేతువు భాగురాయణునితో "భద్రభటుఁడు మొదలగు వారు చంద్రగుప్తునితో సరిపడక తొలఁగి వచ్చి మన సైన్యములో చేరినారు గదా? వారు 'మేము అమాత్య రాక్షసులను పురస్కరించుకొని గాక తమ సేనాపతి శిఖరసేనుని పురస్కరించుకొని తమ సైన్యములో చేరుచున్నా'మని విన్నపమంపినారు. దాని భావమేమి ?" అని యడుగును. దానికి భాగురాయణుఁడు "అమాత్య రాక్షసులకు పగయంతయును చాణక్యునిమీఁదనే గాని చంద్రగుప్తుని మీఁదఁ గాదు. అందువలన ఏ కారణముచేతనైనను చంద్రగుప్తుఁడు చాణక్యుని పదవినుండి తొలగించినయెడల అమాత్యు లాతనితో సంధి చేసికొనవచ్చును. అప్పుడు ప్రభువులు గూడ విశ్వసింపక పోవుదురేమో యను భావముతో నట్లు విన్నవించి యుందురు'' అని వివరించి మలయకేతువునకు రాక్షసునిపై ననుమానము కలిగించును.

వారిద్దఱును వాఁకిలి యొద్దకు వచ్చునప్పటికి లోపల రాక్షసుఁడెవరితోడనో యేకాంతమాడుచున్నట్లు తోఁపఁగా అచటనే మాటున నిలిచి వినుచుందురు. కరభకుఁడు చాణక్య చంద్రగుప్తుల కలహమును, చాణక్యుఁడు మంత్రి పదవిని వదలిపోవుటను వివరించుచుండఁగా రాక్షసుఁడు సంతోషమును ప్రకటించుటను మలయకేతువు గమనించును. మాటమాటను భాగురాయణుఁడు వేఱుగా వివరించుటచే నాతని యనుమానము దృఢమగును. రాక్షసుఁడు కరభక శకటదాసులను పంపివైచి తాను మలయకేతువును దర్శింతునని లేచునంతలో మలయకేతు భాగురాయణులు లోనఁ బ్రవేశింతురు. రాక్షసుఁడు మలయకేతువుతో చాణక్య చంద్రగుప్తుల కలహ వార్తను చాణక్యుని పదవీ త్యాగమును తెలిపి

''చాణక్యుఁడు లేని చంద్రగుప్తుని సులువుగా జయింపవచ్చును. దండెత్తిపోవుటకు ఇది మంచి సమయము'' అని తెలుపఁగా నతఁడు తాను మంత్రికి లోబడక స్వతంత్రుఁడుగా నున్నందులకు లోలోన సంతోషించుచు భాగురాయణునితోఁ గూడ నిష్క్రమించును. రాక్షసుఁడు దండయాత్ర సన్నాహములో నుండును.

అయిదవ యంకములో కథాంగము పాటలీపుత్రము దరిదాఁపులలో మలయకేతువు సేనలు విడిసినచోటు, భాగురాయణునినుండి ముద్ర తీసికొననిదే యెవరుగాని కటకమునుండి వెలుపలికి రాకపోకలు చేయరాదని సైనిక శాసనము. సిద్ధార్థకుఁడు తనవంతు కార్యక్రమమును సాఁగింపఁబూనును. అతఁడు పూర్వము చాణక్యుఁ డిచ్చిన జాబును తాను రాక్షసునియొద్ద దాఁచిన సొమ్ముల పెట్టెను తీసికొని భాగురాయణుని ముద్ర లేకుండనే వెలుపలికి ప్రయాణము సాఁగించును. జీవసిద్ధియును తన వంతు పనికి నుపక్రమించును. అతఁడు ముద్రకొఱకై భాగురాయణుని కడకుఁబోయి ప్రయాణ కారణమును వివరించుచూ పూర్వము రాక్షసుఁడు విషకన్యచే పర్వతకుని జంపెననియు దానివలన ఆతని స్నేహము కారణముగా తనకు నగర బహిష్కారము కలిగెననియు, రాక్షసుఁ డిప్పుడు మరల నేదో ద్రోహమును తలపెట్టుచున్నాఁడనియు, దానివలన తనకేమి వచ్చునో యని యాతనిని వదలిపోవుచున్నాననియుఁ దెలుపును. జీవసిద్ధి మాట లను మలయకేతువు మాటుననుండి వినును. అతనికి రాక్షసునిమీఁద చెప్పరా నంత యాగ్రహమును, నేవగింపును కలుగును.

రాక్షసున కపాయము కలుగకుండ చూడవలసినదని చాణక్యుని యాదే శము. అందువలన భాగురాయణుఁడు మలయకేతువుతో ''అప్పటి పరిస్థితులు వేఱు; అప్పుడు రాక్షసునకు చంద్రగుప్తునకంటే బలవంతుఁడగు మీ తండ్రియే ప్రబల శత్రువుగా నుండెను. దానివలన రాక్షసుఁడట్లు చేసియుండును. రాజనీతి దృష్టిలో నిది తప్పుగాదు. రాక్షసు నిప్పుడేమియుఁ జేయరాదు. మనకు జయము కలిగిన తరువాత మీ యిష్టము వచ్చినట్లు చేయవచ్చును'' అని సరిది చెప్పి యాతని శాంతపఱచును.

ఇంతలో ముద్రలేకుండ కటకమును దాఁటిపోవుచున్న సిద్ధార్థకుని రాజ భటులు పట్టుకొనివచ్చి మలయకేతువున కప్పగింతురు. తన ప్రశ్నముల కాతఁడు సరియగు సమాధానములు చెప్పకపోఁగా భాగురాయణుఁడు జాబును లాగికొని వీనిని నిజము చెప్పునంతవఱకు తన్నుఁడని రాజభటుల కప్పగించును. జాబుపై రాక్షసుని ముద్రయుండుట కాశ్చర్యపడుచు మలయకేతువు ముద్ర చెడ

కుండ విప్పి జాబును చదువుమని భాగురాయణుని కాజ్ఞాపింపఁగా నాతఁడట్లు చేయును.

ఆ జాబులో పేరులు లేవు. ఒకఁడు ఒకనికి వ్రాసినట్లుండెను. దానిలో "తొలుతటి యొప్పందము ప్రకారము మీరు మా శత్రువును తొలఁగించితిరి. సంతోషము. దానికి బదులుగా మేమును మీ శత్రువును మీ కప్పగింతుము. ఈ పనిలో సహాయులుగానున్న ప్రధాన పురుషుల కైదుగురకును ఒప్పుకొన్న ప్రతి ఫలమును ఈవలసినది. మీరు పంపిన యాభరణములు మూఁడును చేరినవి. మేమును గౌరవార్థమొక యాభరణమును పంపుచున్నాము. తక్కిన వివరములను సిద్ధార్థకుని వలన వినవలసినది" అని యుండెను.

ఇదియేమి? యని యాలోచించుచుండఁగా రాజభటులు సిద్ధార్థకుని చంక నుండి పడినదని నగలపెట్టెను తెచ్చి మలయకేతువున కప్పగించిరి. దాని మీఁదను రాక్షసుని ముద్రయుండెను. ముద్ర చెడకుండ తెఱపించి చూడఁగా నందు తాను రాక్షసునకుఁ బంపిన యాభరణముండెను. జాబు రాక్షసుని దనియు పంపునది చంద్రగుప్తునకనియు స్పష్టమయ్యెను. తన్నులు తినలేనివానివలె నటించుచు సిద్ధార్థకుఁడు అది యంతయు సత్యమే అని చెప్పి జాబులో సూచింపఁబడిన యైదురుగురి పేరులను గూడ తెలుపును. వారు మలయకేతువు సైన్యములో ప్రధానులగు రాజులు; రాక్షసునిపై భక్తి గౌరవములు కలవారు.

తరువాత మలయకేతువు రాక్షసుని పిలిపించి విషయమును తెలిపి, యిది యంతయు నేమి ? అని ప్రశ్నింపఁగా, 'నంతయు పగతుర పన్నాగము' అని బదులు పలికెను. ఆ యాభరణమును ఒక సంతోష సమయమున తాను సిద్ధార్థకునకు పారితోషికముగా నిచ్చితినని తెలిపెను. శత్రువులే దొంగ ముద్రను గూడ కల్పించి యుందురనెను. భాగురాయణుఁడు "ఈ జాబును వ్రాసినది యెవరు?" అని సిద్ధార్థకుని ప్రశ్నింపఁగా 'శకట దాసుఁడు' అనెను. 'శకటుఁడు వ్రాసి యున్నచో నేను వ్రాసినట్లే' అని రాక్షసుఁడు పలికెను. శకటదాసుని చేతి వ్రాఁతను ముద్రను తెప్పించి పరీక్షింపఁగా వ్రాఁత వ్రాఁతతోను, ముద్రతోను సరిపోయెను. రాక్షసుఁడు నిరుత్తరుఁడయ్యెను.

ఆ సమయమున రాక్షసుఁడు పూర్వము తాను కొనియున్న వానిలో నొక యాభరణమును ధరించియుండెను. దానిని చూచి మలయకేతువు అది తన తండ్రి తాల్చినదని గుర్తించి "యిది మీ కెట్లు వచ్చినది ?" యని యడిగెను. వర్తకుల కడ వెలకు కొంటినని రాక్షసుఁడు తెలిపెను. "ఇది మా తండ్రిగారు తాల్చినది; చంద్రగుప్తుని చేతఁబడినది. వెల కెట్లు వచ్చును ?" అని మలయ

కేతువు ప్రశ్నింపఁగా "శత్రువులే దీనిని మోసముతో మా కమ్మించి యుందురు" అని రాక్షసుఁడు పలికెను.

మలయ కేతువునకు పట్టరాని కోపము వచ్చెను. "విశ్వాస ఘాతుకుఁడా! పూర్వము నిన్ను నమ్మిన మా తండ్రిని చంపితివి; ఇప్పుడు నన్ను చంద్ర గుప్తునకు నొప్పగింప సిద్ధపడి యుంటివి. ఇంకను దాఁపరికమా? జీవసిద్ధి వలన అన్నియు తెలిసినవిలే" అని పెక్కువిధముల రాక్షసుని నిందించి, సిద్ధార్థకుఁడు తెలిపిన యైదుగురు రాజులను చిత్రవధ చేయు నట్లాజ్ఞాపించి "పో, నీ విక్కడనుండి; మీ చంద్రగుప్తునే ఆశ్రయింపుము. నీవును చంద్ర గుప్తుఁడును చాణక్యుఁడును కలిసి వచ్చినను అందఱను హతము చేయుదును" అని రాక్షసుని విదిలించి తాను సేనలను తరలించుటకు భాగురాయణునితోఁగూడ వెడలిపోవును.

ఇట్లు చిక్కఁగా బిగిసిన చాణక్యుని నీతి ప్రయోగమునకు జిక్కి యొంట రియై నిలిచిన రాక్షసుఁడు చంద్రగుప్తుని జయించు నాశను వదలి, 'చందనదాసు నైనను గాపాడెదను గాక' అని నిశ్చయించుకొని పాటలీపుత్రమునకు ప్రయా ణమై పోవును.

ఏడవ యంకమున రంగము పాటలీపుత్రము. రాక్షసుని తఱిమి వేయుటయును ప్రధానులగు రాజులను చిత్రవధ చేయించుటనుచూచి సైన్యములు ఈతఁడు వివేక శూన్యుఁడని తలఁచి మలయకేతువును వదలి తమ తమ దారులఁ బోఁగా భద్రభటాదులగు చంద్రగుప్తుని పక్షమువారు నిస్సహాయుఁడగు నాతని బంధించి పాటలీపుత్రమునకు తీసికొని వత్తురు. రాక్షసుఁడు రాజధానికి వచ్చి యూరి బయట నున్న జీర్ణోద్యానములో నున్నాఁడని చాణక్యుఁడు చారులవలన తెలిసికొనును. సిద్ధార్థకుఁడును నాతని మిత్రుఁడగు సమిద్ధార్థకుఁడను రాజ పురు షుఁడు చండాలవేషములతో చందనదాసును కొఱ్ఱవేయుటకు వధ్యస్థానమునకుఁ జేర్చునట్లు చాణక్య డేర్పాటు గావించెను. మహావీరుఁడగు రాక్షసుని చేతిలో కత్తియుండుట యపాయ మనియు నిరాయుధుని చేసినఁగాని కార్యము కుదుర దనియు తలఁచి చాణక్యుఁడొక చారుని బిలిచి కర్తవ్యము నుపదేశించి జీర్ణోద్యాన మునకుఁ బంపును.

ఆ చారుఁడు జీర్ణోద్యానమునకు పోయి రాక్షసుని గుర్తించి యాతనికి కను పడునట్లుగా నురివేసికొన యత్నించు వానివలె నటించెను. దయార్ద్ర హృదయుఁ డగు రాక్షసుఁడాతని సమీపించి యా సాహసమునకు కారణమడుగఁగా నతఁడు తన మిత్రుఁడగు జిష్ణుదాసుఁడు ఒక యాపద కారణముగా చిచ్చులోఁబడి చావ

సున్నాఁడనియు ఆ దుర్వార్తను వినకముందే ప్రాణములను వదలుటకు తానిట్లు చేయుచున్నా ననియుఁ జెప్పెను. జిష్ణుదాసుని యాపదను గూర్చి యడుగఁగా నాతని మిత్రుఁడగు చందనదాసును నేఁడు రాజభటులు కొఱత వేయనున్నా రనియు నా వార్తను వినకముందే తాను మరణింతునని జిష్ణుదాసుఁ డాసాహసము నకు పూనె ననియు చారుఁడు చెప్పెను.

రాక్షసుఁడామాయమాటలను నమ్మి తాను రాక్షసుఁడనియు, ఖడ్గము సాహాయ్యముతో చందనదాసును విడిపించి రక్షింతు ననియు, ఈ వార్తను తెలిపి జిష్ణుదాసుని ప్రయత్నము నుండి వారింపుమనియు వానికిఁ జెప్పెను. దానికి నతఁడు "పూర్వము ఎవఁడో యొకఁడు తలారులను కత్తిఁ జూపి బెదిరించి శకటదాసుఁ డనువానిని వధ్యస్థానమునుండి తప్పించినాఁడు. దానికి రాజు మండిపడి తలారులకు మరణదండన విధించినాఁడు. ఆనాఁటి నుండి ఘాతకులు మిక్కిలి మెలఁకువ గలిగి, కత్తిఁ బట్టుకొని యున్నవాఁడెవఁడైనను ముందు వెనుకల నగపడినచో వధ్యుఁడగు వానిని అక్కడికక్కడనే చంపివేయు చున్నారు. తాము కత్తిని పట్టుకొని పోయినచో చందనదాసునకుఁ జావు దగ్గర పడునేగాని తప్పదు" అని పలికి తన దారిని పోయెను.

రాక్షసుఁడు నిశ్చేష్టుఁడై కత్తిఁ బట్టుకొని పోయినచో పని చెడునని నిశ్చ యించి దాని నక్కడనే పాఱవైచి తన ప్రాణముల నర్పించియైనను చందన దాసును కాపాడుదునని వధ్యస్థానమునకుఁ బోయెను.

ఏడవ యంకమున రంగము పాటలీపుత్రము వెలుపల నున్న వధ్య స్థానము. చండాల వేషములతో నున్న రాజపురుషులు చందనదాసును వధ్య స్థానమునకుఁ దెచ్చి యచట కొఱత వేయుటకు సిద్ధమైరి. ఆతని భార్యా పుత్రులు విలపించుచుండిరి. అంతలో రాక్షసుఁడువచ్చి వారి నూఱడించి చండాలురతో "ఎవని కొఱకై శిబివంటి యీ మహాపురుషుని మీరు చంపఁ బూనితిరో ఆ రాక్షసుఁడనే నేను. ఇతనిని విడిచిపెట్టి ఈ శిక్షకు నన్ను గుఱి చేయుఁడు" అని పలికెను. అంతట చండాలురలో నొకనిని చందనదాసునకు కాఁపుంచి మఱియొకఁడు రాక్షసుని పిలుచుకొనిపోయి చాణక్యున కీవార్తను తెలి పెను. వెనువెంటనే చాణక్యుఁడు వచ్చి రాక్షసునకు వినయముతో నమస్కరించి, తాను పన్నిన పన్నాగముల నన్నింటిని మొదటినుండి వివరించి, "యీ ప్రయత్నమంతయును చంద్రగుప్తునితో మీరు సంధిచేసికొని యాతని ననుగ్ర హించుటకు నేను చేసినదే గాని వేఱుకాదు. అడుగో చంద్రగుప్తుఁడు మీ దర్శనమునకు వచ్చుచున్నాఁడు" అని పలికెను.

అంతలో చంద్రగుప్తుఁడు వచ్చి రాక్షసునకు వినయముతో నమస్క రించును. రాక్షసుఁడు చాణక్యుని ప్రజ్ఞాబలమును చంద్రగుప్తుని వినయాది గుణములను లోలోన మెచ్చుకొనును. చాణక్యుఁడు రాక్షసుని పరాక్రమాది గుణ ములను పొగడి మంత్రిత్వమును వహించి చంద్రగుప్తుననుగ్రహింపుఁడని ప్రార్థించును. అట్లు కానిచో చందనదాసునకు మోక్షమే యుండదనును. చందన దాసుని గాపాడుటకు మార్గాంతరము లేక మిత్ర స్నేహమునకు బద్ధుఁడై రాక్ష సుఁడు చాణక్యుని కోరిక కంగీకరించును. కృతకృత్యుఁడగు చాణక్యుఁడు సంతోషముతో మంత్రిత్వ చిహ్నమగు తన ఖడ్గమును రాక్షసున కొసఁగి చంద్ర గుప్తుని దీవించును.

అంతలో వార్తాహరుఁడు వచ్చి ''భద్రభటుఁడు మొదలగువారు మలయ కేతువును బంధించి తెచ్చి వాఁకిటనున్నా''రని తెలుపును. ''ఆ విషయమును అమాత్యరాక్షసులకు విన్నవించి వారు చెప్పినట్లు చేయు'' మని చాణక్యుఁడు పలుకును. రాక్షసుఁడు చంద్రగుప్తునితో మలయకేతువు నొద్ద కొంతకాలము తాను కొలువులో నున్న విషయమును తెలిపి, ఆతని ప్రాణములను రక్షింపుఁడని విన్నవించును. చాణక్యుఁడును ''అమాత్యరాక్షసులవారి యీ కోరిక తప్పకుండ తీర్చవలసినది'' అని పలుకుచు, ''అమాత్యరాక్షసులవారి విజ్ఞాపనముపై చంద్రగుప్త మహారాజులవారు మలయకేతువునకు అతనితండ్రి రాజ్యము నొసఁగినారు. మీ రాతని వెంటఁబోయి ఆతని రాజ్యమున ప్రతిష్ఠించి రావలసి నది'' అని భద్రభటాదులకు తెలుపునట్లు వార్తాహరున కాదేశించి పంపును. ''అమాత్య రాక్షసులవారిని సంతోషపెట్టుటకై మహారాజులవారు చందనదాసును అన్ని నగరములకును శ్రేష్ఠిముఖ్యుని గావించుచున్నా''రని ప్రకటించును. ఇట్లు చాణక్యుని ప్రయత్నము సఫలమై సర్వమును మంగళాంతమగును.

## సంవిధాన కౌశలము

ఈ నాటకమునందలి సంవిధానములను కవి పొందించిన నేర్పు ఎందును లేనంత యద్భుతముగా నున్నది. ఈ పొందికలో ఎందును సడలుగాని అడుకు గాని కానరాదు. ముందు వెనుకలో తడబాటు లేదు. అసంభవమను నూహకు తావులేదు. అన్నియు కార్యకారణ భావముతో చక్కఁగా సమన్వయము నందియున్నవి.

ప్రథమాంకములో చాణక్యుని భూతభవిష్యత్ ప్రయత్నముల సమాకలన మున్నది. దానివలన నాతని సామర్థ్యము, పట్టుదల, లక్ష్యశుద్ధి, ఆరంభమునన

పరిణామమును చూడఁగల నిశిత దృష్టి విస్పష్టములై, "యీతఁడు తలపెట్టిన కార్యమును తప్పక సాధింపఁగలవాఁడే" అనిపించును. రెండవ యంకములో రాక్షసుని ప్రయత్నములును వాని వైఫల్యమును వర్ణింపఁబడి యాతని స్వామి భక్తిని, ఏటికి నెదురీఁతను దెలుపుచు "అయ్యో! పాపము! ఈతఁడు గెలువఁడేమో" అనిపించును. మూడవ యంకమున రాక్షసుని భేదోపాయమునకు ప్రతిస్పందముగా నుండునట్లు చాణక్యుఁడు నటించిన కలహనాటకము నాలుగవయంకమున మలయకేతువునకు రాక్షసునిపై ననుమానము కలిగించుటకుఁ గారణమగును. పంచమాంకములో ఆ యనుమానమును బలపఱచి ప్రథమాంకమున సూచితమైన చాణక్యుని నీతి ప్రయోగము నలువైపుల నుచ్చులు బిగించి రాక్షసుని ప్రజ్ఞను మఱితలయెత్తకుండ చిదుకబొడిచినది. రాక్షసునిలో మిగిలియున్న పరాక్రమము ఆఱవ యంకమున చాణక్యుని నీతికి మోకరిల్లి శస్త్రసన్యాసము చేసినది. చారుని మాయమాటలచే నాతనిలోని మిత్రస్నేహము పొంగువాఱి ప్రాణార్పణమునకు సిద్ధపఱచి యేడవ యంకమునకు దారి తీసినది. ఏడవ యంకములో చాణక్య చంద్రగుప్తుల ప్రవర్తనము రాక్షసుని మనసులో వారిపై నున్న పగను తొలఁగించి మెచ్చుకోలు పుట్టించి యాతనిని వారి ప్రార్థనమునకు అభిముఖునిగావించినది. తన యప్పటి యేకైక కర్తవ్యమగు చందనదాస రక్షణము ఆతనిచే శస్త్రగ్రహణము చేయించి చంద్రగుప్తుని మంత్రి పదమున నిలిపినది. తొలి యంకములోని చాణక్యుని కోరిక మౌర్యరాజ్యస్థిరీకరణము సిద్ధించినది. ఇట్లు గొలుసుకట్టుగా సాఁగిన యీ సంవిధానచాతురి ప్రశంసాపాత్రమై వస్త్వైక్యమును సాధించినది.

## పాత్ర చిత్రణము

ఇందలి పాత్రములు యుద్ధరంగమున ప్రత్యర్థి పక్షములవలె రెండు విభిన్న వ్యూహములుగా మోహరింపఁబడినవి. వానిలో నెవరెవరికి నెవరెవరు దీటో వారిలో నెచ్చుతగ్గు లెట్లో పరిశీలించి తెలిసికొనుటకు ననువుగా వానిని జతలు జతలుగా నేర్పఱచి సామాజిక, పాఠక హృదయములలో చక్కఁగా హత్తుకొనునట్లు తీర్చినాఁడు కవి. ఎట్లో కొంచెము వివరముగాఁ దెలిసికొందము. చాణక్య రాక్షసు లొక జత; వీరు తమ తమ వర్గమును నడిపించు సేనానులు చంద్రగుప్త మలయకేతువు లొక జత; వీరు నాయక ప్రతినాయకులు. చాణక్యుని పక్షమున నిందుశర్మ ప్రాణమిత్రుఁడు; రాక్షసుని పక్షమున చందనదాసుఁడు; వీరొక జత. చాణక్యుని వారగు భాగురాయణ సిద్ధార్థకులును రాక్షసునివాఁడగు శకట దాసుఁ

డును ఒకజోడు. చారులలో చాణక్యుని నిపుణకుఁడును, రాక్షసుని విరాధ గుప్తుఁడును సుజ్జీలు. కడకు కంచుకులు వైహీనరి జాజలులు సైతము తారతమ్య పరీక్షకు నిలుచువారే.

కవి ఈ జతలలో తారతమ్యమును నిర్వహించిన నేర్పు సామాన్యమైనది కాదు. ప్రధానములగు చాణక్య రాక్షస పాత్రములను కవి చిత్రించిన విధమును పరిశీలింతము.

చాణక్య రాక్షసు లిరువురును మహామంత్రులే, మహామేధావులే, రాజ్య తంత్రముల గడఁదేఱినవారే. ఇరువురిలోను స్వార్థకాంక్షలేదు. ఒకరి యుద్యమమునకు శిష్యవాత్సల్యము కారణమైనచో మఱియొకరిదానికి స్వామిభక్తి. రెండును ప్రశంసింపఁదగిన గుణములే, అయినను నీ యిరువుర పాత్రములును ఎంత విస్పష్ట భేదములుగా తీర్పఁబడినవో చూతము.

చాణక్యుని ప్రజ్ఞ విజయముతో మెఱుఁగెక్కి యెదుగునది. దానికి మఱపు గాని, పొరపాటుగాని లేదు. నిత్య జాగరూకమది. అతఁడు పరీక్షించిగాని యెవరిని నమ్మఁడు, పనులలో నియోగింపఁడు. పరిణామమును ఆకళించుకొనిగాని యొక పనిని మొదలిడఁడు. రహస్యమును వెలుపలికి పొక్కనీయఁడు. అతని నీతి ప్రయోగములు "ఫలానుమేయాః ప్రారంభాః" అన్నట్లు ఫలమును చూచిన తరువాతఁగాని యెవరికిని అంతుపట్టవు.

రాక్షసుఁడీ యన్ని గుణములలోను దిగువనే నిలుచును. చాణక్యుఁడే ఆతనిని 'మంత్రి బృహస్పతి' అని పొగడినను ఆతని ప్రతిభ అపజయముతో, ప్రభువుల వినాశముతో క్రుంగిపోయినది. అందుచే అతఁడు పొరపడును; మఱపునందును. ఎవరినైనను నమ్మును. రహస్యమును కాపాడుటలోను తఱుగే. మలయకేతువు మొదలుకొని యాతఁడు చేపట్టినవారందఱును అపరీక్షితులును అసమర్థులును.

ఇఁక చంద్రగుప్త మలయకేతువులలో చంద్రగుప్తుఁడు చాణక్యునకు తగిన శిష్యుఁడు. ఆ గురుదేవుని ప్రతిభాపాటవమును, ఆతఁడు తన యభ్యుదయమునకు సంకితుఁడగుటను గుర్తించి విశ్వసించి యాతనిపైఁ గార్యభారము నుంచినవాఁడు. బాలుఁడయ్యును సంభావిత మహోదయుఁడనియు 'ద్రవ్యము' (యోగ్యుఁడు) అనియు రాక్షసునిచేతఁ గూడ మెప్పును గొన్నవాఁడు.

మలయకేతువిందులకు సర్వథా భిన్నుఁడు. రాక్షసుని ప్రతిభను గాని స్వామిభక్తిని గాని గుర్తింపఁడు. అతనిని నమ్మఁడు; పిల్లచేష్టలు వదలలేదు. తనకు వివేకము లేదు, రాక్షసుని మాటలలో నితఁడు అద్రవ్యము (పనికిరాని వాఁడు.)

ఇట్లే తక్కిన పాత్రల విషయమునఁగూడ చాణక్య పక్షమువారిని సమర్థులుగా సమయోచితమగు ప్రజ్ఞ గలవారినిగాని, రాక్షస పక్షమువారిని తద్భిన్నులగాను కవి నేర్పుగా మలిచికొన్నాఁడు.

## రసపోషణము

ఈ నాటకమున ప్రధానరసము వీరము. దానికి స్థాయిభావము ఉత్సాహము. "కార్యారంభేషు స్థేయాన్ ప్రయత్న ఉత్సాహః" తమ తమ కార్యములను నిర్వహించుటలో నిట్టట్టు తొణఁకని పూనిక యుత్సాహ" మని దాని లక్షణము. అది యీ నాటకములో ఒక్కొక్క పాత్రమునందును నొక్కొక్క రూపముతో తొణికిసలాడుచుఁ గానవచ్చును. చాణక్యుని యందు రాక్షసుని గుణములను "సాధు! అమాత్యరాక్షస! సాధు; మంత్రి బృహస్పతే! సాధు!" అని మెచ్చుకొనుటలోను, ఆతనిని లోఁబఱచుకోనుటకుఁ జేసిన ప్రతి ప్రయత్నములోను నీ యుత్సాహము స్పష్టమే. రాక్షసుని యందిది స్వామిభక్తి రూపమునను మిత్రుని యెడలఁ గృతజ్ఞతా రూపమునను కాన్పించును. చంద్రగుప్తునిలో ఆచార్య విధేయతా రూపమును, మలయకేతువులో పితృభక్తి రూపమును తాల్చినది. భాగురాయణ సిద్ధార్థకాదులగు చాణక్య పక్షరాజ పురుషులలో చలింపని స్వామికార్య నిర్వహణ పరాయణతగా భాసించినది. నందవంశము మీఁదను, వారి ఋణముఁ దీర్చుకొనుటకై శ్రమించు రాక్షసుని మీఁదను కలిగిన భక్త్యభిమానముల రూపమున విరాధగుప్తునిలో పొంగినది. రాక్షస మిత్రుఁడగు చందనదాసునిలో ప్రాణత్యాగమునకుఁ గూడ సిద్ధపడునంత దూరము అవిరుద్ధమగు స్నేహవాహినిగా గట్టుల నొరసినది. ఇంతయేల? చిన్న చిన్న పాత్రములగు దారువర్మాదులలోఁ గూడ ప్రాణములకుఁ దెగించిన కర్తవ్యపరతగా ప్రత్యక్షమగును.

ఇట్లు ఉత్సాహముస్థాయిగా సముచిత విభావాదులచేత పోషితమై సహృదయులగు సామాజిక, పాఠకుల హృదయముల వీరరసముగా ఆస్వాద్యమగుచున్నది. ఇట్లు పాత్రపాత్రమునను, పలుకు పలుకునను సడలువోనీక రసపోషణమును నొనరించిన మహాకవి అరుదుగా మాత్రమే యుండును.

భారతీయ సాహిత్యమున ముద్రారాక్షసస్థానము ఇంతటి యపురూపమగు శిల్ప చాతుర్యముతో సంతరింపఁబడినదైనను ఈ నాటకము భారతీయ సాహిత్య విమర్శకులకు నచ్చలేదు. వారి దృష్టిలో నిది యసత్కావ్యము.

ఏలయన, భారతీయ సాహిత్యమునకు లోకకల్యాణ కారణమగు ధర్మోపదేశము ప్రాణము. ఒక్క సాహిత్యమునకే కాదు; సమస్త వాఙ్మయ ప్రపంచమునకును అదియే యేకైక లక్ష్యము. వేదములు ప్రభుసమ్మితములై "ఇట్లు చేయఁ

దగును; ఇట్లు కూడదు" అని శాసించును. పురాణములు ఉదాహరణ రూపము లగు నితిహాసములను తెలిపి, ఇట్లు ధర్మ ప్రవృత్తులు అభ్యుదయము నందినారు; అధార్మికులు నశించినారు; కావున మీరును ధర్మమార్గమునఁ బోవుట యుచితము" అని మిత్రసమ్మితముగా బోధించును. ఇఁక సాహిత్యము పాఠకులకు ఇది బోధము అని తోఁపకుండ రసవంతముగా నితివృత్తమును చిత్రించి "మనము కూడ నిట్లు చేసి బాగుపడుదము; ఇట్లు చేయుట మానుదము" అను భావము కలుగునట్లు చేయును. పెద్దలు దీనిని కాంతా సమ్మిత మనినారు. కావున అన్నిం టను లక్ష్యమొకటియే.ఆద్యంతములగు ధర్మమోక్షములు గట్టులుగా, వాని నడుమ-వానిని కూలఁద్రోయకుండ అర్థ కామరూపమగు జీవన ప్రవాహము సాఁగవలె ననుట భారతీయ సంస్కృతి పరమార్థము. సంస్కృత కావ్యములలో ఈ దృష్టిని వదలినవి లేవు.

ఈ నాటకమునందలి యితివృత్త చిత్రణము ఈ సిద్ధాంతమును త్రోసి రాజన్నది. పురుషార్థములు నాలుగింటిలో నొక్క యర్థమునకు మాత్రమే పట్టము గట్టి ధర్మాధర్మ విచారమును దూరము చేసినది. అభిచారములు, హత్యలు, విశ్వాసద్రోహములు స్వామిభక్తి పేరుతో నిందు కార్యసాధనములుగా నల్లుకొన్నవి. ఈ నాటకమంతయుఁ జదివిన-లేక చూచిన తరువాత "ఇది మన కేమి బోధించుచున్నది?" అని ప్రశ్నించుకొన్నచో "ఏమి చేసియైనను పనిని సాధించుకొనవలెనని, ఋజుమార్గమున జయము లేదని" అని సమాధానము వచ్చును. ఇది కోరఁదగినదా?

చాణక్యుఁడు అత్యల్పమగు రక్తపాతముతో రక్తప్రవాహములకు కారణ మగు మహాయుద్ధము నాఁపినాఁడు; కావున ఆ మాత్ర మధర్మము సహింపఁదగి నదే యని యాధునిక విమర్శకులు కొందఱు అభిప్రాయపడినారు.

బాణుఁడు కాదంబరిలో శుకనాస హితోపదేశములోని "పరాభిసంధాన పరా మంత్రిణ ఉపదేష్టారః...సహజ ప్రేమార్ద్ర హృదయా భ్రాతర ఉచ్ఛేద్యాః" అన్న మాటలు ఈ నాటకమునకు గుఱి తాఁకును.

"కళ యానందమునకే కాని బోధమునకుఁగాదు" అను దృష్టితోఁ జూచి నపుడు అపురూపమగు నీ శిల్ప చాతుర్యమునకు అంజలి పట్టక యుండలేము.

"జయంతి తే సుకృతినో రససిద్ధాః కవీశ్వరా."

* మహిళలకోసం ప్రత్యేకంగా ఒక మహిళా విశ్వవిద్యాలయాన్ని తిరుపతిలో ప్రారంభించడం జరిగింది.
* గ్రామాలలో మంచినీటి ఎద్దడిని తీర్చడానికి కనీసం 100 జనాభాకు ఒక మంచినీటి వనరులను ఏర్పాటు చేస్తున్నారు.
* తరచుగా అనావృష్టికి గురయ్యే రాయలసీమ ప్రాంతాల్లో సాగునీటి సౌకర్యాన్ని కల్పించే ఉద్దేశంతోనూ, పొరుగునవున్న తమిళ సోదరుల దప్పిక తీర్చడానికీ మానవతా దృక్పథంతో తెలుగు గంగ పథకం చేపట్టబడింది.

## నవంబర్ 1, 1983 నుండి అమలు జరుగుతున్న నూతన కార్యక్రమాలు

**గ్రామోదయ:-** గ్రామీణ ప్రాంతాల్లో ప్రగతి పథకాలను చేపట్టి సౌభాగ్యాన్ని సాధించడానికి,నిరుద్యోగాన్ని నిర్మూలించేందుకు యువతకు స్వయం ఉపాధి సౌకర్యాలు కల్పించడానికి కేంద్ర సహాయంతో చేపట్టబడినది. ఈ కార్యక్రమం గ్రామీణాభివృద్ధికి యువత సేవలను వినియోగించుకోవటం ఈ పథకం ప్రధాన లక్ష్యం.

**దీప :-** ప్రతి జిల్లాలో ఉపాధి, పారిశ్రామిక పెంపుదల సంస్థను ఏర్పాటు చేసి విద్యావంతులలో నిరుద్యోగాన్ని పరిష్కరించడానికి ఉద్దేశింపబడినది ఈ కార్యక్రమం. గ్రామ సౌభాగ్య సాధనకు దీనివలన దోహదం కలుగుతుంది.

**విముక్తి :-** అతి హేయమైన పాకీ పనినుండి ఆ పనిలో ఉన్నవారికి విముక్తి కలిగించడానికి, గ్రామాలలో ప్రధానంగా మహిళల సౌకర్యార్థం సెప్టిక్ మరుగుదొడ్లను నిర్మించడానికి ఉద్దేశించినది ఈ పథకం. ఈ కార్యక్రమం క్రింద అన్ని మున్సిపల్ పట్టణాలలోను, రక్షిత మంచినీటి పథకాలు గల పెద్ద పంచాయతీలలోను తక్కువ ఖర్చుతో సెప్టిక్ మరుగుదొడ్లను దశలవారిగా నిర్మిస్తారు. సామాజిక మరుగుదొడ్ల నిర్మాణంలో ప్రయోగాత్మకంగా బయోగాస్ ఉత్పత్తికి అవకాశం కల్పించాలని ప్రభుత్వం నిర్ణయించింది. ఈ సందర్భంలో పాకీవృత్తిని అవలంబిస్తున్న వారి సంపాదనకు గాని ఆర్థిక ప్రతిపత్తినికిగాని భంగం కలగని రీతిలో వారికి పునరావాసం కల్పించబడుతుంది.

ఇటీవలి తుఫాను, వరదలవల్ల కలిగిన నష్టాన్ని భర్తీ చేయాలంటే పెద్ద ఎత్తున నిర్మాణ, సంక్షేమ, సహాయ, పునరావాస కార్యక్రమాల్ని చేపట్టాల్సి ఉంటుంది. ప్రభుత్వం చేపట్టే బృహత్తర కృషిలో ప్రతి పౌరుడు ముందుకువచ్చి ప్రభుత్వ కార్యక్రమాలలో భాగస్వామిగా తోడ్పడినప్పుడే యిది సాధ్యమౌతుంది.

# తెలుగు తేజం—వెలుగు నిత్యం

కాకతీయుల తర్వాత చెల్లాచెదురైన తెలుగు జాతి ఆంధ్రప్రదేశ్ ఏర్పాటుతో మళ్లీ ఒకేచోటకు, ఒకే నీడకు చేరుకొని అఖండ జాతిగా అవతరించింది. నాటినుంచీ గత కీర్తి స్మృతులను నెమరువేసుకుంటూ, వర్తమానాన్ని శుభకరంగా, సుందరంగా, సుఖప్రదంగా నిర్మించుకుంటూ, భవిష్యత్తును అఖండంగా ఊహించుకుంటూ ప్రగతివైపు పురోగమిస్తున్నది.

ఈ పురోగమన యాత్రను మరింత సుగమం చేయడానికి, రాష్ట్రాభ్యుదయాన్నీ, ప్రజా సంక్షేమాన్ని సత్వరమే సాధించడానికి శ్రీ ఎన్.టి. రామారావుగారి నాయకత్వంలో ఏర్పాటైన రాష్ట్ర ప్రభుత్వం అనేక కార్యక్రమాలు చేపట్టింది.

* 15 అంశాల 'ప్రగతి పథం' కార్యక్రమం ద్వారా బడుగువర్గాల జీవితాల్లో నూతన చైతన్యం వెల్లివిరిస్తోంది.
* సంక్షేమ సేవా కార్యకలాపాలకు నిధుల కేటాయింపు రెట్టింపు చేయబడింది.
* బలహీన వర్గాలకోసం 2,20,000 పక్కా ఇండ్ల నిర్మాణం దశలవారీగా చేపట్టబడింది.
* పేదవారికి కిలో బియ్యం రెండు రూపాయలకే అమ్మించే పథకంవల్ల 94.22 లక్షల మందికి లాభం చేకూరుతోంది.
* ప్రాథమిక విద్యావ్యాప్తికి 16,000 ఉపాధ్యాయులను ప్రత్యేక ప్రాతిపదికపై క్రొత్తగా నియమిస్తున్నారు.
* స్వచ్ఛమైన పాలనా యంత్రాంగాన్ని ప్రజలకు అందించే ఉద్దేశంతో ప్రభుత్వం నెలకొల్పిన **'లోకాయుక్త'** 1983 నవంబర్ 1 నుండి అమలులోకి వచ్చింది.
* వృత్తి విద్యాలయాల్లో అర్హతకు ప్రాధాన్యం యిచ్చే ఉద్దేశంతో కాపిటేషన్ ఫీజు వసూలు చేయడాన్ని ప్రభుత్వం నిషేధించింది.
* ప్రాథమిక విద్యావ్యాప్తికి మధ్యాహ్నభోజన పథకాన్ని అమలు పరుస్తున్నారు. దీనివల్ల దాదాపు 40 లక్షల మంది బలహీన వర్గాలకు చెందిన పిల్లలు ప్రయోజనం పొందుతున్నారు.

(మిగతాది మూడవ కవరు పేజీలో చూడుము)

సమాచార, పౌరసంబంధ శాఖ : హైదరాబాద్.

Proc. 170/Advt. II/04/83 dt. 24-11-83

Cover Printed at Sri Balaji Art Printers, Chikkadpally, Hyd-20.